కూర్చుండలేడు. వాని మనస్సునకు నైశ్చల్యము లేదు. దానికి దోడు మరి యేదో కారణముచేత బదియుండి కన్నులు తనమీద నున్నవని తెలిసినచో వానికి సభలో గూర్చుండుట మిక్కిలి కష్టమైన పని. అట్టివాడు లోక మేమను కొన్నను సరే తనకిష్టమైన పని తాను చేసెడివాడైనచో బరిహాస పాత్రుడగును. సారథి యానాడు పరిహాస పాత్రుడయ్యెను. కచేరీ పగము జరిగెను. వాసంతి స్వరము వేయుచుండెను కొందఱు తాళములు వేయుచుండిరి. కొందఱాహాహా యనుచుండిరి. బయటికి లేచిపోవుటకు సారథి లేచెను అందరి కన్నులతనిమీ దనే నిలిచెను. అతడు బయటికి వెడలిపోయెను. సభికులవిదేమి పారవశ్యమో యాదేమి తన్మయత్వమో యొకవ్యక్తి లేచి పెళ్ళింటిలోనూగడితల లాగినవి. తాళము వేయు చేతులు నిలిచినవి సభలో గుసుగుసలు బయలుదేరినవి. సారథి కదలకుండ గూర్చున్నచో సభ రక్తికట్టెడిదే, తరువాత వాసంతి యెంత ప్రయ త్నించినను సభలో నిశ్శబ్దత కలుగలేదు. ఆమె వెంటనే రాగాలాపన చేయ నారంభించెను. కల్యాణిరాగము పాడెను. సభ కొంత నిశ్శబ్దమైనది రాగా నంతరము మరల సభ యథాస్థితికి వచ్చెను. వాసంతి తరువాత నరగంట కన్న నెక్కువ పాడలేదు. సభలో నుండి యెవ్వరు లేచిపోరాదా. ఎందఱు లేచిపోరు. సారథి లేచిపోయినంత మాత్రమున యింతరసాభాస యేల కావలయును. ఈ జనుల దురూహలేమి, పురుషుడు తనంతి దాను వ్యక్తిగతముగ మంచివాడే. పది మందితో గలిసియున్నప్పుడు వానియంతటి దుర్మార్గుడుండడు. మనుష్యు డొక్కడున్నప్పుడు తానొక్కడే యైనపుడు తనకు దుర్మార్గపు టూహలు వచ్చినను తనలోదానే యూహించుకొనగలడు. దానికి వాగ్వ్యవహారము లేదు. అధికముగా క్రియాచరణము నుండదు. రెండవవానితో గలిసినపుడు వాగ్వ్యవ హారము కలదు. క్రియాపర్యవసానము పొందును పొందదు. లోకమునకు సంబం ధించినంత వరకు దుష్టమైన నిందాపూర్వకమైన వాగ్వ్యవహారము మిక్కిలి చెడ్డది.

గోదావరి పొంగివచ్చినది. ఊళ్లు పాడుచేసినది. చనిపోయినవారు చనిపో యిరి. ఆస్తి నష్టపడినవారు పడిరి. వారి కష్టముకంటె జూచెడివారి కష్టము గొప్పది. కష్టమో సుఖమో అనుభూతిదశలో స్వల్పము. విచారణదశలో నధికము. రాబోవు నాపదనూహించినకొలది గడుపు చెఱువగును. ఆపద వచ్చినది ఆపద లోనున్నాము. మన యింద్రియములు దిమ్మెక్కిపోవును. భయములేదు. కష్ట మేదో యనుభవించుచున్నట్లుండును. కష్టమో సుఖమో యెచ్చట నున్నది. మన యూహలో నున్నది. అనుభవ సమయమున బహుస్వల్పము. అందుచేత దాని బాధ యెక్కువలేదు.

పదిమంది చెప్పుకొనుటలో నున్న బాధ చెప్పికొనవచ్చును లేదు, లోకము నిందచేయుటయే లోక మూరకుండ లేకపోవుటయే యీ లోకము యొక్క దుర్గతి ఇదియిది యని యెవ్వనికి తెలియదు. అందరును దెలిసినట్టే మాటాడెదరు. గోరంతలు కొండంతలు సేయుదురు. మనుజుని సాంఘికమైన యీ ప్రవర్తన వాని యాత్మపదార్థముంగూర్చి మనుజుని గృహాగతమైన ప్రవర్తన చేత మనుజుడు నీచపథగామికాడు. సంఘ సన్నికర్షపొంది నీచపథగామి యగుచున్నాడు. అందుకనియే రాజు సంఘ సంబంధమైన ప్రవర్తనములోని దోషములనే శిక్షించును. మహాత్ములు మానవుని యాత్మను శిక్షించుచుండగా రాజు మానవుని దేహమును శిక్షించుచుండును. ఋషికిని రాజునకును గల భేదమిది. రాజును గౌరవింతురు జనములు.

ఈ రహస్యమంతయును వాసంతికి దెలిసినది. సభలో నున్నవారు సారథి లేచిపోవుట వలన నెట్లూహించుచున్నారో యామెకు దెలియును. సారథి తన రదా, కూర్చుండెగాదా. కూర్చున్నచో వచ్చిన నష్టమేమో ఆతనిపని తగులబడి పోవుచున్నదా. తనపాట నాతడు వినవలయునని మహాభిమానముతో బతిమాలి బామాలి సభకు దీసికొని వచ్చెనే. అతడు మెచ్చినచో దానెంతయో సంతోషించెడికదా. తనకు పలుకరింపా, దండంపు తెచ్చెను. ఇంక నతనితో మాటాడదు. అతని నాటక సంఘములో వేషము వేయును గదా నిజముగా సంగీతవిద్వాంసుడు నాటకములలో వేషము వేయుట గౌరవహీనమైన పని. స్త్రీ విషయములో వేరె చెప్పనక్కరలేదు

వాసంతి సభయైనంతనే యెవ్వరితో జెప్పకుండ నింటికి నడచిపోయెను. తండ్రి వెనుకనే మిగిలినాడు. ఆమె వేరేబండి చేయించుకొని వచ్చినది. పల్లి యాలంకారములు తీసివేసినది తెల్లచీర కట్టినది. మంచముమీద బండుకొని కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండెను.

శిరీషకుమారు ప్రతికాజీవి. తాను తొందరగా నింటికి బోయెను. కూతు యొక్క స్థితి చూచెను. అతనికి కారణము తెలియలేదు. అతడొక పవిత్రమైన పురుషుడు కొందఱు వికృతి యూహాశాలులై యుండియును నేక విషయములన్న మనస్కులైనచో, ఉదాత్తమైన యూహాలు వారికిరావు. అతనికి దన కూతురు మహావిద్వాంసురాలని గొప్పగాయనిగా లోకమునందు ప్రతిష్ఠ సంపాదించవలెనన్న యూహాయే కాని లోకమేమనుకొనునోయన్న యూహాయే లేదు తనకూతురు పాడుచుండగా ప్రక్కన గూర్చుండి మహానంద మనుభవించును. ఆమె పాట • ఉబ్బితబ్బిబ్బు లగువాడు వానికంటె సృష్టిలో మరియొక డుండడు. అతని కామెయే జన్మచరితార్థ్యము.

ప్రక్క గూర్చుండి యతడు కూతు లాలించెను. "నిన్న నరే మనిరికి సభలో నుండటు నీ పాటను మెచ్చుకొన్న వారే గాని కాదన్న వారు లేరే. అందరును నన్ను కలిసికొని ప్రశంసించిరి. ఎవ్వరితో జెప్పకుండ నింటికి వచ్చితి వేల? కలెక్టరుగారు నీ కేదో సన్మానము చేయదలచుకొన్నాడు. మంగళము పాడితివి. వెంటనే లేచివచ్చితివి. ఇది మర్యాదయా" యని పది నిముసములు మాట్లాడి కారణము చెప్పుమని తండ్రి మాటిమాటికి బలవంతము చేసినమీదట వాసంతి యేడ్చుచు "సారథి సభలోనుండి యంత హఠాత్తుగా నెందుకు లేచి పోయినాడు?" యని ప్రశ్నించెను. తండ్రి "ఆయన కేమి పని యున్నదో. ఆయన సామాన్యముగా సభలకు రాడు. మనము బలవంతము చేసితి మని వచ్చినాడు. సంగీతసభలో గూర్చుండి మొదటినుండి చివరిదాక గూర్చుండి వినుట యాయన కలవాటు లేదు. ఆయన వెడలి పోయినాడు. అందుచేత నీవు పాట నాపవలసిన యవసర మేమున్నది" యనెను. వాసంతి "సభ రక్తి కట్టబోవుచున్నది. అప్పుడాయన లేచిపోయెను. దాని మూలముగా సభ యంతయు బాడైపోయెను. నే నింక సంగీత కచేరీలే చేయను. నా కీ సంగీత మక్కఱలేదు" అనెను. "శిరీషు నీ విటువంటి మాట లంటివా నేను నీ గొంతుకోసి నా గొంతుకోసికొందును. భగవంతుడు నీకు మంచి గొంతుక యిచ్చినాడు నేను నానాకష్టములుపడి నీకు సంగీతము చెప్పించితిని. నిన్నరవ దేశమునకు దీసికొనిపోదును. అక్కడ పెద్ద విద్వాంసులవద్ద నేర్పింతును. కళ ముఖ్యమా జీవితము ముఖ్యమా. ఒక మహావిద్య చేతిలోనుండి దానిని వృద్ధిచేసికొని లోకములో ప్రతిష్ఠ పొందుటకంటె పెండ్లియాడి పిల్లలను గని కట్టె తినుట మంచి దని యనుకొనుచుంటివా? సారథి గొప్ప వటుడు ఉన్నమాట నిజమే. ఆయనకును నీకును సంబంధ మేమిటి. ఆయన నాకు బాల్య స్నేహితుడే నీ కేమి పినతండ్రియా? యన్నగారా? ఆయనను నీ వంత గౌరవించుట నా కిష్టములేదు. ఆయన సభలోనుండి లేచిపోయినాడట. తన మనస్సు చెడిపోయినదట. తాను చివరకు లేచివచ్చినా ఇట్టి పనిచేసినచో నా కిష్టములేదు. నేను నీకు దండ్రినైనచో నీవు నాకు గూతురవైనచో నీ సంగీత కచేరీకు సారథికి నేమియు సంబంధములేదు. నీ వఘోరించుచున్నావని యెప్పుకొన్నాను. కాని సారధి పాట కచేరీకి దేనికి రావలయును, ఆయన కేమి సంగీతము తెలియును. ఆయన రావలయునని నీ వెందుకు బట్టుపట్టితివి. వెంటనే లేచి మొగము కడిగికొని మంచిచీర కట్టుకొని రమ్ము" అని తండ్రి లేచిపోయి చావడిలో గూర్చుండెను. వాసంతి వెంటనే లేచెను. ఆమెకు తండ్రి కంటె ధైర్యము లేదు. అతడు గీసినగీటు దాటదు. ఒక్కొకపుడు తండ్రి నెదిరించి మాట్లాడును. ఎంతమాట్లాడినను చివరికి దండ్రిమాటయే చేయును. తనమనసులో

వేఱైన కోరిక పుట్టినచో దండ్రిచేత [illegible] నిపించి చేయుచుండెను. స్వర్గములో నింద్రుని సభలో వాసంతి పాడవల[illegible] నని ప్రట్టు[illegible]ను. తండ్రి యంగీకరించనిచో బోదు. కాని యొక్కొక్కప్పుడామె కోరికలకు దండ్రియే యనుకూలించును. కొన్ని కోరికలే కాదు గా నామె యెల్ల కోరికలకు దండ్రి యనుకూలించును. నిజమునకు దండ్రిమీద నామె కున్నంత యధికార మామెమీద దండ్రికి లేదు. కొన్ని విషయములలో నొక విషయముమీద దండ్రికి గోపము వచ్చును. అప్పుడామె తండ్రి ననుసరించును.

మఱునాడు ప్రొద్దున సారధి శిరీషకుమారు నింటికి వచ్చెను. శిరీషునవ్వుడు నెదురుగవచ్చి చాల దినాలకు వచ్చితివని తీసికొనిపోయి కుర్చీలో గూర్చుండ బెట్టెను. అంతలో నచటికి వాసంతి వచ్చెను. వాసంతి సారధినిజూచి ముఖము ముడిచికొనెను. ఆమెనుజూచి సారధి నవ్వెను. ఆమె ముఖము పెడద్రిప్పుకొని వెడలిపోయెను. శిరీషు గృహములో ప్రాతఃకాలముల వట్టి కాఫీ త్రాగరు. గట్టిగా ఫలహారములు చేయుదురు. వారి యింట వంటకత్తె గలదు. ఆయింట ముగ్గురే. వంటకత్తెయు శిరీషుడు, వాసంతియు. శిరీషుభార్య పదియేండ్లక్రింద చనిపోయెను. అతడు మరల వివాహమాడలేదు. ఇంటిలోని వంటకత్తె వారి కేదో యాకాసిపోకాసి చుట్టము. వంటకత్తెయైనను శిరీష వాసంతులమీద నామెకు జాల యధికారముగలదు. వాసంతిమీద దక్కువ యధికారము. శిరీషుమీద నెక్కువ యధికారము. వారి యింటిలో నే భోజనపదార్థము చేసినను నిబ్బడి ముబ్బడిగా చేయుదురు. ఎవరో యొకరు స్నేహితులు ప్రతిదినము ప్రాతఃకాలమున వారియింటికి ఫలహారమునకు వచ్చుచునే యుందురు. వారి యింట కెదురుగా నాయూరి కరణమున్నాడు. అతడు పదేండ్లనుండి ప్రతిదినము ప్రొద్దుటిపూట వారియింటిలోననే కాఫీ. అతడీనాడు గ్రామాంతరము వెళ్లినాడు. అతడును పట్టుబడె మనిసియే. అందుచేత సారధికి నష్టములేకపోయెను. రెండు పాయల యిడ్డెనలు దించి సారధి నాల్గు మూడు కప్పుల కాఫీ త్రాగెను. తండ్రి కేక వేయుగా వాసంతి తమలపాకులు తెచ్చెను. పళ్ళెము చప్పుటబెట్టి వాసంతి పోబోవుచుండెను.

సారధి-"నీవంటి సంగీతవిద్వాంసులకు మామీద గోపము వచ్చినచో మేము నిలువగలమా?"

వాసంతి- మే మేమి సంగీత విద్వాంసులము. పైగా మే మాడువాండ్రము. మే మేమి మహానటకులమా. మా పేరు దిగ్దిగంతముల మారుమ్రోగుచున్నదా? మీరనగా గొప్పవారు గనుక సంగీతము పాడువారి కచేరిలో గూర్చుండి రసాభాసము చేయగలరు. మేము మీ నాటకములో నేమి చేయగలము. మీ నాటక

# జీవనస్మృతి

## ౫ వ ప్రకరణము

### కళాశాలవిద్య

ఉన్నతవిద్యాసంపాదనమునకై బాపట్ల విడిచి యితర పట్టణములయందు ౧౮౯౪ వ సంవత్సరము మొదలుకొని ౧౯౦౪ వ సంవత్సరమువరకు పెద్దసెలవులు తప్ప యావత్కాలమును పెదబాపయ్యగారు గడపియుండిరి. ఆ కాలములో, అయిదుసంవత్సరములు బందరులోను, ఒకసంవత్సరము గుంటూరులోను, నాలుగుసంవత్సరములు చెన్నపట్టణములోను, ఒకసంవత్సరము రాజమహేంద్రవరములోను ఆయన నివసించెను.

మేనమామ వెంకటప్పయ్యగారు బి. ఏ. చదువుటకు బందరులో నుండవలసియుండుటచే వారితో పెదబాపయ్యగారచట నుండి విద్య నభ్యసించునట్లు మొదట నేర్పాటుచేయబడెను. నోబిలుకాలేజిలో జేరి నాలుగవ ఫారమును అయిదవఫారమును చదివిరి. తరువాత వెంకటప్పయ్యగారు బందరు విడువ తటస్థించుటచే, ఆయన బాపట్లసమీపమునందున్న

గుంటూరులో ఒకసంవత్సర ముండి మెట్రికులేషనుపరీక్షకు చదివి హాజరాయెను. కాని ఆయేడు పరీక్షలో తప్పిపోయెను. అందునకు ఉరునువిద్యాలయమును మారుట ముఖ్యకారణమై యుండవచ్చును. కాని ఆయపజయ మాయనకు అమితవిచారమును నలుగిరిలో తలయెత్తుకొని తిరుగలేనంత సిగ్గును కలిగించెను. నూటికి కింతమందిని ప్యాసుచేయవలెనని ముందుగ నిర్ణయించుకొని ఆనిర్ణయమున కనుగుణముగ పరీక్షకాగితములమీద దయాదాక్షిణ్యములు లేకుండ మార్కులు వేసి విద్యార్థులయుత్సాహమును చంపుట కలవాటుపడిన పరీక్షాధికారులకు వారివిచారముగాని సిగ్గుగాని తెలియనేరదు. పరీక్షలలో తప్పిపోవుటవలన కలుగు నిరుత్సాహము ఎందరి తెలివితేటలను పూర్తిగ నాశముచేసి యుండునోగదా! పెదబాపయ్యగారు ఆసంవత్సర మతివైభవముతో గావింపబడిన చెల్లెలువివాహసంబంధమైన వేడుకలందు పాల్గొనక యెవరికిని కనబడకుండ ఉగ్రాణపుకొట్టు వద్ద వంటసామానులను ఇతరవస్తువులను అందిచ్చుచు ఆపెండ్లిదినములు గడపెను. ఎంతపరితాపము జెందెనో చూడుడు! కాని ఆయన దుఃఖముచే క్రుంగిపోక మరుసటిసంవత్సరము చదువునందు శ్రద్ధ నినుమడింపజేసెను. వెంకటప్పయ్యగారు బందరులో నుద్యోగమై అచటికి మరలవచ్చుటచే వారియధీ

నమండుండి నోబులుకాలేజిలో ౧౮౯౭ సంవత్సరమందు మెట్రిక్యులేషను తిరిగిచదివి పరీక్షలో మొదటితరగతిని తేరెను. పిమ్మట ఎఫ్. ఏ జ్యూనియరును సీనియరును అచటనే చదివెను. కారణాంతరములవలన ఎఫ్. ఏ పరీక్షకు పూర్వము కొంతకాలము కాలేజిహాస్టలులో భోజనము చేయుచు అచటనె నివసించెను. ఆపర్యాయము ఎఫ్. ఏ పరీక్షయందు కృతార్థుడు కాకపోయెను. స్వగృహములందు ఒకవిధమగుపద్ధతిని పెరిగినపసివారు విద్యకొరకు నితరగ్రామములకు పోయి యచట తగినసౌకర్యములు లేక ఆరోగ్యము చెడి చదువు సాగక పరీక్షలయందు తప్పిపోవుటను మనము సామాన్యముగ చూచుచుందుము. విద్య నేర్చుటకు మనదేశమందంతయు నాటంకములే; పెదబాపయ్యగారుకూడ నిటువంటికష్టములకు లోనవుచు చదువునందు కొంత వెనుక పడవలసినవారయిరి. కాని ఆయన మిగులపట్టుదల కలవాడగుటచే తాను చదువదలచిన విద్యనంతయు చదువగలిగెను. ఎఫ్. ఏ తప్పిపోయినతరువాత, ఆయన బందరులో నుండుటకిష్టపడక చెన్నపట్టణమునకు వెళ్ళి క్రిస్టియను కాలేజిలో ప్రవేశించి చదువనారంభించెను.

౧౯౦౦, ౧౯౦౧, ౧౯౦౨, ౧౯౦౩ సంవత్సరములు నాలుగును ఆయన చెన్నపట్టణమందు విద్యనార్జింపుచు గడ

పెను. మొదటిసంవత్సరములో ఎఫ్. ఏ పరీక్షయందును, తరువాత రెండుసంవత్సరములలో బి. ఏ. పరీక్షయందును జయముగాంచెను. బి. ఏ లో తత్వశాస్త్రము చదివి మొదటి తరగతిని కృతార్థు డాయెను. ప్రకృతిశాస్త్రము ఉపాధ్యాయవృత్తికి మిక్కిలి యుపయోగముగా నుండునని తలచి అది మరియొకసంవత్సర మభ్యసించి యందును పట్టముబడ సెను. ౧౯౦౩ సంవత్సరము ముగియునప్పటికి డబుల్ గ్రాడ్యుయేటు అనగా రెండుశాస్త్రములందు పట్టభద్రుడాయెను. కళాశాలవిద్య ప్రారంభించినప్పటినుండియు తానేవృత్తి నవలంబింపవలయు నని తనలోతాను విచారించుకొనుచుండెను. తోటిజనుల కెక్కువ యుపయోగకరమయిన వృత్తియందు ప్రవేశింపవలయునని ఆయన యాశయము. నానావిధములయిన వ్యాధులచే బాధపడుచు ఆదరపూర్వకముగ వైద్యసాహాయ్యము చేయు వైద్యులకొరకు నిరీక్షించురోగులు మనదేశమున నెందరో గలరు. వైద్యముద్వారా మానవసేవ చేయుటకు నెక్కుడవకాశ మున్నది కావున, వైద్యవిద్య నేర్వవలయునని ఆయన మొదట తలపెట్టెను? కాని తనకు తగినంత దేహారోగ్యము లేదని డాక్టరులు చెప్పినందున ఆచదువు మానుకొనెను. పిమ్మట ఉపాధ్యాయవృత్తియందు జేరుటకు నిశ్చయించెను. వృత్తి నిర్ణయించుటలో తన కెక్కువడబ్బు

వచ్చుసాధనముగ నది యుండవలెనని ఆయన యెన్నడును తలపోసియుండలేదు. అటువంటి వృత్తులనుగురించిన యాలోచన ఆయనమనస్సులోనికి రాలేదనియె నుడువవచ్చును. దేశపురోవృద్ధి ముఖ్యముగ నెవరిపై నాధారపడియున్నదో యట్టి యువకులతో నధికసంబంధము గలిగి వారికి విద్య గరపుటకే గాక సద్వర్తన మలవడజేయుటకును ఉపాధ్యాయవృత్తి మిక్కిలియనుకూలముగ నుండునుగాన ఆయనదృష్టి దానిమీదికి మరలెను. అందునకు వలసినవిద్య నభ్యసించెను. మరియు ౧౯౦౪ వ సంవత్సరములో రాజమహేంద్రవర బోధనాభ్యాసనకళాశాలయందు ఎల్. టి పరీక్షకు జదివి యాసంవత్సరాంతమున నందు తేరెను.

విద్య నేర్చుచుండినకాలములో తా నొంటరిగా చెన్నపట్టణమువంటి పెద్దపట్టణములో వసించినప్పుడు గూడ ఆయన తనకర్తవ్యములందు అమితశ్రద్ధ గలిగి నియమానుసారముగ జీవితముగడపెను. తన కక్కరలేని యితరవిషయములలో నేమాత్రము జోక్యము కలిగించుకొని తనకాల మెప్పుడును వ్యర్థముచేసికొనలేదు. తనకాల మొకక్రమపద్ధతిని వినియోగించుచు నేవేళల కేపనులు జేయ నిర్ణయించుకొనునో నాయావేళల నవి తప్పక జేయుచుండెను. సంవత్సరము మొదటిదినమున కెన్నిగంటలు చదువునో సంవత్సరాంతమున ఁ పరీక్ష

సమయములో సహితము దినమున కొన్నిగంటలె చదివెడు వాడు. పరీక్షసమీపించుచున్న దను నాతురతతో విద్యార్థులు సాయంకాలసమయములందు మేడలమీద పుస్తకమొకచేత పట్టుకొని చదువుచు తలదిమ్మెక్కి నొప్పిపెట్టుటచే రెండవచేతితో నొక్కుకొనుచు బాధపడుచుండ, ఆయన ప్రతిసాయంకాలము షికారుకు వేళకాగానె బయలుదేరి వెళ్ళుటను వారు జూచి యెంతయు నాశ్చర్యమును ఈర్ష్యయు జెందుచుండిరి. ఎల్. టి. పరీక్షకుముందు ఆయన కెక్కువ జబ్బుచేసి చివరిమాసములలో నేమియు చదువుటకు వీలుగాక పరీక్షకు వెళ్లుటకును అశక్తుడుగా నుండియున్నప్పుడు, పరీక్షకు వెళ్ళి బాధపడవద్దని మిత్రులు సలహాచెప్పినను, సంవత్సరారంభమున పుస్తకములు చదివి తాను వ్రాసిపెట్టుకొన్న విషయములను పరీక్షదినమున నొకపర్యాయము చూచుకొని పరీక్షకు హాజరయి యాసంవత్సర మందు గెల్పొందగలిగెను. వేళతప్పకుండ రాత్రులందు ౯ గంటలకో ౧౦ గంటలకో పరుండి చీకటితో నిద్రలేచి కాల్యకృత్యముల తీర్చుకొను వాడు. ఆవశ్యకమయినంత నిద్రయు పరిశ్రమయు కలిగియుండి మనస్సు నిర్మలముగాను ఉత్సాహవంతముగాను నుంచు కొన్నప్పుడు ఒకడు ఒకగంట చదివినది వాడె అలసి విసుగు జెంది యున్నప్పుడు కొన్నిగంటలు చదివినదానితో సమాన

మగునని ఆయన తరచుచెప్పునట్టి సదుపదేశము. ఈవిష యము విద్యార్థులు ముఖ్యముగ గమనింపవలయును. ఆయన యెవరెవరివద్ద విద్యనభ్యసించెనో వారెల్లరి ప్రేమకును గౌరవ మునకును తనపరిశుద్ధవర్తనముచే పాత్రుడగుచుండెను. లోవరు సెకండగ్రె చదివినప్పుడు నరసింగరాయుడుగారికి కలిగిన సదభిప్రాయమే ఆయనయెడ నితరగురువులందరు కలిగియుండిరి. చెన్నపురి క్రిష్టియన్ కాలేజీలో ఆయన కధ్యాపకులుగా నుండిన మఫాట్‌గారును స్కిన్నరుగారును మెస్టన్‌గారును డాక్టరు మిల్లరుగారును ఆయనయందమితానురాగమును కలిగియుండిరి. ఆయన ఆకాలేజి విడిచినతరువాత ఆయనబంధువులు ఆయనతో తమకుగల బంధుత్వమును కళాశాలాధ్యక్షులకు తెలుపుకొనినంతనె సులభముగ నందు చదుపుకొనుటకు ప్రవేశమును బడయగలిగిరి. తనగురువుల సన్మానమునకు తగియుండుటకు ఆయన వారి గుణవిద్యావిశేషముల గ్రహించి వారియెడల నమితశ్రద్ధాభక్తుల జూపుటయె యని వేరుగ జెప్పనక్కర లేదు. తన శరీరమందు అస్వస్థతగా నుండియు, డాక్టరు మిల్లరుగారు స్కాట్లెండు దేశమునకు పోవనైయున్న తరి ౬-౩-౧౯౦౭ తేదిన వారిని దర్శించి నాడు ఆసందర్భముగ తన దినచర్యపుస్తకమునం దీక్రిందివిధమున వ్రాసికొనెను

"డాక్టరు మిల్లరుగారిని దర్శించితిని. వారు స్కాట్లండుకు పయనమగుచున్నారు. వృద్ధాప్యమున తమకార్యక్షేత్రమును విడిచిపోవుటకు తమ యయిష్టమును కనపరచుచు వృద్ధులగు నామహామహునకు నుడివిన నుడువు లాలకించు టెంతయు విచారకరముగనుండెను. వారియందలి మృదుస్వభావము సువ్యక్తమగుటను గూడ గాంచితిని. నేను దుఃఖము నాపుకొన లేకపోతిని. యథార్థమయిన మహాపురుషుల నెరుంగుభాగ్యము నాకు ప్రసాదించినందులకు ఈశ్వరునకు ధన్యవాదములు."

పెదబాపయ్యగారు తమగురువులయెడ నిట్టిసద్భావము కలిగియుండుటవలననె ఆయన వారిమన్ననలకు పాత్రులగుటయె గాక వారినుండి గ్రహింపవలసిన సద్విషయములను గ్రహించి తమబుద్ధిని వికసింపజేసికొన గలిగెను. ఆయన పూర్వాచారములందు మొదటినుండయు దృఢవిశ్వాసము కలిగియుండి వానిని హృదయపూర్వకముగా ననుసరించుచుండెను గాన, తమగురువులు తెలిపినయభిప్రాయము లెంతయుత్కృష్టము లయినవయినను విచక్షణముచేయక యెప్పుడును స్వీకరింపలేదు. స్వకీయములయిన విశ్వాసములు లేనివారు తామెవరి ననుసరించి జీవింతురో వారివలెనె నంధప్రాయముగ మారిపోవుదురు. పెదబాపయ్యగారట్టి తెగకు

జెందినవారు కారు. **మొదటినుండియు** ఆయన తనవ్యక్తిత్వము కాపాడుకొనుచునె యుండెను. వల్లూరి నరసింగరాయుడుగారివద్ద బాల్యమునందును సర్ డాక్టర్ రఘుపతి వెంకటరత్నమునాయుడుగారివద్దను ప్రస్తుతము పిఠాపురము రాజాగారి కళాశాల ప్రిన్సిపాలుగా నున్న డాక్టర్ వేమూరి రామకృష్ణరావుగారివద్దను కొంతవయసు వచ్చినప్పుడును విద్యనభ్యసించుట తటస్థించి వారియందు భక్తిశ్రద్ధలు కలిగి యుండినను వారియొక్క బ్రాహ్మసమాజాభిప్రాయములను మాత్రము స్వీకరించియుండలేదు. మీదుమిక్కిలి వారి శుశ్రూష సలుపుకాలములో వారియభిప్రాయములను విమర్శించి ఖండించుచుండెను. అటులనె క్రిస్టియన్ కాలేజిలో గొప్ప క్రైస్తవమతప్రచారకులదగ్గర చదివినప్పుడు వారి నెంతగౌరవించినను వివేచనాశూన్యముగ వారి ననుకరింపలేదు. తమకు భక్తిభాజనులయినవారు భిన్నమతావలంబికులయితా మంగీకరింపజాలని పద్ధతులు కలిగియున్నను వారిని భక్తితో సన్మానించు స్వభావు లగుటచే పెదబాపయ్యగారు వివిధాభిప్రాయములను పరిశీలించుచు సత్యాన్వేషణముచేయుటకెక్కువ యవకాశమును బడయుగలిగిరి. ఆయన పొందిన జ్ఞానాభ్యున్నతి కంతకును అదియె ముఖ్యకారణము. స్వాభావికమగు అభివృద్ధి నభిలషించువారు పెదబాపయ్యగారి

మార్గమునె యనుసరింపదగును.

నియమపూర్వకముగా చదువుకొనుటకు అలవాటు పడియుండుటచే ఆయన పరీక్షలకు కావలసిన పుస్తకములనే గాక జ్ఞానాభివృద్ధికి తోడ్పడు నితరగ్రంథములనుగూడ చదువుటకు కాలము కలిగి యుండగలిగెను. కొన్ని నిమిత్తములయినను ఆయన యెప్పుడును వ్యర్థముగ గడపియుండ లేదు. ఏదో సద్గ్రంథ మాయన చదువుచుండని దినములు లేవని చెప్ప వచ్చును. తమబంధువులును మిత్రులును సెలవుదినములలో చీట్లపేక ఆడుచు కాలయాపనము సేయుచుండ, తా నొక గదిలో ప్రత్యేకముగ గూర్చుండి నిశ్చలమనస్సుతో గ్రంథ పఠనము గావించుచుండెడివాడు. ఆయన వర్తనము మొదట కొంతవిపరీతముగ తోడివారలకు గాన్పించినను, వారెల్లరు ఆయన దీక్షను కనుగొని ఆయనయం దతిగౌరవము చూపి యుండిరి. కొందరు అన్ని వేళల చదువుచు పుస్తకముల నంటి యుండు పురుగులవలె నుండి యితర వ్యాపారములన్నియు కట్టిపెట్టి తుదకు ఆరోగ్యమును కూడ చెడగొట్టుకొందురు. ఆయనీ యెప్పుడు నటుల చదువలేదు. ప్రతిదినము నిర్వర్తింప వలసిన దేహపరిశ్రమ, స్నానము, సంధ్య, సాంఘికసేవ మొదలగు విధులలో చదువు ఒకటియని తలంచెను. దేని కెంత కాలము వినియోగింపనగునో యంతకాలమె వినియోగించుచు

ఆయన సమగ్రమయిన యభివృద్ధిని బడసెను. బుద్ధినిమాత్రమె పెంపొందించి శరీరమును ఆత్మను ఆయన కృశింపజేయలేదు. సర్వాంగోన్నతి జెందుచుండుటచే, ఆయనజీవితము విద్యార్థి దశనుండి కూడ రమ్యముగనుండి యితరుల కాకర్షకముగ నుండెను. కేవలము పరీక్షలకు వలసిన గ్రంథములనె చదివి చదివి వానియందున్నత శ్రేణీయందు త్తీర్ణులయినవారు ఇతర విషయములం దెట్టియభ్యున్నతియు పొందకుండుటను చూచుచుందుము. వారిజీవితములు వికృతాకారములుదాల్చి హృదయరంజకములుగ నుండవు. పెదబాయ్యగారు పట్టపరీక్షల కావశ్యకమయిన చదువుతోపాటు ఎట్టియన్యవిధమయిన చదువునుకూడ గలిగి జీవితమును అందముగ పరిణమింపజేసి కొనెనో దానిని గురించి ప్రత్యేకముగ పాఠకులు విన నభిలషింతురుగాన రాబోవు ప్రకరణమున నది కొంత వివరింపబడును:

---

# జీవనస్మృతి

---

## ౬ వ ప్రకరణము.

### సర్వాంగపరిజ్ఞానము.

బాపయ్యగారికి మొదటినుండియు ఆంగ్లభాష నేర్చు టిలో నభిరుచి మెండు. ఆయన పరీక్షలకు నేర్పరుపబడిన పుస్తకములు మాత్రమెగాక తనంతట తాను చదివి అర్థము చేసికొనగల కథలపుస్తకములను జీవనచారిత్రములను ఇతర గ్రంథములను క్రిందితరగతులనుండి గూడ పఠించుచుండెడు వాడు. ఆంగ్లభాషాపరీక్షలందు మంచిమార్కులు తెచ్చుకొను వాడనియు, సంభాషణమునందు వ్యాకరణయుక్తముగను అలంకారసహితముగను స్వచ్ఛమయినయాంగ్లమును చిన్న ప్పటినుండియు నుపయోగించువాడనియు, ఆయన బాల్య మిత్రులు చెప్పుదురు. ఈయభినివేశము సుప్రసిద్ధ గ్రంథ కర్తలును కవులును ఆంగ్లమున రచించిన గ్రంథములను తన మనోవికాసమనుసరించి యెప్పటికప్పు డాయనను చదువునట్లు చేసినది. మతము, తత్వము, భక్తి, నీతి, సంఘము, రాజ్యాంగము, కేవలభాష మొదలగువిషయములకు సంబం

ధించిన జ్ఞానము ముఖ్యగ్రంథములను జదివియు గురువరేణ్యుల నాశ్రయించియు ఆయన బడసెను.

ఆయన బందరులోనున్నప్పుడు అచటి హిందూమత బాలసమాజములో సభ్యుడుగా నుండెడివాడు. వల్లూరి నరసింగరాయుడుగారిద్వారా ఆయనకు సంస్కారణాభిమాన మేమయిన నలవడియుండిన ఆకాంచెమును వెంటనే తొలగ్గించుటకు మామ వెంకటప్పయ్యగారు ఆయన బందరుకు రాగానె హిందూమతబాలసమాజముతో సంబంధముపెట్టుకొనునట్లు చేసిరి. ప్రాచీనహిందూవిశ్వాసములందును ఆచారములందును అదివరకె ఆయనకు మనసు కుదిరియున్నది కావున, ఆసమాజమునందు పేరునకుమాత్రము సభ్యుడుగా నుండక యెంతయో యుత్సాహముతో పాటుపడెను. ఆసమాజమునందు ప్రధానహిందూమతగ్రంథములు సమకూర్చబడెను. ఆయన వానిని బహుశ్రద్ధతో చదివెను. తత్సమాజాధ్యక్షులుగ నుండినట్టియు, స్కూళ్ళయిన్‌స్పెక్టరుగా పనిచేసి కొలదికాలము క్రిందట కీర్తిశేషులయినట్టియు కలపటపు సుదర్శనరావుగారు, రాజమహేంద్రవరములో బాపయ్యగారి వర్ధంతిసందర్భముగా ఒకసంవత్సరము జరుపబడినసభయందుమాటాడుచు, బాపయ్యగారు జ్ఞానసంపాదనమునందు కలిగియుండిన యాకాంక్ష అసాధారణమనియు, బందరు హిందూసమాజపుస్తకభాండా

గారములోని మంచిపుస్తకములన్నియు ఆయన చదివెననియు, పుస్తకముల్ను చదువునప్పు డేవైనసందేహములు తోచిన వానిని తీర్చుకొనుటకు ఆయన తమవద్దకు వచ్చి ప్రసంగించు చుండిన సమయములలో తాము ఆయనకు క్రొత్తగా నేర్పిన దానికంటె ఆయనవద్దనుండి తాము నేర్చుకొన్నదె యధిక ముగా గలదనియు, తమకంటె చిన్నవాడె యయినను ఆయన యందు తమకుగురుభావము జనించినదనియు, ఆయనకు కాల క్రమమున మతవిశ్వాసములందు తాము అంగీకరింపజాలని కొన్నిమార్పులు వచ్చియున్నను, నమ్మినప్రకార మాచరించు స్వభావము చనిపోవువరకు ఆయన నిలుపుకొనగలుగుటచే తమ కాయనయందు గౌరవము లేశమయినను తగ్గక హెచ్చిన దనియు, ప్రశంసించిరి. మరియు మిత్రులు పింగళిలక్ష్మీనారా యణగారు బాపయ్యగారికి హిందూమత బాలసమాజముతో సంబంధమున్న దినములనుగురించి యీక్రిందివిధముగ తెలుపు చున్నారు.

"దేశిరాజు పెదబాపయ్యగారిని నేను ౧౮౯౮ సంవ త్సరమున బందరులో గలిసికుంటిని. నే నింగ్లీషు చదువుటకు బందరు చేరితిని. బాపయ్య బాపట్లనుంచి వచ్చి తన మేన మామ యగు కామరాజు వెంకటప్పయ్యగారితో నివసించు చుండెను. అపు డాయన నాల్గవఫారము చదువుచుండెను.

నా కది స్కూలుకు బోవుదారి గనుక మధ్యాహ్నము కలియుచుంటిని. మరుసటిసంవత్సరము నేనుకూడ నోబిలు కాలేజిలో ప్రవేశించితిని గనుక వీలగునపుడెల్ల కలియు చుంటిమి. ౧౮౯౭ సంవత్సరమున నన్ను ప్రోత్సాహపరచి హిందూమత బాలసమాజములో జేర్చెను. ఆ కాలమందు క్రయిస్తమతమును పట్టుదలతో బాలురకు నేర్పుచుండెడి వారు. మన సనాతన ధర్మమును మాటిమాటికి నిరసించు టయే గాక మనపూర్వులను కడునీచముగా చులకన చేయు చుండిరి. గనుక మేము చదివెడు విద్యకంటె మతదూషణ, జాతిదూషణ ఎక్కువ నేర్చుకొనవలసి వచ్చినది. ఇట్టి క్లిష్ట సమయమున మాకు హిందూమతబాలసమాజము శరణ్య మైనది. మా కాలేజిలో నపుడు సి. డబ్లియు. ఎ. క్లార్కు దొరగారు ప్రిన్సిపాలుగా నుండిరి. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ప్రార్థనసమాజమును నెలకొల్పి శిష్యవర్గమును పోగుచేయుచుండిరి. వీరును మన మతమును నిరసించుచుండిరి. బాలసమాజములో బాపయ్యగారు ఒక వత్సరము లైబ్రేరి యనుగను తరువాత సెక్రెటరిగను నియమింపబడిరి. ఆయన మొట్టమొదట మోక్షముల్లరుగారి 'ఇండియ—అది మన కేమి చెప్పగలదు' (India—what it can teach us) అనెడు గ్రంథమును బాగుగ చదివెను. బార్లిగారి వ్యాస

ములుకూడ ఆయనచింతనము దిట్టపరచినవి. కాని నావలె పాదిరీలతో విరోధము పెట్టుకొనుట కిష్టపడలేదు. బాపయ్య లాగులు వేయుచుండెను. బ్రాహ్మణబాలురలో లాగు లానాడు అరుదు. చిన్నతనములో బాపయ్యకు దుస్తులందు, ఆటలందు కడుప్రేమ. పరమపవిత్రమగు హృదయమును గల్గియు గంభీర్యత లేకుండెను. ఆయనయందు నిరుపమానమగు తేజోవికాసముదయించునని నేను తలచియుండలేదు. కాని వెంటనె ఒక చిన్నసంగతి సంభవించినది. తన గోళ్ళు పిప్పిపట్టి నానాటికి రక్తవిహీనమై, గుల్లలై పిప్పిచే కృశించిపోవ నారంభించెను. అప్పుడె తన దృష్టిని బాహ్యలోకమునుండి తన శరీరమునకు మరల్చుకొనవలసి వచ్చెను. తనతండ్రి పిన్నవయసుననె మృతిజెందెను. జాడ్యము, అందవికారము, మృత్యుభయము మనసును గట్టిగా దట్టియుండనగు. బాలసమాజములోని సత్సాంగత్యము, నాయుడుగారి ప్రబోధము, తన శరీరదౌర్బల్యము, వీ టన్నిటికంటెను ఆయనను పక్వముచేసిన యాత్మశక్తి మరియొకటి గలదు. ఆనాడు బందరులో సబుజడ్జిగా నొక బ్రాహ్మణోత్తము డుండెను. పవిత్రతకు, జ్ఞానమునకు, నిరాడంబరజీవనమునకు ఆదర్శకుడని చెప్పతగు మహనీయుడు. ఆయన ఉదయము మూడుగంటలకె లేచి కోర్టుతీర్పుల నైదింటికి వ్రాసి తన నిత్యకృత్యములను ఏడింటికితీర్చుకొని తొమ్మిది

న్నర గంటలవరకు మాకుమతబోధచేయుచుండిరి. సనాతన ధర్మమును నూరిపోసి మాయందు ఆత్మచింతనము గలుగజేసిరి. ఈమహాత్ముని ఇప్పుడు అడయారులో జూడనగును. వీరు మనయాంధ్రులలోకెల్ల గొప్పవారని నానిశ్చయము. ఈపావన మూర్తిస్పర్శచే బాపయ్యయందు జ్ఞానాగ్ని లుదయించినవి. సత్యాన్వేషణ మారంభమైనది. నామరూపముల నతిక్రమించిన దివ్యదృష్టి కలిగినది. సాధ్యాసాధ్యముల లెక్క జేయని ధైర్యస్థైర్యము లాయన హృదయమందు ప్రతిష్ఠింపబడినవి. సత్యము, నీతి నిత్యజీవనాభిలాష ఆ హృదయమందు జ్వాలలై వెలుగ సాగెను."

హిందూమతప్రముఖులవలనను, హిందూమతగ్రంథములవలనను బాపయ్యగారెట్లు ధర్మజ్ఞానము సంపాదించినదియు, ఎంతటి యాత్మాభివృద్ధి గాంచినదియు పైని వివరింపబడినయంశములు సూచించుచున్నవి. బందరులోనున్న ఆకాలమందు బ్రాహ్మసమాజికులతో సంబంధముగలిగి వారిద్వారాబ్రాహ్మసమాజమునుగురించియేమియునేర్చుకొనకపోయినను వారికి దూరముగ నుండి విమర్శనాపూర్వకముగ వారు చెప్పు సిద్ధాంతములు గ్రహించెను. ఆయన నోబిలుకాలేజిలో చదివెనుగాన, క్రైస్తవులకు వేదతుల్యమగు బైబిలు

గ్రంథమును పఠించుటయు, విద్యాధికులగు క్రైస్తవమత బోధకుల ప్రసంగములు దినదినము వినుటయు ఆయనకు విధాయకమాయెను. మన ప్రాంతములందున్న యితర క్రైస్తవ పాఠశాలలోవలె గాక నోబిలుకాలేజిలో మతబోధవిషయమున నెక్కువశ్రద్ధ తీసికొనబడును. ప్రతిదినము కాలేజి తెరువబడినతోడనే బైబిలునుండి యేదోముఖ్యభాగము చదువబడి దానినిగురించి పదునైదునిమిషములు ప్రసంగింపబడును. ఆ ప్రసంగములు ప్రార్థనలతో ముగింపబడును. వానిని వినుటకు విద్యార్థులందరు తప్పక రావలెను. ఇవిగాక బైబిలుపాఠములు దినమున కొకగంట చెప్పబడును. క్రైస్తవమతమందెంతయసూయ గలవారైనను, ఆకాలేజిలో చేరినతరువాత జీససుక్రీస్తుయొక్క సందేశమును గూర్చియు, ఆయన యద్భుతచారిత్రమును గూర్చియు, బైబిలుగ్రంథములోని యితరముఖ్యవిషయములనుగూర్చియు తెలిసికొనకుండ తప్పించుకొనుటకు వలనుపడదు. బాపయ్యగారు క్రైస్తవపాదరీలతో విరోధముపెట్టుకొనక సహనశీలురై చరించియుండిరి గాన, బైబిలును బాగుగచదివియు, పాదిరీల బోధలను చక్కగ నాలకించియు, ఇతర క్రైస్తవ గ్రంథములను పరిశీలించియు ప్రధానములైన క్రైస్తవాదర్శములను మనోగతముచేసికొనిరి. బందరునుండి చెన్నపట్టణమునకు వెళ్ళినతరువాత

డాక్టరుమిల్లరు, మొదలగు క్రైస్తవ మహామహుల శుశ్రూష సలిపియుండిరి. వారితో నత్యంతమైత్రి గలిగి వారి జీవితములయందే క్రైస్తవమతప్రభావమును కనుగొనిరి. క్రైస్తవమతమునందు ద్వేషము చూపకపోవుటయె గాక యభిమానము కనపరచుస్థితికి వచ్చిరి. తాము చదువు ముగించి క్రిస్టియన్ కాలేజిని విడిచినతరువాతకూడ ఆ కాలేజితో సంబంధము మానలేదు. ౧౯౦౫ సంవత్సరము డిశంబరు ౨౭ వ తేదిని జరగిన ఆకళాశాలయొక్క యుత్సవదినమున చెన్నపట్టణమునకు వెళ్ళి యందు పాల్గొని యావజ్జీవితసభ్యులుగ జేరిరి. క్రైస్తవమతసారము బాపయ్యగారు పూర్తిగ గ్రోలిరని నిస్సంశయముగ జెప్పవచ్చును. ఆంగ్లభాషయం దున్నయభిరుచియేమి, ధర్మచింతనమందుగల యాసక్తియేమి బైబిలును ఇతరక్రైస్తవగ్రంథములను కూలంకషముగ వారు చదువుటకు కారణములయి జీససుయొక్క ప్రబోధమును వ్యక్తపరచుటయందును, బైబిలులోని మహావాక్యముల నుదాహరించుటయందును అనర్గళశక్తిని వారికి సమకూర్చినవి.

బాపయ్యగారికి ప్రొఫెసర్ లక్ష్మీనర్సునాయుడుగారి పరిచయముగూడ చెన్నపురిలో గలిగినది. వారియెడ భక్తిభావము గలిగి వారిని దర్శించుచు వారివలన కొంతప్రబోధము బడసిరి. లక్ష్మీనర్సునాయుడుగారు బౌద్ధమతాభి

మానులయి తద్గ్రంథపరిశోధనము విశేషముగ సలిపిన వారనియు, సంస్కరణాభిమానులనియు చదువరులు విని యుందురు. బాపయ్యగారప్పుడు నూతనముగ వ్యక్తపరచుటకు మొదలిడిన సంస్కరణాభిలాషకు గౌతమబుద్ధుని జీవితాశయములు తోడ్పడియుండును.

కందుకూరి వీరేశలింగముపంతులుగారితో వారివద్ద విద్య నభ్యసించుటమూలమున గాని యింకేవిధమున గాని తమకు సాంగత్యము కలుగకపోయినను, తమంతట తాము వారు చెన్నపురిలో నున్న సమయమున వారివద్ద కేగి వారి పరిచయము చేసికొనిరి. అచట స్థాపింపబడియున్న దక్షిణ హిందూదేశ బ్రాహ్మసమాజముతో సహితము సంబంధము పెట్టుకొనిరి. తత్సమాజోపాసనలకు పోవుచు, బ్రాహ్మ సమాజకుల ప్రసంగముల నాలకించుచు స్వీయముగ బ్రాహ్మసమాజగ్రంథముల పఠించుచు, పరిశుద్ధాస్తికభావమును నవయుగమున ప్రచారముచేయుచున్నది బ్రాహ్మ సమాజమని గుర్తించిరి. వీరేశలింగముపంతులుగారు తమ స్వీయచరిత్రయందు వ్రాసిన యీక్రిందివాక్యములు బాపయ్యగారానాడు కలిగియుండిన చిత్తవికాసమును స్వతంత్ర బుద్ధిని స్పష్టీకరించుచున్నవి.

ఈకాలములో దేశిరాజు పెదబాపయ్యగారు నాకు

పరిచితులయి మాయింటి కించుమించుగాఁ బ్రతిదినమును వచ్చుచుండెడివారు......నేను దక్షిణహిందూస్థానబ్రాహ్మ సమాజమునకుఁ బ్రధానాధ్యక్షుఁడను. బాపయ్యగారు బ్రాహ్మసమాజాభిమానులయి చెన్నపట్టణములో విద్యార్థులలో నొకసమాజమును స్థాపించి దానికి నన్ను తఱచుగాఁ దీసికొని పోవుచుండెడివారు. ఈసంబంధమునుబట్టి బాపయ్యగారు పలుమాఱు మాయింటికివచ్చుచు నాయం దత్యంతగౌరవము గలవారయి నేను చెప్పినపని నత్యాదరముతోఁ జేయుచుండెడివారు. ఇటువంటి కార్యములయందు వీరిట్లు నాకు సాయపడుట నేను చెప్పితినన్న హేతువుచేతనే కాదు. సమస్త సత్కార్యములయందును స్వతంత్రముగా నీయనకే యత్యంత ప్రీతి యుండెను. ఈయన యుత్సాహమును సుగుణసంపదను గార్యైకతత్పరతను జూచి యీతడు ముందు నేను పూనిన సంస్కారకార్యమును సమర్థతతో నిర్వహింపఁగలవాఁ డగునని తలఁచితిని.''

పంతులుగారు తెలిపిన యంశములనుబట్టి బ్రాహ్మ సమాజముతోడను తమతోడను సంబంధముగలిగి బాపయ్య గారు ఉదారధర్మజీవనము నలవడజేసికొనుటకు చెన్నపురిలో విద్యనభ్యసించుకాలముననె ప్రారంభించిరని నిర్ధారణయగుచున్నది.

మతవిషయమునగాని నైతికవైజ్ఞానికసాంఘికరాజకీయాదివిషయములందుగాని బాపయ్యగారు చదివినపుస్తకముల పేరు లిచ్చుటకు ఇట్టిగ్రంథరచన వారు మృతినొందిన కొలదిదినములలోనె ప్రారంభింపబడిన సాధ్యమైయుండెడిది. తాము చదివిన ప్రతిగ్రంథమునందు ముఖ్యములయినభాగములకు పెన్సిలుగుర్తులు పెట్టుటయు, ప్రక్కను అచటచట నేమయినవ్రాయుటయు వారికి అభ్యాసము. అంతియెగాక ముఖ్యమయిన గ్రంథములందలి భావములను సంక్షిప్తముగ వ్రాసిపెట్టుకొనెడువారు. అట్లు పఠించినగ్రంథములు సామాన్యముగ సొంతమునకు కొనినవగుటచే అవియన్నియు నొకబీరువాలో జాగ్రత్తగ కాపాడువారు. వారిమరణానంతరము అవి పదిలపరుపబడకపోవుటచే దాదాపుగ నన్నియు పోయినవి. అవి యుండినయెడల వారు చదివినగ్రంథములలో ముఖ్యమయినవి పేర్కొనుట సులభముగ నుండెడిది. కాని వారు గ్రంథసారాంశములు వ్రాసికొన్న నోటుబుక్కులలో నొకదానియందలి చినిగినకాగితములుకొన్ని లభ్యమయినవి. ఆకాగితములద్వారాను దినచర్యపుస్తకముద్వారాను వారీక్రిందిపుస్తకములు చదివినట్లు తెలియుచున్నది. (1) జాన్ స్టూవర్టుమిల్లు రచించిన స్త్రీలయొక్కదాస్యము (The Subjection of women) (2) డాక్టర్ చార్లెస్ బియర్డు

రచించిన మార్టిన్‌లూథర్ సంస్కరణము (Martin Luther and reformation) (3) జాన్ స్టూవర్టు మిల్లుగారి స్వీయ చరిత్ర (Autobiography) (4) ప్లేటో విరచితమయిన 'ప్రజాప్రభుత్వము' (Republic) (5) కార్లైలు వ్రాసిన ఫ్రాన్సుదేశవిప్లవము (French revolution) (6) జేమ్సు సేత్ లిఖించిన నైతికసిద్ధాంతము (Principles of Ethics) (7) తియడోరుపార్కరుయొక్క ధర్మోపదేశములు (Sermons) (8) బాలగంగాధరతిలక్, బిపినచంద్రపాలు మున్నగు రాజ్యాంగసంస్కర్తల రాజకీయ ప్రచురములు. (9) సర్ హెచ్. జె. ఎస్. కాటన్ ప్రకటించిన నవీనభారతవర్షము (New India) (10) జపానుచరిత్రము (11) ఫ్రాన్సిస్‌పవరుకాబుయొక్క స్వీయచరిత్రము (12) బ్రహ్మానంద కేశవచంద్రసేనుని జీవనవేదము (13) వాషింగ్టన్ ఇర్వింగు రచించిన మహమ్మదుయొక్క జీవితము (14) దైనికశక్తి (Daily strength) (15) టెనిసనుకవిరచనలు (16) ప్రతాపచంద్ర ముజుందారు రచించిన ఆత్మనివేదనలు (Heart beats)- ఈపుస్తకములు వారుచదివినవానిలో చాలకొలదియై యున్నను వారి విద్యావ్యాపకము సర్వతోముఖముగ నుండెనని స్పష్టముగ తెలుపుచున్నవి. సాంఘికరాజకీయాది సర్వవిషయములనుగురించియు జ్ఞానము సంపాదించుటకు

వారు సదా కృషిసలిపిరి. మతసాంఘిక రాజకీయపత్రికలను తెప్పించుకొని చదివెడువారు. నటరాజన్‌గారు ప్రచురించు ఇండియన్ సోషల్ రిఫార్మరు వారు శ్రద్ధతో చదువుచుండిన పత్రికలలో నొకటి. తమ చివరిసంవత్సరములలో రాజకీయ యాందోళనము తీవ్రముగ జరుగుచుండినప్పుడు వందేమాతరమ్ పత్రికయం దెక్కుడాదరము జూపియుండిరి.

చెన్నపురిలో మహనీయులు తరచు గొప్పవిషయము లను గురించి యుపన్యాసము లిచ్చుట తటస్థించును. బాపయ్య గారు వానిని తప్పకుండ విని వానిసారాంశములు వ్రాసి యుంచుకొనెడువారని వారి మిత్రులవలన తెలియుచున్నది. ఈ యభ్యాసము వారిజీవితములో తుదివరకుండినటుల గాన్పించుచున్నది. దినచర్యపుస్తకమందు వారట్లు వ్రాసిపెట్టుకొన్న యుపన్యాససారాంశములుకొన్ని గలవు. ఆయుపన్యాసములలో వెంకటరత్నంనాయుడుగారును పండిత శివనాధశాస్త్రిగారును బిపినచంద్రపాలుగారును ఒసంగినవి ముఖ్యమయినవి. భక్తి భాజనులయిన మహనీయులందరితో తమకు వీలయినంతవరకు పరిచయముచేసికొని వారితో సంభాషించుచు వారిద్వారా జ్ఞానముబడయుటయు బాపయ్యగారికిఅలవాటు. వారు కలకత్తాకు వైద్యముకొర కొకసారియు జాతీయసభల జూచుట కొక తూరియు వెళ్లి యచట ౧౯౦౭ సంవత్సరము అక్టోబరు నవం

బరు డిశంబరు మాసములును ౧౯౦౭ సంవత్సరము జనవరి ఫిబ్రవరి మాసములలో సుమా రొకనెలపదునై దుగోజులును గడపినప్పుడు పండిత సీతానాధతత్వభూషణులతో నెక్కువ సాంగత్యము చేసి వారిద్వారా కలకత్తాలోని బ్రాహ్మసమాజ ప్రముఖులందరిని దర్శించి యుండిరి. కలకత్తా బ్రాహ్మసమాజి కుల జీవనమునుండి యనేక సద్విషయములు గ్రహించిరి. గ్రంథములు నిర్జీవములయినవి. సత్పురుషుల జీవితములన్నవో సజీవగ్రంథములని చెప్పనొప్పును. ఈ జీవనవేదములను పఠించుటలో బాపయ్యగారికి చాలనేర్పుగలదు.

"నేడు మీవంటి సంపూర్ణ ఆత్మోన్నతి జెందిన పుణ్యపురుషుని కలసికొని పరమానందభరితుడ నైతిని" (I am happy for having met a whole-souled man like you to-day) అని ఒకపెద్దమనుష్యుడు బాపయ్యగారిని గురించి ప్రశంసాపూర్వకముగా నుడివిన వచనము యథార్థమని యెవ రంగీకరింపరు? కళాశాలవిద్య ముగియగానే విద్యార్థులు సాధారణముగ జ్ఞానార్జనమునుమాని ధనార్జనములో మునిగిపోవుదురు. బాపయ్యగా రట్లుగాక యావజ్జీవితమును విద్యార్థిగనె యుండి తమ యాత్మ వివిధాంగ పరిజ్ఞానముతో చిరనూతనత్వము జెందునట్లు కృషిసలిపిరి. వారి జీవిత మెవరి కానంద మొనగూర్పదు?

# జీవనస్మృతి

## ౭వ ప్రకరణము

### శారీరకనైతిక సాధనలు

బాపయ్యగారి యంతరధీశక్తి సమగ్రముగ వికాసము గాంచుటకు వారు విద్యావిషయమున సలిపిన మానసిక కృషియే ముఖ్యకారణమయినను, వారి నందులకు తగినవారినిగా జేసినది శరీరపరిశ్రమ యని చదువరు లిదివరకె గమనించియుందురు. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అను నార్యోక్తియందు ఆయనకు పరమవిశ్వాసము గలదు. శరీరము ఆరోగ్యముగాను దృఢముగాను నున్నపుడె, మనసు గూడ ఆరోగ్యముగాను దృఢముగాను ఉండి జ్ఞానవిషయమున నెక్కువకృషి సలుపగలిగియుండునని ఆయన యనుభవపూర్వకముగ గ్రహించెను. శరీరవ్యాయామమును ఆయన జీవితములో రుగ్మతవలన అసాధ్యమయినప్పుడుతప్ప నెన్నడును మానలేదు. దేహపరిశ్రమ చేయుటకు ఆయన యువకులను సదా హెచ్చరించెడువాడు. శరీరసాధన లాయన యెట్టివి యేరీతిన జేసియుండెనో యించుక తెలుపుట ప్రయో

జనకరము. విద్యావ్యాసంగమున తగులొక్కని యన్నిసమయ ములందు తదేకదృష్టితో పాటుపడి విద్యయందు ప్రవీణత గాంచలేకపోయినను పరీక్షలం దుత్తీర్ణులగుటకు మాత్రము శక్తిని విద్యార్థులుపలువు రీకాలములో బడయుచున్నారు. వా రంతటితో తృప్తిజెందుచున్నారు. తాము పడ్డెడుశ్రమ పూర్ణముగ ఫలప్రదమగుట లేదనియు మీాదుమిక్కిలి తనూర్జ్జలమున శరీరము కృశించి తా మల్పాయుష్కు లగుచున్నా మనియు వారు గ్రహించుటలేదు. అట్టివారలు బాపయ్య గారు శరీరనియమములందును వ్యాయామవిషయమునను తీసి కొనిన శ్రద్ధను గమనించి జాగరూకు లగుదురు గాక! బాపయ్యగారు అనారోగ్యమయిన శరీరమునె పుట్టుకవలన పొందియుండిరి. జన్మించినది మొదలు తల్లియొక్క పోషణము లేకపోవుటచే, ఆయన మరింత శరీరదౌర్బల్యమునకు లోన య్యెను. సుమారు అయిదుసంవత్సరముల ప్రాయము వచ్చువరకు ఆయన తరచు దగ్గుతో బాధపడు చుం డెను. కొంతవయసు వచ్చినతరువాత పుప్పిగోళ్ళ వ్యాధి వలన నీరసపడెను. మొదట బలహీనశరీరమును కలిగియు ఆయన కాలక్రమమున దృఢకాయుడయి యెట్టిరోగమును లేని యారోగ్యస్థితి బడసి మనస్సుతో నధికకృషిచేయ సమ ర్థుడగుటకు కారణములు శారీరకనైతికసాధనలె.

తనకు బుద్ధి తెలిసి యారోగ్యము పొందవలెనను సంకల్పము కలిగిననాటనుండియు, ఆయన శరీరవ్యాయామవిషయమున నెప్పుడు నేమరియుండ లేదు. దేశీయకసరతు నేర్చెను. డంబెల్సుతోను, సాండో డెవలెపరుతోను పరిశ్రమచేయ నభ్యసించెను. టెన్నిసు బాగుగ ఆడగలిగెను. షికారుకు పోవుఅభ్యాసముకూడ కలిగియుండెను. ఉదయమును సాయంకాలమును తనశరీరదార్ఢ్యమునకు తగినట్లుగా వీలునుబట్టి నియమితకాలములందు ఈవ్యాయామములలో నేదియొ తప్పక చేయుచుండెడువాడు. ప్రాతఃకాలమున పరిశ్రమ అయినతరువాత చన్నీళ్ళస్నానము చేసి సంధ్యానుష్ఠానము తీర్చుకొని యితరవిద్యార్థులింకను పక్కలమీద నుండగానె పెందలకడ ఆయన చదువునకు సిద్ధముగా నుండును. సాయంకాలము వ్యాయామసమయము కాగానే ఆయన షికారుకు బయలుదేరును, లేక టెన్నిసుఆటకు పోవును. పొద్దుపోవువరకు రాత్రులందు మిక్కిలి అవసరము వచ్చినప్పుడుతప్ప ఎప్పుడును మేల్కొనువాడు గాడు. నిద్రపోవు వేళకు తానెవరితో మాటాడుచున్నను, తా నిక మేల్కొన జాలనని చెప్పి వారివద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళి పరుండును. తాను పెట్టుకొనినవేళకు పూర్వ మొకప్పుడును నిద్రపోక అంతవరకు ఏదోపని చేయుచు మేల్కొనును. రాత్రి పెందల

కడ పరుండి యుదయమున పెందలకడనె లేచును. నిద్రవిష యమున నెటులనో ఆహారవిషయమునను నీమము పాటిం చును. తనశరీరస్థితికి తగినట్లు తన కెప్పటికప్పుడు తోచిన రీతిని ఏ యాహారము, ఏ వేళలకు తినవలయునో నిశ్చయించు కొని ఆయేర్పాటుప్రకారము నడచుకొనును. లూయికూని తొట్టిస్నానముల వైద్యము చేసినంతకాలము ఆయన చెప్పిన విధమున ఉప్పుకారము లేకుండ నూగక నుడుకపెట్టబడిన వస్తువులనె తినియుండెను. అవసరమునుబట్టి యెటువంటిపథ్యమె నైనను జేసియుండెను. నిద్రాహారములందింతజాగ్రత్త కలిగి శరీరపరిశ్రమ చేయువానికి ఆరోగ్యమునందు కొరత యేమి? బాపయ్యగారు కళాశాలవిద్య ముగించువరకు మంచి యా రోగ్యముతో నుండిరి.

౧౯౦౪ వ సంవత్సరమధ్యభాగమున ఆయన విశాఖ పట్టణప్రాంతములకు వెళ్ళి తిరిగివచ్చినతరువాత కొంచ మస్వస్థతగా నుండెను. ఆసంవత్సరాంతమునకు జబ్బు హె చ్చెను. దగ్గుతో చాల బాధపడెను. మృత్యుభయముకూడ కలిగెను. కాని యీశ్వరానుగ్రహమున ప్రాణాపాయము తొలగి ఆయన క్రమముగా తిరిగి స్వస్థతజెందెను. ఇట్లున్న సమయమున పూర్వమువలె సాండో కసరతులు మొదలయినవి చేయప్రారంభించెను. శరీరమప్పటి కింకను బలహీనముగ

నుండుటచే, ఆకసరతులు ఆయనకు అమితహానిని కలుగ జేసినవి. అది తెలుపుచు పాలపర్తి నరసింహముగారికి కసరతు విషయములో సలహాపూర్వకముగ ఆయన యీక్రింది యుత్తరము ౭-౧౨-౧౯౦౭ తేదిన వ్రాసెను.

"నేను నీయెడల పూర్తిగ సానుభూతి చూపగలిగి యున్నాను. కాని నీకు నేను సలహా చెప్పగలనో లేవో తెలియదు. చెప్పగలిగియె యున్నయెడల, ఏమి చెప్పవలెనో తోచకున్నది. నీ జీర్ణశక్తి మంచిస్థితిలో లేదని వ్రాయుచున్నావు. నీశరీరమును నీగుండెయు బలహీన మగుచున్నవని దానివలన తెలియుచున్నది. ఆసందర్భములో సాండోకసరతు వలన మేలుకంటె నెక్కువకీడె కలుగునని నేను భయపడుచున్నాను. బలహీనస్థితిలో సాండోకసరతును తెలివితక్కువగా చేసి నాకు నేను శాశ్వతమయిన హానిని చేసికొన్నాను. నాగుండె యుండవలసిన చోటునుండి శాశ్వతముగ తొలగిపోయినది. నీవ్యాధి యున్నటువంటివానికి ఉదయము చీకటితో దూరముగా షికారుపోయివచ్చుట యుత్తమమయిన వ్యాయామమని నాయభిప్రాయము. ఆయాసము కలుగకుండ, పరిశుద్ధమయిన మంచిగాలియందు, నీవు నడువగలిగినంత దూరము నడువుము. ఆయాసము వచ్చినతరువాత నడువ వద్దు. ఒకపక్షిము నెలో అయినతర్వాత నీ మల

బద్ధకము సహితము పోవును. ప్రయత్నము చేసి చూడుము"

ఈయుత్తరమువలన బలహీనస్థితిలో నున్నప్పుడును ఆయన మామూలుప్రకారము సాండోకసరతు చేసియుండె నని తెలియుచున్నది. ఆ కసరతుచేయుట ప్రయాసకరముగ నున్నను దానివలన నష్టము కలుగునని తెలియకపోవుటచే పట్టుదలతో శ్రమనంతయు నోర్చుకొనుచు దానినిచేసి ఆయన తన యారోగ్యమునె చెడగొట్టుకొనెను. శరీరపరిశ్రమ యిప్పు డీవిధముగ పరిణమించినను, మొదటనుండియు ఆయన కెంతో మేలును కలిగించెను. శరీరపరిశ్రమవిషయమున ఆయన కనపరచినదీక్ష యద్భుతము. అందునకు ఇతరులను కూడ ఆయన ప్రోత్సాహపరచుచుండెను. చదువునకుగాని సంధ్యావందనమునకుగాని యెంత ప్రాముఖ్యత నిచ్చెనో అంత ప్రాముఖ్యతయు ఆయన శరీరవ్యాయామమున కొసంగెను. షికారుకు పోవునప్పుడు శరీరమునకు పరిశ్రమ యగుటయె గాక చిత్తము ప్రకృతిదృశ్యముల గాంచి యీశ్వరచింత నము నతిసహజముగ సలుపగలుగునని ఆయన జెప్పుచుండు వాడు. దేహపరిశ్రమను ఆధ్యాత్మికసాధనగా ఆయన విని యోగించుచుండె ననుటకుసందేహింప నక్కరలేదు.

శరీరపరిశ్రమ చేయువారు వేళలకు బలమయిన యా హారమును గైకొనుచుండవలెను. బాపయ్యగారు ఆహారవిష

యమునను నెంతయో శ్రద్ధ జూపి పాలు మొదలయిన బల మిచ్చుపదార్థములను తినెడువారు. పథ్యముచేయవలసి వచ్చి నప్పుడు కఠినముగ పథ్యముచేయు వారని యిదివరకె తెలుప బడినది. ఆహారనియమముల పాటించుటలో ఆయన యెట్టి ధర్మదృష్టితో మెలగెనో సూచించుటకు ఆయన ౨. ౮. ౧౯౧౮ తేదిన తన దినచర్యపుస్తకమునందు వ్రాసికొనిన యంశ మీక్రింద పొందుపరుపబడినది.

"హర్నియా అపాయకరమయినవ్యాధి యనియు, ఇక ముందు దానివిషయమయి నేను జాగ్రత్త వహింపవలసియుం డు ననియు గ్రహించినాను. నేటినుండి మిక్కిలి కఠినమయిన పథ్యమును చేయవలయును. కఠినపథ్యమును చేయుటకును, నాడాక్టర్ లూయికూని చెప్పినవిధమున నడచుకొనుటకును, ఈశ్వరుడు నాకు తగినంత బలమును ప్రసాదించును గాక! ఇది పవిత్రమయిన ప్రతిజ్ఞ; ఆచరణయందు నిష్ఠతో పాలింప వలెను. పరిపూర్ణపవిత్రస్వరూపుని సమక్షమున నేను తీసికొను చున్న యీ దీక్షను ఆయన యాశీర్వదించును గాక!"

చిన్న విషయములం దింతధర్మబుద్ధిని నిలుపువారు చాలయరుదు. సత్సంకల్పము లందరికిని కొన్ని పరిస్థితు లందు కలుగునుగాని పలువు రాసంకల్పములను కార్యరూపము నొందింపలేరు. గొప్పవిషయములలోనె గాక సామాన్యదైవిక

కృత్యములందు సహితము అనుకొనినరీతిని నడచుకొనుటకు చాలమంది యశక్తులుగా నుందురు. వారిసంకల్పములు బల హీనములు. సంకల్పములు ఈశ్వరశక్తిద్వారా ప్రతిజ్ఞలుగ మారినప్పుడె యమితబలమును పొంది యమోఘములు కా గలుగును.

శరీరము ఈశ్వరునియొక్క ఆలయ మనుపరమసత్యము బాపయ్యగారికి హృద్గోచరమయ్యెను. ఆహార వ్యాయామ నిద్రాది విషయములందు శ్రద్ధగలిగి శరీరమును ధృఢముగ నుంచుటకు ప్రయత్నించుటయె గాక యింద్రియములను వశ పరచుకొని నీతిమార్గమున నడపి శరీరమును పవిత్రముగ నుంచుటకు గూడ ఆయన పాటుపడెను. మనోవాక్కాయ కర్మలన్నియు పరిశుద్ధములుగ జేయుటయె ఆయనయొక్క యాదర్శము. స్వచ్ఛముగ దీపము వెలుగుచున్నను దానిని చుట్టియుండు చిమ్నికి మసిపట్టినయెడల, ఆదీపపుకాంతి యెట్లు మాలిన్యముజెందునో అటులనె శరీరముయొక్క యపవిత్రత మూలమున అంతరమందలి యీశ్వరతేజము నిర్మలముగ ప్రకాశింప నేరదనుట నిశ్చయము. పరమేశ్వరుని సత్యజ్యోతి ప్రకాశించుటకు తగినట్లు శరీరమును నిర్మలముగ నుంచుటలో బాపయ్యగారు వహించినశ్రద్ధ యమితము. దుష్టవర్తనముచే గాని, దుర్భాషలచేగాని ఆయన తన బాహ్యజీవనమును కళం

కితము చేసికొనకుండుట ఆయనతో పరిచయము గలవారెల్ల రకు సువిదితము. బాహ్యశరీరవ్యాపారములకు నాధారములై యున్న యింద్రియములు మనోనిగ్రహముద్వారా గాని సరళ తను జెందవు. మనస్సును సదా సచ్చింతలందు నిమగ్నము చేయుటయే ఆయనయత్నము. సద్గ్రంథములను చదువుచునో సద్విషయములను యోచించునో, సత్కార్యములనుచేయుచునో మేల్కొనియున్న కాలమంతయు మనసు పని గలిగియుండు నట్లుగా ఆయన తన దినచర్యను ఏర్పాటు చేసుకొనువాడు. సోమరితనము ఆయన యందెంతమాత్రము గాన్పించదు. మనోనిగ్రహమును తద్వారా జితేంద్రియత్వము కలిగి ఆయన తనజీవితము పూర్ణముగ శాసనబద్ధము చేసెను.

> "Self-reverence, self-knowledge, self-control. These three above lead life to sovereign power yet not power (power of herself would come uncalled for) but to live by law. Acting the law we live by without fear. And, because right is right, to follow right were wisdom in the scorn of consequence."

ఆత్మగౌరవము, ఆత్మజ్ఞానము, ఆత్మసంయమము, ఈ మూడును జీవితమునకు మహాశక్తిని చేకూర్చుననియు,

అయినను అవి కలిగియున్న తరువాత శక్తి దానియంత టదియె వచ్చునుగనుక అవి శక్తిసంపాదనముకొరకుగాక ధర్మ శాసనప్రకారము జీవించుటకె యభ్యసింపనగుననియు, ధర్మ శాసనమును నిర్భయముగ ననుసరించుటవలన మనము సజీవులమై యుందుమనియు, ధర్మము ధర్మ మనుహేతువు చేతనే ఫలితమెటువంటిది రానున్నను లెక్కసేయక దాని ననుసరించుట యుత్తమజ్ఞానమనియు, అర్థమిచ్చు టెనిసన్ మహాకవియొక్క యీపై నివచనములు ౧౨-3-0౭ తేదిన బాపయ్యగారు దినచర్యపుస్తకమందు వ్రాసిపెట్టుకొనుటలో ఆయనమనోగతి యెట్టిదో స్పష్టపడుచున్నది. ఏ నియమములను పాటింపక స్వేచ్ఛావిహారము సలుపుటయె స్వాతంత్ర్య మను భ్రమయందు కొందరు తగుల్కొనుచున్నారు. వాస్తవమునకు వారిది స్వాధీనత గాక పరాధీనతయె; గాలిలో కొట్టుకొనిపోవుటయె. అట్లుగాక, బాపయ్యగారు జీవితమును పూర్తిగ శారీరకనైతికవిధులకు లోబరచెను. గడియారమంతక్రమముగా తిరుగునో ఆయన యంత్రక్రమముగా చరించువాడను ప్రతీతి గలదు. ఆయన జీవితమునకు సౌందర్యము దెచ్చినది క్రమవర్తనమె.

---

# జీవనస్మృతి

## ౭ ప్రకరణము

### వక్తృత్వము

వక్తృత్వమునందు బాపయ్యగారికి మొదటినుండియు అభినివేశము గలదు. కళాశాలలందు విద్యార్థులుచర్చలు జరపు సభలలో విరిగ పాల్గొనుచు వక్తృత్వశక్తిని ఆయన పెంపొందించుకొనెను. సులభశైలిని మృదువుగను ధారాళముగను ఆంగ్లభాషలో ప్రసంగింపగల సామర్థ్యమును సంపాదించెను. ఈసామర్థ్యమును బట్టియె తనకు ఉపాధ్యాయవృత్తి తగియుండునని ఆయన నిశ్చయించుకొనినట్లు తలంపవచ్చును. తమ సామర్థ్యములను విచారించుకొనక ప్రవేశించుట కవకాశముగల వృత్తులందు జేరి తాము బాధపడుచు నితరులను బాధపెట్టుబుద్ధిమంతులగణములో బాపయ్యగారివంటి స్వభావముగల వారిని జేర్చుటకు వీలు లేదు గదా? వృత్తినిమిత్తమె గాక, తన జీవితసందేశమును వ్యక్తపరచుటకు వక్తృత్వమును సాధనభూతముగా గూడ ఆయన జేసికొన సంకల్పించెను.

వక్తలు కాదలచినవారు మహావక్తలోనంగు నుప న్యాసములు వినుట ముఖ్యవిధిగా జేసికొందురు. జ్ఞానసంపా దనముతో బాటు తన్మూలమున నుపన్యాసధోరణియు కుదు రును. చెన్నపురియందున్న కాలములో భావయ్యగారు గొప్ప యుపన్యాసకుల ప్రసంగములను వినుచు వాని సారాం శములు వ్రాసియుంచుకొను వారని యిదివరకె తెలుపబడి నది. అవియన్నియు వినిన తరువాత తన సహజ పద్ధతిని అవ కాశములు తటస్థించినప్పుడు ప్రసంగములు గావించుటకు నభ్యసించువాడు. మిక్కిలి పెద్దదియగు చెన్నపురి ఆండర్సన్ హాలులో ఆయన అప్పుడప్పుడు ప్రసంగించుట కలదు. ఆ సమయములు ఆయన ప్రయత్నమున కెట్లు తోడ్పడినవో చూడుడు. ఆయన కంఠము కొంచము తగ్గుస్వరముగా నుం డును. విషయమును, భాషను అమర్చుకొని చక్కగ నుపన్య సించుటకె గాక కంఠస్వరము సాధ్యమయినంతవరకు పెద్దది చేసికొనుటకును ఆయన యత్నించుచుండెను. ఆండర్సన్ హాలులో తానొకతూరి నుపన్యసింపబోవుచు ముందుగా తన మిత్రులయిన రామరాజు చెంచురామయ్యగారిని ఆ పెద్ద హాలులో చివర నిలువబడి తన మాటలు వినబడువర కును 'హియర్, హియర్' అని కేకవేయుట కేర్పాటు చేసి కొనెను. చెంచురామయ్యగారు కేక వేయక పోవుటచే,

తాను హాలంతయు వినబడునట్లు ప్రసంగింప గలిగితినా యని ఆయన చెంచు రామయ్యగారిని ఉపన్యాసానంతర మడుగ, 'నీ గొంతు వినబడ లేదు. అప్పటికే యెంతో ఆయాసపడు తున్న నిన్ను ఇంకా శ్రమ పెట్టడానికి ఇష్టం లేక నేను కేక వేయ లేదు." అని చెంచు రామయ్యగారు బదులు చెప్పి రట. దీనిని బట్టి భావయ్యగారు తా ముపన్యాసములను బాగుగ నియ్య గలుగుటకు వలసిన శిక్షణమును తమకు తామె కల్పించుకొనుచు తమ భావికర్తవ్యమునకు సంసిద్ధు లైరని గ్రహింపనగును.

౧౯౦౩ సంవత్సరమునుండి వివిధపట్టణములకు బోవుచు విద్యార్థులయొక్కయు విద్యాధికులయొక్కయు జనసామా న్యముయొక్కయు ఉపయోగమునకు ఆయన యుపన్యాసము లొసంగ ప్రారంభించెను. అవసరమునుబట్టి తెనుగులో గూడ ప్రసంగించుచుండెను. ఆయనయుపన్యాసములు యుక్తి యుక్తము లయి పండుఒలిచి చేతిలో బెట్టినట్లుండు ననియు, ప్రతిపక్షుల క్రోధానలమును చల్లార్పగల ప్రశాంతవర్ష ధారల వలె నుండుననియు, శ్రోతలు నూతనోత్సాహము బడసి నవ జీవనము ప్రారంభించుటకు మిక్కిలి తోడ్పడుచుండు ననియు, వానిని వినిన వారందరు ప్రశంసించునంతగా ఆయన తన వక్తృత్వశక్తిని వృద్ధిజేసికొనెను.

చీరాల ప్రార్థనసమాజవార్షికోత్సవమున కాయన అగ్రాసనాధిపతిగా నుండుటకు కోరబడి యాగ్రామమునకు ఒక సంవత్సరము వెళ్ళియుండెను. గ్రామవాసులు పలువురు సమావేశమయిరి. ఆయన తన యధ్యక్షోపన్యాస మిచ్చిన తరువాత కొంత యాయాసము జెందుటచే దగ్గరనున్న వారిని త్రాగుటకు మంచినీళ్ళు తెచ్చి యిమ్మని కోరెను. ఒక బ్రాహ్మణేతరప్రముఖుని యింటివద్దనుండి నీళ్ళు తీసికొని రాబడి ఆయన కీయబడెను. ఏమియు నాలోచింపక ఆయన వెంటనె మామూలువరుసను ఆ నీటిని త్రాగెను. సభలో కలవరము బయలుదేరెను. బ్రాహ్మణులకు పట్టరాని యాగ్రహము వచ్చెను. "బ్రాహ్మణకులాన పుట్టి, దేశిరాజువారి వంటి గొప్ప కుటుంబానికి జెంది, ఇంతమంది బ్రాహ్మణులము చేరియుండగా, మమ్ము అవమానపరుస్తూ, నీ కులానికి, నీ వంశానికి అపకీర్తి తెస్తూ, ఆచారవిరుద్ధంగా ఏదో మాట్లాడడమె గాక, బహిరంగముగా మాయెదుట శూద్రుల చేతినీళ్ళు తాగుతావా? నీ కిది తగునా!" అని యొక బ్రాహ్మణోత్తముడు కోపావేశపరవశుడయి బాపయ్యగారిని ప్రశ్నించుచు పరుషవాక్యములు పలికెను. పల్లెటూరిలో ఆచారపు పట్టుదల హెచ్చుగా నుండును గదా? అందులో ఇది సుమారు ఇరువది యయిదు సంవత్సరములక్రిందటి

సమాచారము. ఆ కాలములో బ్రాహ్మణ స్త్రీలలో కూడ కులకట్టు
బాటులను మీరుట కెవరును సాహసించువారు గారు.
బాపయ్యగారి వర్తన చీరాల గ్రామవాస్తవ్యులకు విపరీత
ముగ దోచుటలో నాశ్చర్య మేమియు లేదు. బాపయ్యగారు
తమ సహజప్రశాంతవచనములతో బదులుచెప్పి బ్రాహ్మణు
లను సమాధానపరచి అల్లరిని అణచి సభను తుదవరకు
చక్కగ నడుపగలిగిరి. నాటి సభాచర్య చీరాల పౌరులకు
నేటివరకు జ్ఞాపక ముండి విస్మయము గొల్పుచున్నది.
బాపయ్యగార యుపన్యాసములు జనవశీకరణశక్తి నంతగా
గలిగియుండెను.

గుంటూరు పట్టణమున నొక పర్యాయ మాయన
సాంఘికపారిశుద్ధ్యమునుగురించి యుపన్యసించెను. విద్యార్థులు
చాలమంది సభకు వచ్చిరి. భోగము మేళములనుగురించియు,
అవినీతికరములయిన యితరసాంఘికదురాచారములనుగురిం
చియు శ్రోతలకు విచారము పుట్టించి వానినుండి విముఖత
పూర్తిగ కలిగించు హృదయపూర్వకవచనము లాయననోటి
నుండి వెలువడెను. ఉపన్యాసాంతమున కొందరువిద్యార్థులు
తాము భోగము మేళములు చూడమనియు, ఇతరదురభ్యాస
ములకు దూరముగా నుందుమనియు వ్రాతమూలముగా ప్రతి
జ్ఞలను గైకొనిరి. ఇటువంటి నైతికప్రబోధము ఇతరపట్టణా

విద్యార్థులందును కలిగించెను. గుంటూరు విద్యార్థులలో నొకరు నాడు తమకు కలిగిన యనుభవమును మార్చును ఈ విధముగ జెప్పుచున్నారు—"ఆయన ఉపన్యాసంలో ఉపయోగించిన కొన్నిమాటలు నాచెవిలో ఇప్పటికీ వినబడుతున్నట్లున్నవి. ప్రతిజ్ఞాపత్రముమీద నేను కూడ సంతకం చేసి అదివరకు వేసుకోడానికి బాగా అలవాటు పడివున్న తాంబూలాన్ని సయితం ఆరోజునుంచీ మానుకున్నాను. దగ్గుకు వైద్యంగా ఇటీవల ఒకరు తాంబూలం వాడుమని చెప్పగా ఇప్పు డప్పుడప్పుడు వేసుకుంటున్నానే గాని అనేకసంవత్సరాలు తాంబూలం మానివేసితిని. నా ధార్మికజీవనానికి నాటి ఆయనయుపన్యాసము ఒక మూలకంద మయిం దనుకుంటున్నాను." ఈ మాటలు నుడివినవారు సంఘసంస్కరణము కొరకును, రాజ్యాంగసంస్కరణముకొరకును విశేషముగ పాటుపడి సంఘబహిష్కారము కఠినకారాగృహవాసదండనము మొదలయిన కష్టములకు లోనయి నేడు గుంటూరులో ఆంధ్రమహాజనుల తోడ్పాటుతో శారదానికేతనసంస్థను నడపుచున్న ఉన్నవ లక్ష్మీనారాయణగారు. బాపయ్యగారి యుపన్యాసము లీతీరున జీవితములను పరివర్తనము నొందింపగల శక్తిని గలిగియుండెను.

ఉపన్యాసములద్వారా బాపయ్యగారు ధర్మప్రచారము

చేయగలిగి యుండిరనియు, అవి హృదయపరివ ర్తనమునకు తోడ్పడుచుండెడి వనియు సూచించుటకు మాత్రమె యీ యొకటి రెండు అంశములు వ్రాయబడినవి. వ క్తలె వక్తలను బాగుగ మెచ్చుకొనగలరు. మహావ క్తల యుపన్యాసములను ఆయన వినినప్పుడు వారిని ప్రశంసించుచు వారినుండి ప్రబోధ ము బడయువాడు. ప్రబోధము బడయగలిగి యుండుటచేతనె ఆయన యితరులకు ప్రబోధ మీయగలిగెను. ఇతరవక్తలను ఆయన యెట్లు స్తుతించి వారివలన జ్ఞానము పొందెనో అదియు తెలిసికొనుట ముఖ్యము.

౨౯-౩-౧౯౦౭ మొదలు ౨-౪-౧౯౦౭ వరకు జరిగిన కార్యములక్రింద బాపయ్యగారు ఈక్రిందివిధమదినచర్యపుస్తక ములో వ్రాసికొనిరి. "ఆంధ్రఆ స్త్రీకసంఘసంస్కరణమహాసభ లకు వెళ్ళితిని. పిఠాపురము రాజాగారు మిక్కిలియుత్సాహ ముతోడను, అధికాస క్తితోడను సభాచర్యలన్నిటియందును పాల్గొనిరి. ఈశ్వరు డాయనను సర్వదా ఆశీర్వదించునుగాక! పండిత శివనాథశాస్త్రిగారి యుపన్యాసములు(Simply ex-cellent) మహోత్కృష్టములుగ నున్నవి. భూమి బల్లప రుపుగానున్నదని యింటిలోను, గుండ్రముగా నున్నదని పాఠ శాలలోను చెప్పుధోరణి తగదు. పూర్ణమయిన సచ్చారిత్ర మునకు మూడు శక్తులు ప్రధానముగ నుండవలెను.-(1)సత్య

మును గ్రహింపజాలినంత బుద్ధి. (2) సత్యమును ప్రేమింప గలిగినంత హృదయబలము (3) తదనుగుణముగ్గ నాచరించు టకు వలసిన యిచ్ఛాశక్తి. నీకు భుజించుటకు కూడ వేళ లేనంతగా నీదేశమును ప్రేమింపుము. రావె యను మహమ్మ దీయభక్తుడు ప్రవక్తనుగురించి యోచించుటకె కాలము లేనం తగా దేవుని ప్రేమించెను. సర్వమానవులయెడ సానుభూతిని, స్వీయజీవనమున భక్తిభావమును మనమందర మలవరచుకొని విశ్వాసమును ఆశను మిళితము చేయవలెను. ధర్మము మూలమును, సంఘము ఫలమును పోలియున్నది.'' ఈవాక్య ములందు మహావక్త యని పేరుపొందిన పండిత శివనాథశా స్త్రిగారి యుపన్యాసము శ్లాఘింపబడినది; మరియు అందలి భావములు చక్కగ వ్యక్తపరుపబడినవి. వక్తను వక్తయె బాగుగ మెచ్చుకొని అర్థముచేసికొనగల డను న్యాయమును బట్టి బాపయ్యగారును వక్తయని గ్రహింపనగును.

వక్త యన నేర్పుగ మంచిశైలిలో మాటాడువా డని సామాన్యముగ తలంపబడును. అట్టివాని యుపన్యాసము వినుచున్నంత సేపు శ్రోతలకు ఆనందముగను వినోదముగను ఉండును. ఆ యుపన్యాసకుడు తరలిపోగానె ఆయనయుప న్యాసము కూడ ఆయనతో సెలవుపుచ్చుకొనును. శ్రోతల హృదయములందె భావములు నాటబడవు. వారిజీవితము

లుజ్జీవింపబడవు. ఆ యుపన్యాసము ప్రాణములేని అంద మైన బొమ్మవంటిది. ఉపన్యాసము సజీవమై యుండినయెడ ల౯ అది హృదయములో చొచ్చుకొనిపోయి మోడువారిన జీవితమునందు నూతనజీవము పోయును. ఉపన్యాస మాశ క్తిని కలిగియుండుటకు ఉపన్యాసకుడు తాను ప్రకటించు భావములను భాషలో చక్కగ పొదుగనేర్చుటయె గాక తన జీవితమునందు రూపము తాల్చునట్లు వర్తింప సమర్థు డయి యుండవలెను. విశ్వసించినట్లు ఆచరింపగలవాడె ధర్మ జీవనమును తోడిమానవులందు వ్యాపింపచేయగలడు. అట్టి వాడె నిజమయిన వక్త. విషయములను జ్ఞాపక ముంచుకొను టకు ఎవరి యుపన్యాససారాంశమునైన మనము వ్రాయు చుందుము. బాపయ్యగారు నావిధముగ కొందరిప్రసంగములు వ్రాసినవ్రాసియుండును. కాని ఆయన తన దినచర్యపుస్తకము నందు తన మననకాలమున వ్రాసికొన్నవి మాత్రముఅట్టివిగాక ఆయన జీవితమున పేరూనిన వని నిశ్చయముగ చెప్పవచ్చును. యథార్థవక్తలమహాప్రసంగములను వినుటచేఆయనయందు ధ ర్మప్రబోధముకలిగి నిజమయినవక్తృత్వశక్తి పొడసూపెను. ఆ యనమహానీయులయుపన్యాసములువినుటమూలమునధర్మోత్తే జము పొందెనని సూచించుటకు మరియొక నిదర్శనము కలదు. ౨౨-౯-౧౯౦౬ తేదిన వెంకటరత్నమునాయుడుగారి ధర్మ

ప్రసంగము వినినతరువాత తన దినచర్యపుస్తకమందు ఆ తేదిని యీవిధముగ వ్రాసికొనెను. "వెంకటరత్నమ్మగారు పురమందిరమున గావించిన యీశ్వరోపాసనకు వెళ్లితిని. ‘పరమేశ్వరునకు ఆత్మసమర్పణము’ అను విషయమునుగురించి వారు ప్రసంగించిరి. ఒకక్రైస్తవాలయములో సొమ్ము వసూలుచేయు సమయమున పైకమునంచి అందరివద్దకు తీసికొనిపోబడి నప్పుడు ఒక యువకుడు సంచిలో ఏనాణెమును వేయక ఒక వైపున తనపేరును రెండవవైపున ‘నాఆత్మను’ అను మాటయు గల ఒక కార్డును పడవేసెను. ధర్మమండలియొక్క సేవనిమిత్తము వాడు ఆత్మసమర్పణము గావించెను." వెంకటరత్నమునాయుడుగారి ప్రసంగమందలి యీభావము బాపయ్యగారి మనమున ప్రతిఫలించెనని నుడువవచ్చును. ఈశ్వరార్పితమయిన జీవితమును కలిగి ధర్మోత్సాహము పురిగొల్పగలశక్తిని సంపాదించి యుండుటచేతనె బాపయ్యగారు వక్త యని పిలువబడుటకు ముఖ్యముగ నర్హులై యున్నారు. ఆయనయొక్క యాత్మసమర్పణాశీలమునుగూర్చి ప్రత్యేకముగ వివరించుట యుచితము.

---

# జీవనస్మృతి

## ౯ వ ప్రకరణము

### పరివర్తనము

వృక్షము నందుద్భవిల్లి దాని నంటియున్నంతవఱకె ప్రాణము కలిగి పెంపొందునదియయినను, వృక్షముద్వారానె పుష్పము పూర్ణముగ వికసించుటకు వలసిన శక్తి నంతయు బడయజాలదు. నిర్మలవాయువును, చల్లనిమంచును, సూర్య రశ్మియు దాని వికాసమునకు తోడ్పడును. అది స్వచ్ఛమయిన గాలిని పీల్చుచు, శీతలహిమకణములచే తడపబడుచు, భానుని కరములచే తుడిచి విప్పబడుచు నుండవలెను. బాపయ్యగారు సద్వంశమున జన్మించి యావంశముద్వారా కొంతయభివృద్ధిని బడసిరి. కాని, ఆయన యభ్యున్నతికి ఆయన పెరిగిన పరిస్థితు లును, పొందిన సర్వాంగపరిజ్ఞానమును, సలిపిన శారీరక నైతికసాధనలును విశేషముగ సాయపడినవి. ఆయన జీవితము స్వల్పకాలములోనె సమగ్రముగను సుందరముగను పుష్పము వలె వికాసము గాంచినది.

ఈశ్వరభక్తి ఆయనకు చిన్నతనమునుండికలదని తెలుప

బడెను గదా? ఆభక్తి కాలక్రమమున వర్ధిల్లి పరిశుద్ధతఁ జెందెను. ఇతరులు చేయుడని చెప్పుటవలనను, పరులను చూచుచుండుట వలనను, మనయందు జ్ఞానము తీక్ష్ణముగ లేనప్పుడు, మనము కొన్ని భక్తిసాధనలును మతకర్మలును అనాలోచితముగ సలుపుచుందుము. బాల్యమునందు సాధారణముగ అందరి కీయవస్థ తప్పదు. అప్పుడు అనుకరణస్వభావమె మనయందు హెచ్చుగా నుండును. మన యాత్మయందలి జ్ఞానము ప్రజ్వరిల్లినకొలది, అనుకరణజీవితమంతయు నందు పుటము వేయబడి స్వచ్ఛ మగుచుండును. మన్నుతోను దుమ్ముతోను చేరిన బంగారమె మనకు ప్రకృతియందు దొరకును. ఆ మలిన బంగారమును తెచ్చి అగ్నియందు పుటములు పెట్టి శుభ్రము చేయుదుము. ఇతరులనుండి గ్రహింపబడు భక్తియు కొంత మౌఢ్యముతోను, కొంత భ్రమప్రమదాదులతోను కూడి యుండును. ఆత్మజ్ఞానముద్వారా, ఆభక్తిని పరిశుద్ధము చేయగలుగుదుము. బాపయ్యగారు పూర్వాచారసంబంధమయిన భక్తి బాల్యముననె బడసెను; తరువాత క్రమశిక్షణము వలన జ్ఞానోద్దీపనము గాంచి యాభక్తిని వినిర్మలము గావించుకొనెను. నమ్మినట్లు ఆచరించు స్వభావము మొదటనుండియు కలిగి యుండెను. ఆయన యొక్క తెల్లవారుజాము స్నానములు, తడిబట్టలతో తులిసెమ్మదగ్గరి జపములు, మంత్రోప

దేశములు, పిలకజుట్టు, గూడకట్టు, విభూతిరేఖలు చూచిన వారు చాల కొలదిమంది యుందురు. ఎట్టి పూర్వాచారపరాయణుని యందైనను అంత నిష్ఠ గాన్పింపదు. తనతో నున్న వారిని గూడ తన పద్ధతుల ననుసరించుటకు హెచ్చరించు వాడు. నన్ను తల్లి గారాబముగ పెంచి యిచ్చవచ్చినట్లు చరించు టకు చిన్నతనమున వదలియుంచుటవలనను, నాలుగైదు సంవత్సరముల ప్రాయమునుండి యామె మరణానంతరము అక్క గారివద్ద చేరి భయభక్తులు లేకుండ పెరుగుటవలనను, నేను ప్రథమమునుండి చదువునందుగాని, సంధ్యయందుగాని, ఎట్టి యితర సదభ్యాసమునందుగాని శ్రద్ధగలవాడను గాను. ఆట పాటలందును, పోట్లాటలందును, స్వేచ్ఛావిహారమందును నా కెక్కువ ప్రీతి యుండెడిది. బడికి సరిగా పోవువాడను గాను. సంధ్యావందనము నేర్పిన బ్రాహ్మణునకె యది యొప్పగించి దాని ప్రసక్తి మానుకొంటిని. శాపయ్యగారి క్రమజీవితము నకు నాది సూటిగా వ్యతిరేకముగ నుండెను. నేను ఆయ నతో పసితనమునుండి కలసి జీవించుట తటస్థించినది. అది యొక చిత్రము. నేను ఆయనను గాని మరెవ్వరిని గాని లక్ష్యపెట్టి వారు చెప్పినట్లు నడచువాడను గాను. కాని ఆయన నాయందు ఎందువలననో యమితప్రేమ చూపుచుండెను. నే నది యెరిగియు, ఆయనమాటలను పెడ

చెవిని పెట్టువాడను. ఒక దినము సాయంకాలము బాపట్ల లో పచ్చికబయళ్ళమీదికి ఆయనతో కలసి షికారుకు వెళ్ళితిని. అచట మంచినీళ్ళదొరువు లుండెను. సూర్యాస్తమయ సమయము కాగానె ఆయన దొరువులో దిగి కాళ్ళుచేతులు కడుగుకొని సంధ్యవార్చుటకు మొదలుపెట్టెను. దొరువు గట్టున నే నది చూచుచు కూర్చుంటిని. కొంత సే పయిన తరువాత, ఆయన నన్ను పిలిచి ‹ఒరే, సంధ్య వార్చ రాదు ట్రా. అట్లా ఎందుకు కూర్చుంటావు?' అని చెప్పెను. నేను వెంటనే దొరువులో దూకి గబగబ సంధ్యావందనమంత్రములు వల్లించుచు వ్రేళ్లతో నీళ్ళు అటునిటు విదల్చితిని. నే నది యంతయు తమాషాకు చేయుచుంటిని. నేను చల్లుచుండిన నీళ్ళుకొన్ని తనమీద పడుటచే, జపము చేసికొనుచున్న ఆయన కళ్ళు తెరచి నావంక చూచి "గోళ్ళనీళ్లు ఇతర్లమీద పడేస్తే పాపంరా''అని మాత్రము నిదానముగ నుడివి తిరిగి జపముకొరకు కళ్ళు మూసికొనెను. ఆ మాటలవలన నేదో కొంతభయము వేయగా, సంధ్యను కట్టిపెట్టి చప్పుడు చేయకుండ గట్టునుచేరి మెల్లగా కూర్చుంటిని. తన సంధ్య 'ముగిసినతరువాత ఆయనయు బయటికి వచ్చెను. నేను దొరువులో చేసిన అల్లరినిగురించి ఆయన మరల ప్రస్తావించి యుండ లేదు. ఏవో కబురులు చెప్పుకొనుచు ఇద్దరము కలసి యింటికి

పోతిమి. ఆ రోజులలో ఆయనకు కొన్ని పనులు చేయుట పుణ్య మనియు, కొన్ని పనులు చేయుట పాప మనియు దృఢ విశ్వాస ముండెడిది. పాపపుణ్యములను గురించి అప్పుడాయన యెట్టి విచారణ చేయలే దని చెప్పవచ్చును. ఒకకార్య మెందువలన పుణ్యమో, మరియొక కార్య మెందువలన పాపమో, హేతువులద్వారా ఇతరులకు నచ్చచెప్పుట కాయన ఆదినములలో ప్రయత్నించెడు వాడు గాడు. తన విశ్వాసమంతయు స్పష్టపడురీతిని 'ఇది పాపము, అది పుణ్యము' అను మాటలుమాత్ర ముచ్చరించుచుండెను. ఆయన ధర్మజీవనమందలి ప్రథమస్థితి యిట్టిది.

ఈ యనుకరణజీవనము క్రమక్రమముగ స్వతంత్ర జీవనముగ పరివర్తనము జెందెను. ఆయన జ్ఞానమునందు పెరిగినకొలది తనపద్ధతులను తానె మార్చుకొనెను. మొదట నుండిన యనుకరణస్వభావము ఆయనయందు పూర్తిగ అంతరించిపోయినది. పూర్ణస్వతంత్ర్యవ్యక్తి కాగలిగెను. ఉన్నతములయిన నవీనాచారము లవలంబించు వారిలో కూడ పలువురు అనుకరణస్వభావమునకు దాసులై యుందురు. స్వతంత్రముగ యోచించుటకు వారు పూనుకొనరు. 'ఆరు నెలలు సహవాసము చేసిన, వారు వీరగుదు'రను సామెతయె వారియందు సార్థక మగుచుండును. వా రెవరితో కలసి

జీవించుచుండిన, వారి యభిప్రాయములు తాము బడయుచుందురు; వారి పద్ధతులు తా మవలంభింతురు. వారి వేష భాషలు కూడ తా మను కరింతురు. ఏ సమస్య విషయమున అభిప్రాయము తెలుపవలసి వచ్చినను, తమ యాదర్శపురుషు లావిషయమున కలిగియుండు అభిప్రాయము తెలియువరకు ఆగి తెలియగానె అదియె తమదిగా వెలిబుత్తురు. ఆ పూజ్యపురుషుల వర్తనము తమ జీవితములకు ఒరవడి యైనట్లు, ఏ చిన్న పని చేయవలసి వచ్చినను, వారి నడవడికవంక చూచెదరు. ఈ యనుకరణజీవనము మన దేశ విద్యాధికులలో సహితము ప్రబలముగా నుండుటవలన స్వాతంత్ర్యముకొరకు సలుపబడు మతసాంఘిక-రాజకీయోద్యమములలో నేదియు జయము గాంచుట లేదు. అనుకరణము నుండి స్వాతంత్ర్యములోనికి పెరుగుట ప్రతివ్యక్తియొక్క లక్ష్యమై యుండవలెను. బాపయ్యగారు స్వతంత్రవ్యక్తి కా గలుగుటచేతనె, తనకు దారి చూపువా రెవరు లేకపోయినను, తనకు తానె ఆత్మజ్ఞానసాహాయ్యమున నూతనమార్గము నందు నడచి తనకంటె పెద్దలయినవారికిని తోడియువకుల కును మార్గప్రదర్శకు డాయెను. ఆయన నవజీవనము ప్రారంభించినతరువాత, ౨-౬-౧౯౦౬ తేదిన తన దినచర్యాపుస్తకములో తన స్వాతంత్ర్యాభిమానము వ్యక్తపరచుచు నీ క్రింది

విధమున వ్రాసికొనెను.

"నేను ప్రాయశ్చిత్తము చేయించుకొందునని విచిత్రములయిన వదంతులు వ్యాపించుచున్నట్లు తెలిసినది. అట్టి యే యవమానమునుండియైనను పరమేశ్వరుడు నన్ను కాపాడును గాక! కేశవచంద్రుని జీవితము చదువుటకు నేను నిన్న ప్రారంభించితిని. స్వాతంత్ర్యమునుగురించిన ఆయన 'జీవనవేదము' లోని యీ క్రిందివాక్యములు గమనింపదగి యున్నవి 'బానిసత్వము ప్రపంచమునకు విషమువంటిది; అది యనేక నరకబంధనములకు హేతువు. మొదటినుండియు బానిసత్వము మీద నేల యింతవిరక్తుడ నైతినో నేను చెప్పజాలను. కామక్రోధాది రిపువులను జయించుటకు మానవులు ప్రయత్నింతురు; కాని బానిసత్వ శత్రువునుండి తప్పించుకొనుటకు నెవరును తీవ్రప్రయత్నము సలుపుట లేదు...స్వాతంత్ర్యమె నాకు ఆదిమశబ్ద మాయెను...ఏ మానవుని పదతలమున పడను, నా పైని యధికారులకు నాయాత్మ నెప్పుడును విక్రయింపను, ఏ గ్రంథమునకును బానిసను గాను, ఏ ప్రత్యేక సంప్రదాయమును గూర్చియు నిరంతర యశోఘోషణము సలుపను...ఈ స్వాతంత్ర్యభావము నాలో పెరుగుచుండ, అన్నివైపుల ను విగ్రహాపూజయు జాతిభేదమును రాజ్యము చేయుచుండుటను గాంచితిని; వెంటనె వానిశృంఖలములను భేదించుటకు

నేను నిశ్చయించుకొంటిని... నేను ఘనతను సంపాదించుకొనుటకు గాని, మానవులలో నున్నతపదవి నాక్రమించుటకు గాని స్వాతంత్ర్యము నన్వేషింపలేదు... నేను స్వాతంత్ర్యమును ప్రేమించితినె గాని దానిచేత నేను బంధింపబడలేదు. గురుత్వము, గిరుత్వము ఎగిరిపోవును గాక! నే నస్వాతంత్ర్యమును అసహ్యింతును.*

కేశవచంద్రుని యీ యుత్తమవచనములు బాపయ్యగారికి రుచించుటనుబట్టి ఆయన స్వాతంత్ర్యశిఖర మధిరోహించె నని చెప్పవచ్చును. ఆయన మొదట కలిగియుండిన యనుకరణ జీవనము సంపూర్ణ స్వతంత్రజీవనముగా మారిపోయెను.

ఆయన యేసంబంధముగ నెవరితో కలసియున్నను, వారికిని తనకును గల యభిప్రాయభేదములు విస్పష్టముగ వ్యక్తపరచుకొనుచు తనవ్యక్తిత్వమును కాపాడుకొనుచుండెను. భిన్నాభిప్రాయము కలవారితో నతిసఖ్యముగా మెలగినను, ఆ మైత్రి యాయన తన స్వాతంత్ర్యమునకు భంగకరముగ పెరుగ నిచ్చువాడు గాడు. మోమోటమువలన గాని, గౌరవమువలన గాని, భయమువలన గాని, ఆయన తన యంతరాత్మప్రబోధమునకు వ్యతిరేకముగ నడచుకొనుట తన జీవితమున కానరాకుండ జేసికొనెను. బ్రాహ్మసమాజకుల

తోడగాని క్రైస్తవులతోడగాని స్నేహముచేసినప్పటికి, వారి భావములు వెంట్రనె స్వీకరింప లేదు. విరివియయిన గ్రంథపఠనము, పరభావవిమర్శనము, సత్యాన్వేషణపూర్వకమగు సమాలోచనము—వీని సాహాయ్యముతో తన యంతరాత్మ తనకెప్పటి కేది సత్యమని తెలిపినో దానినిమాత్రమె యనుష్ఠించియుండెను. వర్ణభేదము అనర్థదాయక మని గుర్తించిన తరువాత ఇతర కులస్థులతోడను, వితంతువివాహములు ప్రోత్సాహపరుప దగినవియని గ్రహించినతోడనే యట్టి వివాములు చేసికొనినవారితోడను, కలసి భుజించుటకు ప్రారంభించెను. బ్రాహ్మసమాజికప్రార్థనలు ప్రయోజనకరములుగ నుండుట నెరిగినవెంటనె వానియందు పాల్గొన మొదలిడెను. ఈరీతి పరివర్తనము చూచి ఆంధ్రదేశమున ప్రచారము చేయుటకు ౧౯౦౪ సంవత్సరములో మొదటిపర్యాయము వచ్చియున్న బాబు హేమచంద్రసర్కారు బాపయ్యగారు బ్రాహ్మసమాజమున జేరుటకు ప్రథముడుగా నుండునని యాశపడి యాయనతో ఆవిషయమై ప్రస్తావించగా, మాంసభక్షణవిషయమున బ్రాహ్మసమాజికులు కనపరచు నుదాసీనత సమంజసముగా లేదనియు, తాను వారి కోరిక నీడేర్చుటకు సిద్ధముగా నుండలేదనియు, ఆయన బదులుచెప్పెను. సంస్కరణకార్యములందు ఆయన ముందంజ వేయుచుండు

టను పరికించి క్రైస్తవమిత్రులు ఆయన క్రైస్తవు డగునని యెంతయో యభిలషించిరి. ఈ సంబంధమయిన ముచ్చట ఆయన దినచర్యపుస్తకమున నించుక కాన్పించును. ౨౯-౩-౧౯౦౬ తేదిన ఆయన యిట్లు వ్రాసికొనెను.

"చెన్నపట్టణమునకు బోవుచు రైలులో, రాత్రి మాఫెటు దొరగారితోడను వారి సతీమణితోడను భోజనముచేసితిని. అమాయకత్వమువలనను, అజ్ఞానమువలనను మాఫెట్ దొరసాని నన్ను క్రైస్తవుడను కావలసిన దని కోరెను. మాటలసందర్భములో నటుతరువాత ఆమె నాస్థితిని కనిపెట్టి యాతురతతో మాటాడ నారంభించెను. ఈశ్వరుడు వారికి నిర్మలమయిన దృష్టిని ప్రసాదించి నాయెడ సానుభూతి కలుగున ట్లనుగ్రహించును గాక! దృఢముగను ధైర్యముగను జీవింపవలసినదని ఆమె నన్ను హెచ్చరించెను. మార్గము చూపుటకు నావంక చూచుచు నా యనుష్ఠానజీవనము చాల మంచిదని తలంచునట్టి యనేకయువకు లున్నారని ఆమె చెప్పెను. నేను వారిని తప్పుత్రోవను పెట్టగూడదు. అది నాకు విధింపబడిన గొప్పబాధ్యత యైయున్నది. ఈశ్వరుడు నాకు సాయపడునుగాక!"

తనకు చదువుచెప్పిన ప్రొఫెసరుగారును వారి భార్యయు తమ చిరకాలపరిచయమును పురస్కరించుకొని పైవాక్య

ములందు సూచింపబడినట్టి మతవిషయిక సంభాషణమునందు తనను దింపినప్పుడు, బాపయ్యగారు తనకు వారియెడ గల గౌరవమునకు భంగము లేకుండ తన యభిప్రాయము వెల్లడి చేయుటలో నెంతయో మనోస్థైర్యము చూపియుండవలెను. బాప్టిజము పుచ్చుకొని క్రైస్తవుడ ననిపించుకొనుట కాయన యిష్టపడక పోయినను, గొప్ప స్వార్థత్యాగముతో సేవావ్రతమును గైకొని హిందూదేశాభివృద్ధికొరకు పాటుపడు చున్న క్రైస్తవప్రొఫెసర్ల సహవాసము చెన్నపురిలో ఆయ నకు లభించినతరువాతనె ఆయన వారినుండి యెన్నియొ సద్భా వములను, సదభ్యాసములను బడసెను; జీసస్‌క్రీస్తు బోధిం చిన యున్నతాదర్శములు తన జీవితమున నలవరచుకొనెను.

ఆయన తన జ్ఞానము వికసించినకొలది బ్రాహ్మ సమాజనాయకులు కనపరచిన యాదర్శములు మిక్కిలి యుదారములయిన వని గ్రహింప దొడంగెను. మన ప్రాంత ములందు ప్రారంభింపబడిన బ్రాహ్మసమాజోద్యమమునందు జేరి పాటుపడ మొదలిడెను. వీరేశలింగము పంతులుగారి తోడను, వెంకటరత్నము నాయుడుగారితోడను చెలిమిచేసి సంఘసంస్కరణోద్యమప్రయోజనమును పారిశుద్ధ్యవ్రతవిశేష మును తిలకించెను. ఈశ్వరోపాసనలు సమాజమునందు శ్రద్ధతో జరుపుచుండెను. పరిశుద్ధజీవనమునుగురించి యుప

న్యాసము లిచ్చుచుండెను. సంస్కరణమునం దమితోత్సాహము కనపరచుచుండెను. ఆంధ్రదేశమందు బ్రాహ్మసమాజ యువకులలో నగ్రగణ్యు డాయెను. ప్రపంచమున గల వివిధ మతముళకు తోడుగ మరియొక ప్రత్యేకమతమును స్థాపించుటకు బ్రాహ్మసమాజము వచ్చియుండ లేదని ఆయన తలంచెను. కాన, ఏదో నూతనమతమున చేరబోవు వారు సలుపవలసియుండునట్టి బాప్టిజమ్‌వంటి తంతు తన కనావశ్యకమని నిశ్చయించుకొనెను. బాబు హేమచంద్రసర్కారు అడిగినప్పుడె కాక తరువాత నెన్నడును కూడ బ్రాహ్మసమాజములో జేర్చుకొనుటకు కలకత్తా బ్రాహ్మసమాజికులు జరపునట్టి దీక్షాతంతునకు సహిత మాయన లోనుగాలేదు. ఆయన తన యనుచరుల నెవ్వరిని దీక్షపుచ్చుకొను డని కోరియుండ లేదు. ఏ సమయమున కే సత్యము పొడగట్టునో దాని ననుష్ఠించుచు మానవాత్మ ధర్మమార్గమున అనంత యాత్ర సలుపవలసియుండు నని ఆయన యభిమతము. ఈశ్వరోపాసనను సాధనముగా జేసికొని సర్వమానవులు సంపూర్ణసత్యము గ్రహించుటకు కృషి సలుపునిమిత్తము తోడ్పడుటకె బ్రాహ్మసమాజము ప్రతిష్ఠింపబడుటను ఆయన చక్కగ గమనించెను. తనయం దెన్నిమార్పులు కలిగినను, తన మతాభిప్రాయము లెంత యుదారత జెందినను, ఆయన

యేనూతననామము ధరింపక తనకు జన్మతో వచ్చిన దేశసంబంధమైన 'హిందూ' అను పేరునే నిలుపుకొనెను. పాలపర్తి నరసింహముగారు ఒక దరఖాస్తులో తన మతమును గురించి యేమి వ్రాసికొనిన బాగుండు నని బాపయ్యగారిని సలహా నడుగుచు వ్రాసిన యుత్తరమునకు బాపయ్యగారు ౨౫-౮-౧౯౦౭ తేదిన వ్రాసిన ప్రత్యుత్తరమునందు ["The best thing is to say casteless Hindu or a Hindu Brahmo. There shall be no objection to the word Hindu. I am myself no authority on the point......Do as you think best."] "వర్ణభేదము పాటింపని హిందు వనికాని హిందూ బ్రాహ్మ్మ డని కాని చెప్పుట సముచితము. హిందూశబ్దమునకు నెట్టి యాక్షేపణయు నుండకూడదు. ఈవిషయమై నిశ్చితాభిప్రాయము తెలుపుటకు నాకును తగినయధికారము లేదు. నీకు మంచి దని తోచినట్లు చేయుము." అని తెలిపియుండిరి. ఏ జాతి విత్తనమునుండి ఆజాతి మొలకయొ ఆ జాతి వృక్షమో బయలువెడలి అవి ఆ జాతియొక్క పేరుననె పిలువబడుటను గమనించిన వారెల్లరు బాపయ్యగారి యభిప్రాయ మెంత యుక్తియుక్తముగా నున్నదో గ్రహింపగలరు. ఆయన మొదట అవలంబించియున్న హిందూమతమె క్రమవికాసము జెంది పరిశుద్ధరూపము దాల్చెను.

# జీవనస్మృతి

## ౧౦ వ ప్రకరణము

### సర్వతోముఖవికాసము

జాన్ స్టూవర్టు మిల్ రచించిన 'స్త్రీల పరాధీనత' (The subjection of women) యను గ్రంథమును చదివి బాపయ్యగారు నోటుబొక్కులో వ్రాసిపెట్టుకొనిన భావములలో 'After the primary necessities of food and raiment, freedom is the first and strongest want of human nature.' అనునది యొకటి. ముఖ్యమయిన యక్కర లగు తిండి, బట్ట తరువాత మానవప్రకృతి కావశ్యకమయిన మొదటి బలవత్తరమయిన యక్కర స్వాతంత్ర్యము—అని దాని యర్థము. ఆ సూత్రము తెలుపుచందమున బాపయ్యగారు అన్నపానీయముల తరువాత స్వాతంత్ర్యమును ప్రథమమున పొందదగిన దానిగా జేసికొనె ననుట కిసుమంతయు సందేహము లేదు. ఆకలిదప్పు లేలాటివో స్వాతంత్ర్యాభిలాష ఆలాటిది. క్షుత్తు ఆహారముకొరకును, దాహము జలముకొరకును మానవుల పరితపించునట్లు చేయును.

స్వాతంత్ర్యవాంఛ జనించినతరువాత అదియు స్వాతంత్ర్యము కొరకు మానవహృదయములు తీవ్రముగ తపించునట్లు చేయును. బాపయ్యగారి స్వాతంత్ర్యజీవన మిట్టి పరితాపముతో గూడి యాయన జీవితముయొక్క సకలకార్యముల లోనికి వ్యాపించినది.

మతమునకును సంఘమునకును సంబంధించిన సంకుచితాదర్శములకు, ఆచారములకు, కర్మలకు, దాస్యము నెల్లపుటను ఆయన మానెను. జందెమును విసర్జించిన సంఘటనమును ఆయన దినచర్యపుస్తకమునం దీతీరున ౨౧-౮-౧౯౦౫ తేదీన వ్రాసికొనెను.—“ఈరోజు నా కొకసుదినము ఏలయన, నాకు సత్యమని తోచినదానిని ఆచరించుటకు దయామయు డగు పరమేశ్వరుడు నా కెక్కువవెలుతురును కటాక్షించియుండెను. రాత్రివేళ ఈశ్వరాదేశప్రోత్సాహముచే నేను జందెమును తీసివేసితిని. జందెమును తీయునప్పుడు, నా చేతులు వణకెను. కాని పార్థనతోడను, ప్రార్థనపూర్వకమయిన యంతఃకరణముతోడను, జందెమును ఆవల నుంచితిని. సర్వకారుణికు డయిన పరమేశ్వరుడు తాను చూపు మార్గమున నడచుటకు నా కధికముగ శక్తిని అనుగ్రహమును ప్రసాదించును గాక!” జందెము నిట్లు త్యజించి గభీరమనస్కుడై ఆయన యుండినతరి, బంధువులందు కలవరము

బయలుదేరెను. వారిలో ముఖ్యులు, ఆయన పినతండ్రి సీతా రామారావుగారు మొదలయినవారు, ఆయనను అది జరిగిన వారముదినములలోనె కలసికొని ఆ మార్గమునుండి తప్పించు టకు ప్రయత్నించిరి. ఏయభిప్రాయములు కలిగియున్నను, పైకి నలుగురితోపాటు నడుచుకొనుమని వా రాయనను ముఖ్యముగ కోరిరి. వారివాదములు గాని, ఆగ్రహావచన ములు గాని, జాలిమాటలు గాని ఆయనను చలింప లేదు. "Oh God! save me from hypocrisy and insincerity."—ఓ దేవా! కాపట్యమునుండియు, ఆత్మద్రోహ మునుండియు నన్ను కాపాడుమని ఆయనప్రార్థనమై యుండెను. జందెము తీసినతరువాత సుమారు రెండుమాస ములలో ఆయన తల్లియొక్క యాబ్దికము జరుపవలసి వచ్చెను. దానిని జరిపిన నవీనవిధానము ౧౫-౧౦-౧౮౦౫ తేదిక్రిందను ఆయన యిట్లు వివరించెను. "నేడు నాతల్లి యొక్క యాబ్దికము పరిశుద్ధాస్తికపద్ధతిని జరుపబడెను. కొంచెము బియ్యము తగినబీదలకు పంచిపెట్టబడెను. యథార్థ మానవుడనుగా జనులదృష్టికి నచ్చునట్లు జీవింప ఈశ్వరుడు నాకు వలసినంత యనుగ్రహమును ప్రసాదించుగాక! నన్ను శక్తివంతునిగాను పరిశుద్ధునిగాను జేయునుగాక! ఉదయము ఏడున్నర గంటలకు ఈశ్వరోపాసన యేర్పరుపబడెను. ఏ లేశ

లింగము పంతులుగారు ఆ శ్రాద్ధసంబంధమయిన యుపాసనను సలిపిరి. ఈ దిగువ పేర్కొనబడినవారు అందునకు వచ్చియుండిరి. (పదునార్గురు పేరులు గలవు). ఉపాసనావిధానము పండిత శివనాథశాస్త్రి ఎమ్. ఏ గారు వ్రాసి పంపిరి. ఉపాసన చాలభక్తితో గూడియుండెను. కొద్దిమాటలుమాత్రమె చెప్పుటకు నేను నోరు తెరచినప్పుడు నాచెక్కిళ్ళమీదికి కన్నీళ్ళు బొటబొట కారెను. పూర్వ మెన్నడును నేనంత భక్త్యావేశము జెంద లేదు. ఈశ్వరుడు నన్నును నాతల్లి యొక్క యాత్మను ఆశీర్వదించును గాక!" ఈవిధముగ తల్లి యాబ్దికము జరిపిన సుమారు నాలుగుమాసములకు ౧-౨-౨-౧౯౦౬ తేదిన తండ్రిగారి శ్రాద్ధమును ఆయన యిటుల జరిపినట్లు వ్రాసికొనెను.—"పంతులుగారు ఈశ్వరోపాసన గావించిరి. ఉపాసనానంతరము జాతిమతవివక్షత లేమాత్రము పాటింపని (cosmopolitan) విందొకటి యేర్పరుపబడెను. ఈదిగువ పేర్కొనబడిన పదిమందియు ఆవిందునకు వచ్చిరి. (౩ బ్రాహ్మణుల యొక్కయు, ౪ వైశ్యుల యొక్కయు, ౨ శూద్రుల యొక్కయు, ౧ క్రైస్తవునియొక్కయు నామములు పొందుపరుపబడినవి)...ను,...ను మరికొందరు విద్యార్థులును ఉపాసనకు మాత్రము వచ్చిరి. వంటనేర్చిన యొకరు దయతో చేసిన సాహాయ్యముతో వంటయంతయు నేనే చేసితిని. ఈచిన్ని

కార్యమును జయప్రదముగ నిర్వహింప నాకు శక్తిని ప్రసాదించి నందులకు ఈశ్వరుని స్తుతించుచున్నాను.'' ఈవిందును గురించిన వృత్తాంతము సత్యవాదినిపత్రిక ప్రచురింపగా, విందునకు వచ్చిన యొకరు తనను ప్రార్థనసమాజికునిగా జనులు భావింతురని తలచి, తన విశ్వాసములు ప్రార్థన, లేక బ్రాహ్మసమాజమువంకకు తనను మరల్చుట లేదనియు, సాంఘిక విషయములలోనె గాక మతవిషయములందు గూడ సంపూర్ణవ్యక్తిస్వాతంత్ర్యమునకై తాను పోరాడువాడ ననియు సత్యవాదిని పత్రికకు ఒకలేఖను వ్రాసిరి. అందునకు జవాబుగా సాంఘికవిషయములలోనె గాక మతవిషయములందు గూడ వ్యక్తిస్వాతంత్ర్యమునకై రాజీకొరకు చూడక ధైర్యముతో పోరుసలుపునట్టిసంస్థయె ప్రార్థనసమాజముకూడ నని బాపయ్య గారు వ్రాసినది, సత్యవాదినిలో సంపాదకీయముగ ప్రచురింపబడెను. ఈచర్చవలన,వ్యక్తిస్వాతంత్ర్యమునకవకాశమిచ్చునది యగుటచేతనే, బాపయ్యగారు ప్రార్థనసమాజమునందు పాటుపడబూనిరని స్పష్టపడుచున్నది. వ్యక్తి స్వాతంత్ర్యాభిలాష వలన ఆయన మతసాంఘికవిషయములం దెటువంటి మార్పునొందెనో చూడుడు. విగ్రహారాధనను విడిచి యేకేశ్వరోపాసకుడుగను, జాతిభేదమును మాని సర్వమానవకోటికి జెందినవాడుగను మారెను. పూర్వాచారమును ఎంతభక్తితో నను

సరించెనో యంతభక్తితోనె యీ నవీనపద్ధతినికూడ ఆయన యవలంబించినట్లు పాఠకులు గమనించియె యుందురు.

ఇక రాజకీయవిషయములం దెంతస్వాతంత్ర్యవాంఛను ఆయన కనపరచెనో చూతము. ౧౯౦౭ వ సంవత్సరములో భారతదేశము నుర్రూతలూగించిన రాజకీయాందోళనము ఆయన కెట్టిభావములు స్ఫురింపజేసెనో, ఆయనను ఎట్టికార్యములు చేయుటకు పురికొల్పెనో, వానినిబట్టి ఆయన యొక్క రాజకీయస్వాతంత్ర్యాభిమానము మనము కొంత గ్రహింపగలము. దినచర్యపుస్తకమందు ఆయన వ్రాసికొనిన యంశములు కొన్ని సందర్భానుసారముగ నిచట సమకూర్పబడును. "శ్రీజత్ బిపిన్‌చంద్రపాలు నేటి (౧౯-౪-౧౯౦౭) యుదయము (రాజమహేంద్రవరమునకు) అరుదెంచిరి. జనులు ముఖ్యముగా విద్యార్థులు కనపరచిన సంతోషము, ఆతురత, ఉత్సాహము అమితముగా నుండెను. సమితివారిచే వారికి స్వాగతోపన్యాస మీయబడెను. పాలుగారు వందేమాతరముయొక్క యంతరార్థమును వ్యక్తపరచిరి. మాతయందు ప్రత్యక్షముగు ఈశ్వరకారుణ్యమె (ఆమంత్రమంగలి మూలభావము). నా కెంతోకష్టముగా నున్నను ఊరేగింపుతోడ నడచితిని. పాలుగారితో భోజనము చేసితిని. *ఒక జాతీయ

*భిన్న జాతిమతములకు జెందిన వారి నాహ్వానించి ఆవిందును బాపయ్యగారు జరిపించిరి.

విందును ఏర్పాటుచేయుటకు నుత్సాహముతో ప్రయత్నించితిని. సాయంకాలము నవశక్తినిగురించి పాలుగా రుపన్యాసము గావించిరి. (ఉపన్యాససారాంశము ఇచట కలదు.) ఈ ప్రసంగము నాయందు నూతనోత్తేజము కలిగించినది. ఈ యవకాశము లభించినందులకు సర్వేశ్వరునకు ధన్యవాదము లర్పించుచున్నాను. రాజకీయస్వాతంత్ర్యముకొరకు త్యాగముచేయుట యన నేమియో నా కిప్పుడు అర్థమగుచున్నది. ఎంతత్యాగముతోడనయినను వ్యక్తిస్వాతంత్ర్యము కాపాడబడవలెను. బ్రాహ్మసమాజ మీయాదర్శమున కెక్కువప్రాముఖ్యత నొసంగినది. స్వరాజ్యాదర్శము సాధింపబడవలసియున్నది. ప్రాచీనకాలమందువలె ఒక్కధ్యానమువలన మాత్రమె గాక, వ్యక్తినుండి కుటుంబముద్వారా, సంఘముద్వారా, రాజ్యాంగముద్వారా బహిర్గతమగు జీవితమువలన కూడ మానవులు పరమాత్మను సమీపింపగలరు. స్వాతంత్ర్యము, సజీవదేశభక్తి, జాతీయత యీ నవశక్తియొక్క లక్షణములు."

"స్వరాజ్యమునుగురించి పాలుగారు (౨౦-౮-౧౯౦౭ తేదిన) ప్రసంగము గావించిరి. బ్రిటన్‌యొక్క యధికారమునకు లోబడిన స్వరాజ్యము అర్థములేని యరపు అని వారు నిరూపించిరి. మన స్వరాజ్యమె మనకు స్వయముగ పన్నులు

వేసికొనుటకు, స్వయముగ పరిపాలించుకొనుటకు, స్వయముగ శాసనములు నిర్మించుకొనుటకు, మన దేశములోనికి విదేశీయులను రానిచ్చుటకుగాని రానీయకుండుటకుగాని స్వాతంత్ర్యము కలిగియుండుటకు అవకాశ మొసంగును. ఇది స్వరాజ్యముయొక్క యున్నతాదర్శము; నిజమయిన దేశ పుత్రులందరకు తృప్తికరముగ నుండకమానదు.''

(౨౩-౪-౧౯౦౭ తేదిన) సాయంకాలము పాలుగారు జాతీయవిద్యనుగూర్చి తమ కడపటియుపన్యాస మొసంగిరి. జాతియొక్క పరమావధిని సాధించుటకు ప్రయత్నించునప్పుడుమాత్రమె విద్యావిధానము జాతీయ మయినదని పిలువబడ వచ్చును. వారు మిక్కిలి యుత్సాహముతో ప్రసంగించిరి. (జాతీయపాఠశాలకొరకు) వచ్చిన విరాళములు ప్రకటించిరి. ................ఈ జాతీయపాఠశాలను ఈశ్వరు డాశీర్వదించునుగాక! అది రూపము దాల్చునట్లు చేయబడి భక్త్యుత్సాహములతో నడపబడునుగాక!''

"పాలుగారు పురికొల్పిన యుత్సాహము యువకుల యొక్కయమాయకచిత్తములను వశపరచుకొనెను. హరిసర్వోత్తమరావు కాలేజినుండి ౨౪ వ తేదిన వెళ్ళిపొమ్మని యాజ్ఞాపింపబడెను. ఆయనకు డిస్‌మిసల్ ఉత్తరు వీయబడెను. హనుమంతరావును సాంబశివరావును వందేమాతరము బాడ్జీ

లను తీయుట కటులనె నిరాకరించినందులకు వెంటనె డిస్మిస్ చేయబడిరి. ఈయువకులు ధర్మమార్గమున నడువగలందులకు పరమేశ్వరుడు వారికి ధైర్యస్వభావమును సరియయిన దృష్టిని అనుగ్రహించును గాక!"

"హైందవజాతియొక్క మహావీరుడు లాలాలజపత్రాయి అరెస్టుచేయబడి అండమాను దీవులకు పంపబడనున్నాడని మెయిలు పత్రికయందు (౧౧-౫-౧౯౦౭ తేదిన) చదివినాను. ఓసర్వకారుణికుడవయిన దేవా! విదేశీయుల నిరంకుశపాలనమునుండి విముక్తిని బడయుటకు ఈదేశవాసులు సలుపు పోరాటము జయించునట్లు నీ ప్రేమాతిశయముచేత నీవు వారికి తోడ్పడుము. దేశమునకు వాటిల్లెడు సర్వవిపత్తులను తొలగింపుము. ధర్మమార్గమున నీబిడ్డలను నీవు నడపుకొనుము. తండ్రీ! మమ్మాశీర్వదించి పిరికితనమువలన వచ్చు అపాయమునుండి మమ్ము రక్షింపుము."

"అరెస్టుకాబడినతరువాత లజపత్రాయి ఒకమిత్రునికిట్లు వ్రాసెను:—'నావిషయమై ఆదుర్దపడ వద్దు. ఈశ్వరుడేమి చేసిన, అది మంచికొరకే చేయును.' మహాశోధన సమయమున ఆమాటలు చెప్పగలిగిన యాయనకు స్థిరకీర్తి కలుగు గాక! ఈశ్వరు డాయనను ఆశీర్వదించు గాక! లజపత్రాయికి ధర్మోత్సాహము కలిగించినట్టి దేశాభిమానము

నిజమయిన భారతీయులందరకు ఆయన ప్రసాదించును గాక!"

రాజకీయ స్వాతంత్ర్యమునకై బాపయ్యగారి హృదయము తపించి పోవుచుండినటుల ఆయన వ్రాతలవలననె వెల్లడి యగుచున్నది. మతసాంఘిక విషయములందువలెనె ఆయన రాజకీయ విషయములందును స్వాతంత్ర్యప్రియుడై యుండెను. కొందరు మతసాంఘికదాస్యము విడిచినను రాజకీయదాస్యమును సలుపుచుందురు; అటులనె మరికొందరు రాజకీయదాస్యమునుండి తమయాత్మలను స్వతంత్రముగనుంచుకొన గలిగినను మతసాంఘికవిషయములందు దాసానుదాసులై యుందురు. ఈ యిరు తెగలవారు జీవితములో నొకభాగమును మాత్రమె పెంపొందించుకొను వారు. వారిది సర్వతోముఖమయిన యభివృద్ధి గాక పాక్షికోన్నతి. శరీరమునకు నిజమయిన బలము కలిగిన, ఆ బలమువలన శరీరమందలి సర్వావయవములు పుష్టివంతము లయి దృఢముగా నుండును. ఒక కాలు లావుగా నుండి ఒక కాలు సన్నగా నున్నప్పుడు, శరీరమందు బలముగాక వ్యాధి కలదని నిశ్చయింతుము. స్వాతంత్ర్యమనునది ఆత్మకు సంబంధించిన యొక స్వభావము. ఆత్మ నిజమయిన స్వాతంత్ర్యమును పొందెనేని జీవితముయొక్క శాఖలన్నిటియందు స్వతంత్రముగనె చరించును. కొన్ని విషయములలో కనబడి, కొన్ని విషయములలో కనబడని స్వాతంత్ర్యము

సరియయినది గాదు. దానియందే దోషముండును. దాని వలన వికృతజీవితము లేర్పడును. స్వాతంత్ర్యము జీవితము నందు సర్వముఖముల వ్యక్తమగునప్పుడే జీవితము సంపూర్ణ వికాసము గాంచి సుందరముగ నుండును. బాపయ్యగారి జీవిత సౌందర్యమునకు హేతువు వారిజీవితము సర్వతోముఖవికాసము గాంచుటె. స్వదేశవస్త్రములనె ధరించుచు, స్వరాజ్యోద్యమమున పాల్గొనుచు, సర్వమానవులయెడ సౌభ్రాత్రమును కనపరచుచు, సమస్తసత్కార్యములందు పాటుపడ నుద్యుక్తుడగుచు బాపయ్యగారు సమగ్రజీవనమును వృద్ధి నొందించుటచే, ఆయన పరిచయములోనికి వచ్చిన సంఘసంస్కర్తలుగాని రాజ్యాంగసంస్కర్తలుగాని యెల్లరు ఆయనను అమితముగ ప్రేమించిరి. రాజా రామమోహనరాయి స్వతంత్ర జీవనము యొక్క స్వరూపమును భారతవర్షమున మొదట ప్రదర్శించి నవయుగపితామహు డని కీర్తిగాంచెను. రామమోహనుని యడుగుజాడలనె నడచి ఆ మహాపురుషునివలె సర్వతోముఖసంస్కరణము కొరకు బాపయ్యగారు జీవితమును ధారపోసిరి. ఆయన తన తండ్రిగారి శ్రాద్ధసందర్భముగా జరపించిన కాస్మాపాలిటన్ డిన్నరువలన గోదావరినది నిప్పంటుకొని మండిపోయె నని ఆదినములలో చెప్పుకొనబడెను. స్వాములవారు ఆయనకు శ్రీముఖము నంపిరి. సంఘము ఆయనను

బహిష్కరించెను. బంధువు లాయనను దూరముచేసిరి. ఆయనకు సాయపడగల మిత్రులు లేకపోయిరి. వంటకు మనుష్యుడు, బ్రాహ్మణుడే కాదు, బ్రాహ్మణేతరుడయినను దొరకక, జబ్బు వచ్చినప్పుడు సరియయిన యుపచారము జరుగక, నిరుపేదకువలె ఆస్పత్రులె ఆయనకు శరణ్యములుకాగ జీవిత మెట్టికష్టములకు లోనుగావలసివచ్చినను ఏమాత్రము జంకక ప్రాణముపోవువరకు ధర్మసమరము సలిపిన మహాయోధులు బాపయ్యగారు. ౨౬-౮-౧౯౦౬ తేదిన ఆయన యీవిధముగ దినచర్యపుస్తకమందు వ్రాసికొనెను:— "ఉద్యోగసంబంధమయిన పనిమీద మా మామగారు ఇక్కడికి రాగా, వారిని కలసికొంటిని. నా దేహస్థితినిగురించి కొంత యుదాసీనముగ వారు మాటాడిరి. నేను తీసికొనుచున్న జాగ్రత్త వారికి తృప్తికరముగ లేదు. నచ్చచెప్పుటకు నేను ప్రయత్నింపగా, మనస్సునకు కష్టము కలిగి వారు నిరుత్సాహము జెందిరి. సర్వకారుణికుడైన పరమేశ్వరుడు వారికి మనోశాంతిని ప్రసాదించును గాక! ఆయనను వారి పుత్రికను నావిషయమై ఆదుర్దపడు వారందరిని ఆశీర్వదించును గాక! ఓ తండ్రీ! సర్వ విషయములందు నీయాజ్ఞను శిరసావహించుటకు నేర్పుము. నా బుద్ధియొక్కయు, నైతికజీవనముయొక్కయు, ఆత్మయొక్కయు, శరీరముయొక్కయు, వృద్ధివికాసములకు నేది చేయు

ట యుచితమో దానినె చేయుటకు అపారవాత్సల్యముతో నీవు నాకు శక్తి నొసంగుము. తండ్రీ, స్వవినాశమునకు దారి దీయునది యని యితరులు తలంచు పద్ధతినుండి నన్ను దూరమునుగ నుంచుము; తప్పుతోవను పోకుండ కాపాడుము'' బాపయ్యగారు తమ ధైర్యస్థైర్యములను, పరమేశ్వరునియందు సంపూర్ణ విశ్వాసము గలిగి త్రికరణశుద్ధితో ఆయనను ప్రార్థించుటమూలమున, బడయగలిగె నని సువిదితము. ఈశ్వరప్రార్థన బాపయ్యగారి జీవితమును సార్థకము జేసినది. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు బాపయ్యగారికి 'A sincere theist' యథార్థ ఈశ్వరవిశ్వాసి యను బిరుదును ఇచ్చి ఆయన సమాధిపై ఆయననామముక్రింద దానిని చెక్కించుట యెంతయు సమంజసముగా నున్నదని పాఠకు లేకగ్రీవముగా నంగీకరింపకుందురా?

---

# జీవనస్మృతి

## ౧౧ వ ప్రకరణము

### వివాహము

బాపయ్యగారు చెన్నపురిలో బి. ఏ సీనియరు చదువు చుండగా, డిప్యూటికలెక్టరుద్యోగము చేసి ప్రస్తుతము విశ్రాంతి గైకొని రాజమహేంద్రవరములో నివసించుచున్న దావులూరి ఉమామహేశ్వరరావుగారు తమ ద్వితీయపుత్రిక శ్రీమతి అలివేలు మంగతాయమ్మగారిని ఆయనకు ఇచ్చి కాకినాడలో ౧౯౦౨ సంవత్సరమున వివాహము జరిపిరి. మంగతాయమ్మగారికి వివాహము నాటికి సుమారు పది సంవత్సరము లుండును. బాపయ్యగారామెను ఆవయసున వివాహమాడుట కెట్టిసంకోచము కనపరుప లేదు. ఆమెను స్వయముగా చూచి తృప్తిపడి పరిణయమున కాయన యంగీకార మొసంగెను. బి. ఏ సీనియరు చదువుకొనుచు ఆయన బాల్యవివాహమున కెట్లు సమ్మతించెనని పాఠకులకు కొంతసంశయము కలుగవచ్చును. వివాహసమయమునకు ఆయనవయసు ౨౦ సంవత్సరములు. హిందూసంఘమున

వివాహసంబంధమయిన ఆలోచనయు ప్రయత్నమును పెద్దల లోనె బయలుదేరి వివాహమన నేమొ యెరుఁగని పసివాండ్ర నందునకు ప్రేరేపించుచుండును గదా! ఆడుపిల్లలు గల తండ్రులు తమ పుత్రికలకు తగినవరులను సంపాదించుటకు విద్యార్థులను గావించుటయు నెల్ల రెరింగిన విషయమె. ఉమామహేశ్వరరావుగారి దృష్టిలో బాపయ్యగారు పడిరి. వారి కుమార్తెను వివాహము చేసికొనవలసినదని ఆయనకు మిత్రులు సలహా చెప్పిరి. ఆయనతల్లి, పినతండ్రి మొదలయినవారు కూడ, కళాశాలవిద్య పూర్తి యగుచుండుటను బట్టి త్వరలోనె ఆయనకు పెండ్లిచేయ సమకట్టిరి. వివాహాలోచన ఆయనమీదికి త్రోసికొనివచ్చెను. చెన్నపురికి వెళ్లు వరకు ఆయన శుద్ధశ్రోత్రియుఁడై యుండి అక్కడికివెళ్ళినప్పటి నుండియె మెల్లమెల్లగా మార్పు జెంద నారంభించె నని యిది వరకె తెలుపబడినది. ఆయన ఆతరుణమున వివాహాలోచన విధిగ చేయవలసివచ్చెను. బాల్యవివాహము నిరాకరింపదగిన దని నిశ్చితాభిప్రాయము కలిగియుండుటకు గాని, దానికి లోనుగాకుండుటకు దృఢసంకల్పుఁడగుటకు గాని, ఆయనకు తగిన సావకాశము లేకపోయెను. ఎటు లయిననేమి, ఆయన బాల్యవివాహబంధమున తగుల్కొనెను. కట్నములు పుచ్చుకొన గూడదన్నియు, భోగముమేళములు చూడఁగూడదని

యు సంస్కరణభావములు కొన్ని అప్పటి కాయనహృదయ
మున పాదుకొన్నియుండెను. పెండ్లిలో అలకరోజున 'నీకేమి
కావలె' నని మామగా రాయన నడుగగా, మీ యాశీర్వచ
నము తప్ప నాకింకేమియు నక్కరలేదని ఆయన బదులు
చెప్పెను. మామగా రప్పుడు తమకు తాముగా నొక గడి
యారమును బహుమానముగ నిచ్చిరి. సంతోషముగా గడచి
పోవలసిన వివాహదినములు, సాధారణముగ ప్రస్తుతపద్ధతుల
ప్రకారము వేళలకు నిద్రాహారములు లేకయు, విశ్రాంతిగ
కొంచెము సేపు కూడ నొకచో కూర్చుండుటకు అవకాశము
లేకయు, వివాహము జరపించువారును అందునకు వచ్చువా
రును ఎల్లరు క్షోభపడునంతగా, గందరగోళముతో కూడి
యుండును గదా! దానికి తోడు కట్నపుపేచీలు తరచు కలహ
ములకు కారణము లగుచు, సంతోషమునకు బదులు మన
స్తాపమెఆరోజులలో మిక్కుటముగా నుండుట నెరిగిన బాపయ్య
గారు తమ స్వభావమునుబట్టియె యట్టికష్టము కలిగింప
జాలరు. భోగముమేళము లాయనకు గిట్టవని యెరింగి పెండ్లి
లో పెద్దవారె వానిని పెట్టింపలేదు. మామగారు తగినసం
బంధము దొరకినదని సంతోషించుచుండ, వేడుకలయందు
పాల్గొనుచు బంధువులంద రానందించుచుండ, బాపయ్య
గారి వివాహ మతివైభవముతో జరగెను.

వివాహమునాటికె బాపయ్యగారి యభిప్రాయము లందు కొంతమార్పు కలిగెను. ఆమార్పు క్రిమక్రమముగా పెరిగిపోయెను. నమ్మినట్లు నడచుకొను స్వభావము కలవాఁడగుటచే, ఆయనవర్తనములో గూడ సవి కాస్పింప నారంభించెను. ఆయన పరివర్తనమును వేగిరపెట్టిన ఘటనలు రెండు ముఖ్యముగ గలవు. ఆయన తనచెల్లెలు అన్నపూర్ణమ్మను విశేషముగ ప్రేమించెడువాడు. అబలా సచ్చరిత్రరత్నమాల మొదలయిన యుత్తమగ్రంథములు ఆమెచేత చదివించుచు, ఆంగ్లభాషయందు గూడ నామెకు ప్రవేశము కలిగించుచు, ఆమె విద్యవిషయములో నెంతయొ శ్రద్ధ వహించెను. ఆమెకు కావలసినవస్తువులు చెన్నపట్టము నుండి తెచ్చియిచ్చుచు నామెయెడ నమితానురాగముతో మెలగుచుండెను. ఆమెను అత్తవారింటికి పంపవలసివచ్చి నప్పుడు, ఆయనమనస్సు ఎంతో కష్టపడెను. ఆమె పెట్టెను తానె సర్ది ఆమె తన కుత్తరములు వ్రాయుటకు తనవిలాస ము గల కవరులుకొన్ని యందు పెట్టి ఆమెను స్వయముగ తీసికొని వెళ్ళి రాజమహేంద్రవరములో నత్తవారియింట దిగవిడిచెను. మరికొద్ది రోజులతరువాత అచటికి తిరిగివెళ్ళి తనచెల్లెలిని తనతో పంపుడని కన్నుల నీరు గ్రుక్కుకొనుచు ఆమెయత్తగారిని దీనముగ నడిగెను. అప్పుడత్తగారు పక

పక నవ్వుచు ‘ఇదేమి బాపయ్యా! నిన్న గాక మొన్న దిగవిడిచి వెళ్ళావు. ఇవాళ వచ్చి తీసుకొని పోతా నంటావు. పిచ్చివాడవుగా ఉన్నావు. మీచెల్లెలు విషయంలో నీవేమీ బెంగపెట్టుకోకు. కొన్నిరోజులు పోయినతరువాత పంపుతాములే.’ అని ఆయన నోదార్చి పంపెను. చెల్లెలియం దంత వాత్సల్యముతో ఆయన చరించుచుండగా, ఆమె యటుపిమ్మట గర్భవతి యగుటయు, ఆమెశిశువును ప్రసవించిన కొలది మాసములలో అకాలమృత్యువాత బడుటయు తటస్థించెను. ఆమెయంత్యదినములలో నుపచారములు చేయుచు ఆయన ఆమెవద్దనె యుండెను. ఆమె ప్రాణము విడచుట కన్నులార గాంచెను. భరింపరాని దుఃఖసాగరమున మునిగెను. ఇది ౧౯౦౩ సంవత్సరములో సంభవించెను. ౧౯౦౪ వ సంవత్సరాంతమున ఆయనయె తీవ్రవ్యాధిపీడితుడయిన సంగతి యిదివరలో నొకసందర్భమున వ్రాయబడి యుండుటను చదువరులు జ్ఞాపక ముంచుకొని యుందురు. ఆ వ్యాధివలన ఆయన మృత్యుగహ్వరమున ప్రవేశించినను, ఈశ్వరానుగ్రహముచే అప్పటి కా మరణాపాయము తొలగెను. తన చెల్లెలి యకాలమరణమును, తన భయంకరజాడ్యమును- ఈ రెండు ఘటనలు-ప్రాపంచికజీవితము అశాశ్వతమని ఆయన కన్నులకు కట్టినట్లు స్పష్టపరచినవి. ఐహికజీవితము అస్థిర

మని వ్యక్తపడినకొలది ధర్మజీవనమునం దాసక్తియు దృఢతయు హెచ్చును. తనయాత్మయం దంకురించిన శాశ్వతసత్యములు అశాశ్వతమయిన ప్రపంచసంబంధమయిన యాలోచనలతో నణచివేయబడుట కేవలము ఈశ్వరద్రోహ మని ఆయన గ్రహింపగలిగెను. తన కారోగ్యము కలిగి తిరిగి శరీరశక్తి చేకూరుచు రాగా, ఆయన వివిధములయిన సంస్కరణకార్యములందు ప్రవేశించి అంతరాత్మ ప్రేరేపించినటుల ప్రవర్తించుచు ధర్మసమరమున ధీరుడై నిలచెను.

చిన్నదీపము ఒక యింటివారు తమ యింటిలోనె యుంచుకొని తామె యుపయోగించుకొనవచ్చును. సూర్యుడు ఆవిధముగా ఒక గృహములోనివారు మాత్రమె యుపయోగపరచుకొనుటకు వశుడుగాక జగత్తున కంతకు నుపయోగపడును. విసనకర్ర ప్రతిమనుజుడు చేతిలో పట్టుకొని తనకొరకె వాడుకొనవచ్చును. వాయువు అట్లు ఏయొక్కరి సుఖముకొరకును బంధింపబడుటకు సాధ్యమగునది గాక విశ్వమున కంతకును సౌఖ్య మొనగూర్చును. ఎవరి దొడ్డిలో వారు బావి త్రవ్వుకొని అందలి నీరు వారు మాత్రమె యనుభవింపవచ్చును. మహానది యేకొందరికో గాక సర్వమానవులకు జలమును ప్రసాదించును. సామాన్యమానవులు స్వల్పశక్తులు గలవారు; ఒక్క కుటుంబముకొరకు వినియోగపడి

ఆ కుటుంబసేవతోనె వారి జీవితములు చరితార్థత నొందును. 'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అను నార్యోక్తిచొప్పున విశాలహృదయులును విశేషశక్తిసంపన్నులును నగు మహాపురుషులకు పృథివియె కుటుంబము. ఆ మహనీయులు లోకసంగ్రహమునకు జీవింపవలసినవారు. వారిని ఏ చిన్నకుటుంబముకొరకో జీవించునట్లు చేయుట యసాధ్యము. అల్పప్రయోజనములను, సామాన్యగృహజీవనములను లక్ష్యములుగా గల జనులు ఆ యుత్తమపురుషుల చర్యలనర్థముచేసికొనజాలరు; ఆ వీరపురుషులను వెర్రివారినిగా పరిగణింతురు; ఆ ధర్మశూరులను అధర్మమున కొడిగట్టినవారినిగా తలపోయుదురు. ఆ యీశ్వరభక్తులను ప్రేమశూన్యులనుగా భావింతురు. ఇది యంతయు లోకమున ప్రతిధర్మవీరుని విషయమున జరగుచువచ్చిన గాథయె. బాపయ్యగారుదారచరితులై కుటుంబావరణమును దాటి ప్రపంచముకొరకు పాటుపడుచు ధర్మసంస్థాపనమునకై జీవితమును ధారపోయునప్పుడు, ఆయనకూడ నితరపుణ్యపురుషులవలె బంధువులచేతను సామాన్యజనులచేతను నిరసింపబడెను. సాధారణకుటుంబజీవనము ఆయనపరమావధి కానప్పుడును, అధర్మముతోడను అసత్యముతోడను రాజీచేసికొనుచు ప్రాపంచికసౌఖ్యమును భద్రపరచుకొను లౌకికజీవనము ఆయన

యాదర్శము కానప్పుడును, ఆయన ఒక్క కుటుంబమునకు మాత్రమె, కొలది వ్యక్తులకొరకె యెట్లు పాటుపడగలడు? అట్లుపయోగపడక పోవుటయె ఆయనయందలి దోషము.

మరియు వీరపురుషుల చరిత్రలు గొప్ప తుపానులవలె, భూకంపములవలె కొంతనష్టమునకును వినాశనమునకును హేతుభూతము లగును. కాని వాతావరణమున సమస్థితి యేర్పడుటకె తుపానులును, భూగోళము చక్కనిరూపు దాల్చుటకె భూకంపములును సంభవించును. కొన్ని ప్రాంతములందు అనివార్యముగ కొంతనష్టము కలిగినను వానిమూలమున మొత్తము మీద మేలే చేకూరును. అటులనె మహాపురుషుల జీవితముల వలన మొత్తముమీద లోకశ్రేయము సమకూరుచున్నను కొందరికి నష్టము వాటిల్లుట కలదు. బాపయ్యగారు ధర్మజీవనము గడపుటచే, ఆయన బంధువులకు ముఖ్యముగా పిన్నవయస్కురాలయిన ఆయన భార్యకు తీరని కష్టము సంఘటిల్లినది. తానిట్టి బాధ కలిగింపవలసివచ్చినందులకు ఆయనయు నపరిమితమనోవ్యథ జెందువాడు. కాని ధర్మముకొరకు దానినంతయు సహించుకొనెను. తన భార్య నిమిత్త మాయన పడిన పరితాపమును గురించిన విచారకరమగు సమాచారము కొంత ఆయన దినచర్యపుస్తకమువలన తెలియగలదు.

ఆమె చదువువిషయములో ఆయన మొదట నాదుర్ద

పడజొచ్చెను. వివాహమయినప్పటినుండి చనువుగ ఆమెతో మాటాడుచు చదువుకొనుట కామెను హెచ్చరించుచుండెను. పట్టుపట్టి ఆమెన్ను ప్రైమరీపరీక్ష ప్యాసుచేయించెను. ఉన్నత విద్య కూడ నామెకు నేర్పింపవలయునని ఆయన యమిత ముగ వాంఛించెను. కాని పరిస్థితులు ప్రతికూలములాయెను. ధర్మాచరణమువలన, ఆయన సంఘమునుండి బహిష్కరింప బడెను. బంధువులందరితో పాటు మామగారును ఆయనను దూరముచేసిరి. ఆయన తన భార్యయొక్క విద్యాభివృద్ధికొరకు చెప్పదలచిన మాటలాసందర్భములో వినువారెవ రుందురు? అప్పుడాయన తన మామగారికి ఈ క్రిందపొందుపరుపబడిన పెద్దయుత్తరమును వ్రాసిపంపెను.

మిక్కిలి రహస్యముగా నుంచవలసినది.

ఇన్నిసుపేట.

౨౫—౧—౧౯౦౭

బ్రహ్మకృపాహి కేవలమ్.

నా ప్రియమయిన మామగారికి

నే నీక్రింది పంక్తులను హృదయపూర్వకముగ వ్రాయుచున్నాను. నే నెట్టి ప్రేమభావముతో నవి వ్రాయుచున్నానో యట్టి భావముతోడనె మీ రవి గ్రహింపవలెననియు, అందు

ప్రస్తావింపబడిన విషయములో మీరు ఆతురతను శ్రద్ధను చూపవలె ననియు వేడుచున్నాను. మామయు అల్లుడును నయి మనము వెనుక ప్రేమపూర్వకముగ కలిగియున్న చనువుతో నే నిప్పుడు మిమ్ము సమీపింప గూడదని యట్లు స్ఫురించు మాటలలోనె గాక స్పష్టముగా కూడ నాకు తెలిపి మీరే నన్ను మీదరికి రాకుండ చేసియుండుట నిజముగాం నత్యంత శోచనీయము. మనఃపూర్వకముగను త్రికరణశుద్ధితోడను తీవ్రముగ నమ్మిన సత్యమునందలి దృఢవిశ్వాసముచే పురిగొల్పబడి నేను ధైర్యముతో నడచుకొనుటయె మీరు నన్నంత యనాదరణముతో చూచుటకు కారణమై యుండును. ఇరువదియవ శతాబ్దప్రారంభమున సహితము హిందూదేశవిద్యాధికులు ప్రచలితాభిప్రాయములచేతను సాధారణవిద్వేషముల చేతను బంధింపబడుటయెగాక నిర్దోషి యయి పూర్తిగ సద్వర్తను డయియున్న యొకవ్యక్తి హృదయపూర్వకముగ కలిగియుండు అభిప్రాయభేదమును సహించుకొన లేకపోవుటయు మిక్కిలి దురదృష్టము. మీరును మీయింటిలోనివారును నాయెడల కనపరచిన యనాదరణము నామనస్సులో జనింపజేసిన హృదయభేదకములయినయాలోచనలను తలంపులను నేనిప్పుడు తెలుపుట యనావశ్యకము. ఏది యెట్లు జరిగినను, పరమేశ్వరుడు పాపాత్మునిగూడ ప్రేమించి యాశీర్వదించెను. యావత్తు

శోధనను, బాధలను సహించుకొనగల శక్తిని హెచ్చరికను ఆయన నా కనుగ్రహించెను.

మీ కుమార్తె ప్రియమయిన అలివేలు చదువునకు సంబంధించినదే నేను వ్రాయదలచిన ప్రస్తుతవిషయము. మంచికో, చెడుగునకో, మా జీవితము లేకముచేయబడినవి. పవిత్రమయిన వివాహబంధమును ఛేదించుటకు తీవ్రమయిన యోచనలు మీయింటిలో జరుగుచున్నట్లు నాకు వినికిడి వలన తెలియుచున్నను, నిరంతరవిశ్వాసముతోడను అకుంఠిత నిరీక్షణముతోడను సర్వశక్తునియొక్క యుత్తమపాలనమునకు సంపూర్ణముగ సమర్పింపబడిన యంతరాత్మతోడను నేను మిమ్ము సమీపించి, ప్రియమయిన అలివేలు చదువేమాత్రము చెడిపోకుండ జాగ్రత్తను శ్రద్ధను తీసికొనుడని ప్రార్థించుచున్నాను. పూర్వాచారపరుల యభిప్రాయమును బట్టి చూచినను, ఆమె యింకను పాఠశాలకుపోవువయస్సుననె యున్నది. కావున పాఠశాలలో చెప్పబడు కొంచెము చదువు కూడ నేర్చుటకు ఆమె కవకాశ మీయకుండ నింటిలో కట్టుపెట్టుట యవివేకము. కనుక ఊరిలోనున్న గవర్నమెంటు లోవరు సెకండరీ గరల్సు స్కూలుకు సాధ్యమయినంత త్వరలో మీ రామెను పంపవలయు నని నా మనవి. ఇంటిలో ఆమెను చదువునట్లు చేయదలంచుట వృథా. అదియెంతె యసాధ్యమొ

నాకు బాగుగ తెలియును; మీరును పూర్తిగ తెలిసి కొనియుందురు. పైని చెప్పబడిన పాఠశాలలో గరపబడు విద్య అతిసామాన్యమయినది. ఇంగ్లీషు అక్కడ నేర్పబడదు. కాని మీ సంకుచితాభిప్రాయములను బట్టి, గుడ్డులో మెల్ల యను సామెతను మనసునం దుంచుకొని, నే నాస్కూలును పేర్కొంటిని. అట్లు కాక, ఈయూరిలో సాధ్యమయినంత యున్నతమును శ్రేష్ఠమును అయిన విద్యను ప్రియమయిన అలివేలుకు చెప్పించుటకు మీ రిష్టపడి అందునకు సిద్ధముగా నుండి యున్నయెడల, ఇంగ్లీషుకూడ నేర్పబడు వీరేశలింగముగారి స్కూలుకు ఆమెను పంపుడని మిమ్ము నిజముగా కోరియే యుందును. ఈ స్కూలులో మతమునకు సంబంధింపని విద్యయె బాలికలందరకు నొసంగబడు నని జ్ఞప్తియం దుంచుకొన గోరెదను. మర్యాదగల పూర్వాచారపరుల కుటుంబములకు జెందినట్టియు వయసు వచ్చినట్టియు బాలికలు కొందరందులో గలరు. కాన సంస్కర్తచే స్థాపింపబడిన సంస్థకు మీ యమ్మాయిని పంపుటకు మీరు భయపడవలసిన పని లేదు. అట్టి వాని ద్రవ్యముతో పోషింపబడుచున్నను, నాకు తెలిసినంతవరకు అది కేవలము నిరపాయకరమయినట్టియు, మనసున కెట్టి కష్టమును కలిగింపనట్టియు పద్ధతిని నడపబడుచున్నది. మిక్కిలి ఛాందసుడైన యెట్టి హిందూపూర్వా

చారపరునియొక్క హృదయమును చిన్న విషయములలో సహితము నొప్పింపకుండుటకు తగిన జాగ్రత్త తీసికొనబడును. ప్రియమయిన అలివేలుచదువు విషయములో నే నింతగా నేల వ్రాయవలసి వచ్చెనని మీరు నన్ను అడుగవచ్చును. ఒక యసామాన్యమయిన జీవనపరిస్థితులలో మీ రామె నుంచినారని నేను చెప్పనక్కరలేకయె మీకె బాగుగ తెలి యును. నాకు వినవచ్చునట్లు వ్యాపనములగుచున్న విచారి కరవదంతులలో నేమాత్రము నిజమున్నను లేకపోయినను, ఆమెకు తన జ్ఞానశక్తిని వృద్ధి నొందించుకొనుటకు సంపూర్ణ అవకాశ మీయబడుటయె మిక్కిలి వాంఛనీయము. కొంత కాల మయిన తరువాత, నైతికపారమార్థిక విషయములను స్వయముగ నితరులసహాయము లేకుండ విచారించుకొన వలసిన యసహాయస్థితిలో విశాలప్రపంచమందు ప్రవేశపెట్ట బడినప్పుడు, సరియయిన శిక్షణమును, ఉపయుక్తమయిన విద్యయు తప్ప నింకేదియు నామెకు తోడ్పడజాలదు. చదువు నేర్వగలిగిన పిన్నవయస్సుననె ఆమె యింకను ఉండుట వలన, నిజముగాను త్రికరణశుద్ధిగాను ఆమెబాధ్యత వహించిన వారందరియొక్క పరమ కర్తవ్యము, ఈశ్వరు డామెకు ప్రసా దించిన శక్తులు నిరుపయోగము లయి వ్యర్థము గాకుండ జేయుటయే.

ప్రస్తుతము మనకు దురదృష్టవశమున నేర్పడి విరసములును విచారకరములును నయియున్న సంబంధములను మనస్సులో నుంచుకొని, నే నింతవరకు స్వల్పములును సులభములును అయిన మార్గములను మాత్రమె మీకు సూచించియుంటిని. జరిగిన సంగతులను చూడకుండ కళ్లు మూసికొని విషయవిచారణ చేయుటవలన లాభము లేదు. ఆమె చదువును ఇంటివద్ద నేను చక్కగా విచారించుటకు వీలుండిన యెడల, అదియె యుత్తమమయిన యేర్పాటని, నేను నిశ్చయముగా చెప్పగలిగినను, నే నది మీకు తెలుపజాలను.

దీర్ఘముగ వ్రాసి మీకు చాల విసుగు పుట్టించుచున్నా నని భయముగా నున్నది. కాని హృదయము నిండుగా నున్నప్పుడు, నోటినుండి మాటలు వెడలును. మాటాడుటకు అవకాశ మీయబడనందున నా భావములను వ్రాతలో పెట్టుటకు ప్రయత్నించితిని. అదియు నసంపూర్తిగనె జరిగెనని దృఢముగ చెప్పగలను.

ఓపికతోను, శ్రద్ధతోను, దురభిప్రాయములకు చోటివ్వని నిష్పాక్షికబుద్ధితోను, మీ రీయుత్తరము చదువవలెననియు, వీలునుబట్టి మీ రేవిధముగా ఈవిషయమును తుదకు పరిష్కరించినను ఆ తీర్మానమును నాకు తెలుపవలెననియు, నా కడపటి ప్రార్థన. నేను ఉన్నది ఉన్నట్లు స్పష్ట

ముగ వ్రాసితిని. ఎట్టి కృత్రిమము నాయందు లేదు. నిర్భాగ్యుడును, నిర్దోషియు, బహిష్కృతుడును, దుఃఖభాజనుడును, కనికరమునకు పాత్రుడును అయిన మీ యల్లునియెడల మీరును అటులనె వర్తింపవలె నని విన్నవించుచున్నాను.

సర్వేశ్వరుడే యీయుత్తరమును ముద్రాంకితము చేసి భద్రపరచును గాక!!!

దే. పె. బాపయ్య.

తనభార్యయొక్క విద్యావిషయమున బాపయ్యగారెంత తీవ్రమనోవేదన జెందిరో యీలేఖ తెలుపుదానికంటె వేరుగ వ్రాయవలసినది యేమియు లేదు.

మంగతాయమ్మగారు రజస్వల యయినతరువాత పునస్సంధానవిషయములో బయలుదేరిన యాలోచనలు కూడ బాపయ్యగారిని చాల కలతపరచెను. ౨౫-౧-౧౯౦౭ తేదిన ఆయన యిట్లు వ్రాసికొనెను:— "బ్రాహ్మసమాజ వార్షికోత్సవమునకయి బాపట్లకు వచ్చితిని......మాఅమ్మ నన్ను దయతో ఆహ్వానించెను. పరాత్పరు డామెకు నాయెడల సర్వదా అట్టిసద్భావ ముండున ట్లనుగ్రహించునుగాక! మధ్యాహ్నము ౧ గంటకు అమలాపురమునుండి పాప (మంగతాయమ్మగారు) రజస్వల యయినదని టెలిగ్రాము వచ్చినది. ఈవార్త వినునట్లు చేసినందులకు పరమేశ్వరునకు వందన

ములు. ఆమె బాధ్యత వహించినవారు శరీరముయొక్క పూర్ణవృద్ధిని సూచించు చిహ్నమె రజస్వలియగుట యని తలంపకుందురు గాక! పదునారు సంవత్సరములు వచ్చువరకు మంచిశిక్షణమున తమ కుమార్తెను పెంచి ఆమెయొక్క నిజమయిన క్షేమము నారయుటకు పరమేశ్వరుడు మా మామగారికి సద్బుద్ధిని గటాక్షించును గాక! ఈశ్వరుని యొక్క 'యథార్థ అనుచరుడనై' నిలచుటకు ఆయనయె నాకు శక్తిని ప్రసాదించును గాక!'' మరల కొలదికాలమునకు ఆయన బాపట్లకు వచ్చినప్పుడు ౨౧-౩-౧౯౦౭ తేదిన అచట జరిగిన సమాచార మీవిధమున వ్రాసికొనెను.—బాపట్లలో ఆగితిని. నా త్రోవనుండి నన్ను మరలించుటకు బంధువులందరు గుమిగూడిరి. నా భార్యను మాయింటికి తీసికొనిరావలె నను కారణముతో నొకత్రొత్తవాదన బయలుదేరెను. ఆమెకుఇంకను ౧౬ సంవత్సరములు రాలేదని నేను వాదించితిని. ఆవాదన వలన లాభము లేకపోయెను. జందెమును వర్ణభేదమును విడుచు నావశ్యకతలో నాకు గలవిశ్వాసమును నొక్కిచెప్పితిని. కాని వారు నా మాటలు వినిపించుకొనరు. ఈప్రలోభనము లేమైయుండును? ఎటువంటి కష్టములు కలిగినను ధర్మము నాచరించుటకు పరమేశ్వరుడు నాకు సద్బుద్ధిని సరియయిన యాలోచనను అనుగ్రహించును గాక! బాపట్లలో నివ

సించుట యున్నతాదర్శమున కేమాత్ర మనుకూలముగ లేదు. అక్కడే దృఢచిత్తుడు నిశ్చలుడై యుండిన నుండవ చ్చును గాని వృద్ధినొందుట కవకాశము లేదు.'' తనవైపు వారు ఎటువంటి ధోరణిలో నుండిరో అంతకు మించిన ధో రణిలో తన భార్యవైపువా రుండిరి. ఆయన తనభార్యను చూచుటకే యసాధ్యమై పోయెను. ఆమెను చూచి ఆమెకు తన యభిప్రాయములు ఎరుకపరుచుట తనవిధి యని ఆయ న తలంచెను. ఒకపర్యాయ మామెను చూచుటకు ఆయ న వారియింటికి వెళ్ళినప్పుడు 'తిరిగి సంఘమున చేరెదవా' యని ఆమెతల్లి ఆయనను ప్రశ్నించెను. ప్రాణము విడువ వలసివచ్చినను, ధర్మమును మాత్రము విడనాడ నని ఆయన బదులుచెప్పెను. అప్పుడాయనతనభార్యతో మాటాడుటకవకా శము కలుగలేదు. కాని రెండుమూడురోజులతరువాత౧౮౬౪- ౧౯౦౭ తేదిన ఆయన మురల వారియింటికి వెళ్ళినప్పుడు కొంత ప్రయత్నముమీాద సుమారు మూడుగంటలకాలము గడచిన పిమ్మట ఆయనకు ఆమెతో సించుక మాటాడుటకు వీలు కలిగెను. ఆమెతోడను, ఆమెవెంటనున్న ఆమెసోదరితోడను వారిచదువునుగూర్చి ఆయన ప్రస్తావించెను. ఆయన సంఘ మున చేరనందున ఆయనమాటలు వారికి రుచింపలేదు. ఆ సమయమునఆయన తనభార్యతో నొంటరిగకొలదినిమిషములు

మాత్రము గడపగలిగెను. పెద్దది యయినతరువాత ఆమె తనవద్దకు వచ్చునేమొ తెలిసికొనఁ గోరెను. అందు కామె 'తప్పుతుందా' యని జవాబు చెప్పెను. భర్త కావిధముగ నామె లోబడ నిచ్చగించుట ఆయనకు చాల బాధకరముగ నుండెను. ఆసందర్భమున "I wish God would grant her individuality and firm convictions, so that she may live a life of principle. God bless her!" ఆమె ధర్మజీవనము జీవించునట్లు ఈశ్వరుడు ఆమెకు వ్యక్తిత్వమును దృఢవిశ్వాసములను ప్రసాదింపవలయు నని నే నభిలషించుచున్నాను. ఈశ్వరు డామె నాశీర్వదించును గాక—యని దినచర్యపుస్తకమున ఆయన వ్రాసికొనెను. సత్యము నారసి ఆమె తనవద్దకు రావలయుననియె ఆయన యాశయము. కాని యామెకు ధర్మవిషయములను విచారింపగల వయసు లేదు. ౨౨-౪-౧౯౦౭ తేదిన పగలు చాలసేపు ఆయన ఆమెవద్ద నుండెను. నాడు జరగినది యిట్లు వ్రాసికొనెను—"ఆమె నాయందు కొంతప్రేమ చూపుచున్నట్లు కాన్పించెను. తాను వచ్చి నాతో జీవింపక తప్పదని ఆమె తిరిగిచెప్పెను. జందెము వేసికొను మని ఆమె నన్ను పలుమారు కోరెను. నే నందుకు పూర్తిగా నిరాకరించితిని." భార్యాసంబంధమయిన బాధ్యత ఒకవైపునుండియు, ధర్మవిషయమయిన దీక్ష మరి

యొక్క వైపునుండియు ఆయనను లాగుచుండెను. అవి రెండును నిర్వహింపవలసినవె యగుచు నొకదాని నొకటి పొసగక ఆయన కమితక్లేశము కలిగించెను. ఆ సంఘర్షణమున నెంత దుస్సహదుఃఖమునకు లోనైనను, ఆయన ధర్మమునుమాత్ర ము విడనాడకపోవుట ఆయనవిశ్వాసముయొక్క పటిమను వేనోళ్ల చాటుచున్నది. జీవితము పరిసమాప్తి నొందువరకు ఆయన తన భార్యయొక్క దురవస్థను గూర్చిన చింతనె ప్రధానముగ కలిగియుండెను. కాని యీశ్వరఘటనవలన, ఆమె కది తప్పకపోయెను. ఈశ్వరుడె యామెకు శరణ్యు డగును గాక!

---

# జీవనస్మృతి

## ౧౨ వ ప్రకరణము

### బంధుకోటి

మన కథానాయకుడు. తన భార్యాసంబంధమున నెట్టి యాధ్యాత్మికమయిన పోరాటమునకు లోనైనదియు, తన భార్యతో తనకుగల ప్రేమానుబంధమును కాపాడుకొనుచు ఆమెకు తాను నిర్వర్తింపవలసిన విధులవిషయమున నాతురత జెందినను ఆమెమూలమున తన ధర్మజీవనమున కేమాత్రము భంగము కలుగకుండ నాపోరాటమున విజయము గాంచినదియు, చదువరులకు విదితమైయుండును. ప్రపంచమునందు సంసారసంబంధములు గలిగి జీవించుచు ధర్మముకొరకు పోరాడువాడె నిజమయిన ధర్మయోధుడు. సంబంధములన్నియు త్రెంచుకొని యరణ్యముల పాలగు వారి యాత్మబలము ఏపాటిదో పరీక్షకు రానేరదు. ఇతరబంధువులతో కూడ నెటుల మెలగి బాపయ్యగారు తమ యాత్మశక్తిని విజృంభింపజేసిరో చూతము.

మామగారు, దావులూరి ఉమామహేశ్వరరావుగారు

ఆయనను తిరిగి సంఘమున జేర్పవలెనను నుద్దేశముతోడనె ఆయనయెడ కొంతకాఠిన్యతను జూపెను గాని వాస్తవమునకు ఆయనయం దెంతయొ ప్రేమను కలిగియుండిరి. ఆయనయు వారిని నటులనె ప్రేమించెను. ఉమామహేశ్వరరావుగారి ద్వితీయపుత్రుడు ఒకరోజున గోదావరికి స్నానమునకు వెళ్ళి అందు మునిగి యాకస్మికముగ చనిపోయెను. ఆ దుర్మరణము వలన ఉమామహేశ్వరరావుగారి గృహము దుఃఖమయ మైపోయెను. మైసూరు రాజ్యమునకు వైద్యముకొరకు వెళ్ళి యచటి ముఖ్యస్థలములను దర్శించుచుండిన బాపయ్యగారికి ఈ విచారకరమైన వార్త చేరెను. చూడవలసిన ప్రదేశములను సాధ్యమయినంత త్వరలో చూచి మామగారిని మామగారి కుటుంబమును పరామర్శ చేయుటకు అచటనుండి వెంటనె తిరిగివచ్చెను. ౧౩--౫--౧౯౦౬ తేదిక్రింద ఆయనదినచర్యపుస్తకములో నిట్లు వ్రాసికొనెను.—"మా మామగారిని ఓదార్చుటకు రాజమహేంద్రవరమునకు వచ్చితిని. వారు నాచేతులను పాదములను పట్టుకొని, తమ కుమార్తెకొరకు పూర్వపద్ధతులలోనికి మరలవలసినదని చాల సేపు బ్రతిమాలిరి. సుమారు నాలుగు సంవత్సరము లట్లు జీవింపు మని వారు నన్ను గోరిరి. వారి వాదములు వృథా యయ్యెను. కన్నీటిధారలె ఆ వాదములందలి కారణములు. నాకు చాల విచా

రము కలిగినది. లోబడిపోకుండ నాపై కటాక్షము చూపి నందులకు పరమేశ్వరునకు నమస్కరించుచున్నాను. వారి కుటుంబములోని యితరులను చూచితిని. వేరుగ వారి గృహమున ఉదయము భుజించితిని. సాయంకాలము ఒకటి రెండు నిమిషములు నా భార్యను చూచితిని. ఆమెకు ముద్దిడి యితరుల మాటలవలన నిరుత్సాహము జెందవలదని చెప్పితిని. నాకు త్తరములు వ్రాయుచుండు మని ఆమెను కోరితిని. ఆమెకును, నాకును, ఆమె బంధువులందరకును పరమేశ్వరుడు మనోశాంతిని అనుగ్రహించును గాక !" ఈ జరగిన వృత్తాంతము బాపయ్యగారి ప్రేమ కెటుల మేర లేదో ఆయన ధర్మోత్సాహమునకును అటులనె అంతు లేదని సువ్యక్తము చేయుచున్నది.

బాపయ్యగారి తల్లి వరలక్ష్మమ్మగారు ఆయనను లోకముతో పాటు జీవించునట్లు చేయుటకు పూర్తిగ ప్రయత్నించుటలో నేమియు నాశ్చర్యము లేదు. భర్త చనిపోయి దుఃఖమున దోగాడుచుండ, చేతులార పెంచి పెద్దదానిని చేసి కాపురమునకు పంపిన కూతురు అకాలమృత్యువాత బడుటయె గాక సంసారభారమును వహించి గృహ కృత్యముల నిర్వర్తించుటకు తగిన వయస్సు వచ్చిన పెద్ద కుమారుడు ఈతీరున మారి సంఘబహిష్కృతు డగుట తటస్థించి నప్పుడు, ఆమె

ఎటువంటి నిరాశతో తపించి పోవునో వ్రాయుటకంటె నూహించుకొనుటయె సుకరము. ఆయనతో ఆమె యెటువంటి సంబంధము పెట్టుకొనుచుండెనో, ఆయనకు భోజనము ఎక్కడ పెట్టుచుండెనో, ఎటువంటి యేర్పాటులు చేయుచుండెనో—ఇవి యన్నియు సంఘస్థులు జాగ్రత్తగ పరిశీలించుచుండిరి. సంఘముయొక్క వెరపుచేతను, ఆయన తనవాడు కాకుండ పోవుచున్నాడె యను నిస్పృహచేతను ఆమె ఆయనకు వలసిన సాహాయ్యము చేయకపోవుటయె గాక పరుషవచనములచే మనస్తాపమును కలిగించెను. ఆమె ఆయనయెడ నెట్లు వర్తించినను, ఆయన ఆమెయెడ నెట్లు మెలగెనో తెలిసికొనుట ముఖ్యము. ౧౯౦౬ వ సంవత్సరములో మే నెలలో విశేషభాగమును జూన్ మాసమంతయు ఆయన బాపట్లలో గడపెను. అచట బంధువులద్వారా ఆయనకెంత యొత్తిడి కలుగవలయునో అంతయు సహ్పూము పూర్తిగ కలిగెను. ఆయనకు తొందర కలుగజేసిన వారిలో తల్లి ముఖ్యురాలు. ఆయన యచటికి వెళ్ళినప్పుడు ఆమె ఊరిలో లేదు; కాని వెంటనె వచ్చెను. అచట జరిగినది ఆయనమాటల లోనె తెలుపుట యుచితము.

"మా అమ్మ నిన్న (౧౯—౫—౧౯౦౬) తిరిగి వచ్చినది. నా కన్నము నండిపెట్టుదు ననియయినను ఆమె

చెప్పలేదు. నాయెడల వారెంత నిర్దాక్షిణ్యముగ మారినారు! కాని వీరిమీద నాధారపడ గూడదని యీశ్వరుడు నాకు బోధపరచినాడు. ఆయనమీదనె నావిశ్వాస ముంచి నాసొంత ప్రయత్నములమీద నేను నిర్భరపడెదను."

"ఈరోజు (౨౪—౫—౧౯౦౬) ఒక మోస్తరు భయానకములయిన శకునములతో ప్రారంభ మాయెను. పక్కనుండి లేచిన వెంటనె కూడ మిక్కిలి విషాదకరము లయిన కొన్ని ఘటనలకు లోనైతిని. దినమంతయు చిరాకుతో నుంటిని. ఎండ సహితము మిగుల తీక్షణముగా నుండెను. రాత్రి మా అమ్మయు శేషమ్మగారును (పినతండ్రి కృష్ణయ్యగారి భార్య) వచ్చి నావద్ద సుమారు మూడుగంటల సేపు కూర్చుండిరి. ఉన్నంత సేపును వారు నన్ను చీవాట్లు పెట్టిరి; అతికఠినమును వెగటును అయిన మాట లనిరి. అసూయత పూర్తిగ కనపరచిరి. వారందరియెడల ప్రేమపూర్వక మయిన గౌరవమును నేను కలిగి యుండునట్లు దయామయు డయిన పరమేశ్వరుడు అనుగ్రహించును గాక! అనేకవిషయ ముల సందర్భముననుు, ఎక్కువగా, ఆమె తలపెట్టిన నా సోదరుని వివాహవిషయములో నేను జోక్యము కల్పించు కొనుటయందు, నేను తప్పిదము చేసితినని మా అమ్మ అనెను. నాకును ఆమెకును ఈశ్వరుడు శాంతి నొసంగును.

గాక ! ఏమాత్రము విశ్రాంతి లేకుండ ఆ రాత్రియంతయు గడపితిని.''

"(౨౬—౫—౧౯౦౬) నా సోదరుని పంపుటకు మా అమ్మ రైలుస్టేషనుకు వచ్చినప్పుడు నే నామెను అచట చూచితిని. ఆమె నాతో దయగా మాటాడెను. నే నామెతో కలసి యింటికి వెళ్ళితిని. అక్కడ కూడ ఆమె ప్రేమతో డనె మాటాడెను. అటువంటి ప్రేమసంబంధమున ఈశ్వరుడు మాయిరువురను సదా బంధించి యొకరి యభిప్రాయము లొకరు మన్నించుకొనుటకు నేర్పును గాక!''

తరువాత నొకటి రెండు పర్యాయములు కూడ ఆయన ఆ తూరి బాపట్లను విడుచులోగా ఆయనకును ఆమె కును పైని వ్రాయబడినటువంటి మాటలే జరగినవి. ఆయన ఆమెను ఏసందర్భములోను ప్రేమించుట మాన లేదు. తన యభిప్రాయములయం దెటువంటి మార్పు వచ్చినను, ఆమెను తన సోదరుని తనవద్దనుంచుకొని వారికి సాయపడవలె ననియె మొదటినుండియు ఆయనసంకల్పము. అది వారికి తెలుపుచు వచ్చెను. తన యభిప్రాయముల నామె స్వీకరింప వలయునని ఆయన కోరియుండ లేదు. ఆమె తన యభిప్రాయములును పద్ధతులును ఏమాత్రము విడువకుండ తనవద్ద నుండవచ్చునని ఆయన స్పష్టముగ చెప్పెను. స్వాతంత్ర్యప్రియు డగుటచే,

ఆయన కోరినదియంతయు మతసహనము. అప్పటి సంఘపరిస్థితులలో దాని కంగీకరించుటకును ఆయనతల్లికి సాధ్యము కాలేదు. భార్య గాని, తల్లి గాని, ఎవరయినను వ్యక్తిత్వము గలిగి అభిప్రాయములందును నడవడికయందును స్వాతంత్ర్యముతో చరించుటయె ఆయన వాంఛించినది. ఆయన ప్రేమ యెంత గాఢమయినదో అంత విశాలము కూడ నయినది.

ఆయనను పూర్వాచారములోనికి త్రిప్పుటకు ఆయన తాతగారు శింగరయ్యగారు కూడ ప్రయత్నించిరి. వారు గుడివాడనుండి అందులకు ప్రత్యేకముగ బయలుదేరి బాపట్లకు వచ్చిరి. వారితో ౪—౬—౧౯౦౬ తేదిన జరగిన ప్రసంగమునుగూర్చి ఆయన యిట్లు వ్రాసికొనెను.—"జందెము విషయమై వారు నాతో చర్చింప నారంభించిరి. వారును వారితో కూడ వచ్చిన వారినంటివా రింకొకరును సర్వజన సౌభ్రాత్రమును నమ్మకముగా నుంచుకొన వచ్చుననియు, కాని ఆచరణయందు నేను ఇతరులతో కలిసి భుజింప రాదనియు చెప్పిరి. అది వారికి చాల సరియయిన పద్ధతిగా నున్నను నాకు ద్వంద్వజీవనము గడపుటవలె గాన్పించెను. బాహ్యవేషములను దాల్చి నేను పుట్టిన కులమునకు సంబంధించిన బాహ్యచిహ్నము లన్నియు ధరింపవలె నని వారు చెప్పిన వాదనయు నాకు మనస్కరింప లేదు. సర్వమును దిద్ది నడపు

పరమపిత, ఎట్టి ఫలితములు కలిగించునది యైనను ఏది ధర్మ మొ దానినె నాకు బోధించును గాక!''—మరియు ఆయన ౫—౬—౧౯౦౬ తేదిక్రింద నిది వ్రాసికొనెను.—"సాయం కాలము తాతగారును మాణిక్యమ్మగారును (ఆయన మేనత్త) ఆమె కూతురును నన్ను లోబరచుకొనుటకై బలవంతపెట్టు టకు తోటకు వచ్చిరి. అటువంటి పతనమునుండియు అవమా నమునుండియు అదృష్టమువలన ఈశ్వరుడు నన్ను రక్షించెను."

తాతగారును మేనత్తగారును వయసునుబట్టి ఆయనను పిల్లవానివలె నెంచి యే పనియైన చేయుమని బలవంతపెట్టగల స్థితిలో నున్నారు. ఆ స్వాతంత్ర్యమును వారు చూపిరి. కాని ఆయన అందునకును లొంగలేదు. ఆయన యీశ్వర విశ్వాసము మహాపర్వతమువలె చలింపకుండెను. పెద్దవారి యెడ ఆయన కమితగౌరవము కలదు; కాని తన అంతరా త్మకు వ్యతిరేకముగ వారేది చెప్పినను అది మాత్రము చేయుటకు సమ్మతించువాడు గాడు.

మరియు తనకంటె వయసులో పెద్దవారయి తన భక్తి గౌరవములకు పాత్రులయి యున్న వారికి అవశ్యమయినప్పుడు ధర్మమును చూపుటకు కూడ ఆయన యత్నించెను. తన తమ్ముడింకను పసివాడై యుండగా అతనికి వివాహము చేయుటకు పెద్దలు పూనుకొనిరి. ఆ విషయము తన కెందు

కని ఆయన యూరుకొనలేదు. తా నట్లు జోక్యము కలిగించుకొనుట తల్లి సహింప లేదని ఆయనమాటలవలన ఇదివరకే తెలియవచ్చినది. పినతండ్రి కృష్ణయ్యగారును, మేనమామ వెంకటప్పయ్యగారును ఆ వివాహము నిశ్చయించుటకు ముఖ్య కారకులు. మొదటినుండి తన కుటుంబమునందు, వారు ఎక్కువ బాధ్యత కలిగి తనకు ప్రత్యేకముగ అనేకవిధముల సాయపడి తనను పెద్దవానినిగా జేసిన వారే ఆ యిరువురు అయినను, తన తమ్ముని వివాహవిషయములో వారు సరిగా యోచించుట లేదని తాను నమ్ముటచే వారి కది తెలుపుట విధి యని భావించెను. తన యభిప్రాయము దృఢముగా తెలిపెను. ఆ సందర్భమునుగురించి ౧౩-౫-౧౯౦౭ తేదిన ఆయన యిట్లు వ్రాసికొనెను. "ఇద్దరు గ్రాడ్యుయేటులు కృష్ణయ్యగారును, వెంకటప్పయ్యగారును ఇష్టపడి నా యిచ్ఛకు వ్యతిరేకముగా నా తమ్ముని వివాహమును నిశ్చయించినారు. వారి చదువు వారికి ప్రయోజనకారి కాలేదు. మా అమ్మకేదో యుపయోగమును సౌఖ్యమును కలుగు నను తలంపుతో, వా రావివాహము చేయుచున్నారు. ధర్మానుగుణముగ జీవితము గడపుట వీరిదృష్టికి అసాధ్యముగ గాన్పించును. ఈశ్వరుడు వారికి సరియయిన యోచనను ప్రసాదించును గాక! నా తమ్ముడు ఇతరుల కుపయోగపడుచు సుఖముగ

జీవించునట్లు అనుగ్రహించును గాక!"

వివిధములయిన కుటుంబసంబంధములు కలిగియు, బాపయ్యగారు శరీరము నతిక్రమించి ధర్మమును సాధించి బాంధుత్వము వాస్తవమునకు ఆత్మలకు సంబంధించి దృఢతరమై శాశ్వతముగ వెలయునది యని జీవితముద్వారా కనపరచెను. ఆయనకు బాహ్యముగ నందరితో బంధుత్వము తెగినను, ఆధ్యాత్మికముగ ఆయన అందరితోడను బంధుత్వము కలిగి పవిత్రమయిన ప్రేమజీవనము జీవించెను. భార్యను, తల్లిని, తాతను, మేనత్తను, పినతండ్రిని, మేనమామను, బంధువులందరిని ఉత్కృష్టమయినట్టియు ధర్మమునకు విరుద్ధము కానట్టియు ప్రేమతో సన్మానించెను. బాహ్యవియోగమును భరింపలేక నాడు కఠినముగ జూచిన బంధువులందరు నేడు ఆయన మృతి జెందియున్నను ఆయనతోడి ప్రేమబాంధవ్యమును హృదయములందు గుర్తించి స్మరింప గలుగుచున్నారు.

---

# జీవన స్మృతి

## ౧౩ వ ప్రకరణము

### మిత్రవర్గము - పురుషులు

భూగర్భమునం దుండు జలధార యుపరిభాగమునకు వచ్చుటకు సాధన మేర్పడిన తరువాత, అది సర్వప్రదేశము లందు విస్తరించి అంతయు జలమయము చేయును. అటులనె హృదయాంతరాళమునుండి ప్రేమధార వెలువడ గలిగిన యెడల, అది సర్వమానవహృదయములందు వ్యాపించి మహా ప్రవాహరూపము దాల్చును. రక్తబిందువులె బంధువు లను కొనుచు తదితరులను ప్రేమాస్పదులనుగా జూడజాలని వారలె బహుసంఖ్యాకులు. వారు తమ చిరకాలపరిచితులు నానా బాధలు పడుచున్నా రని వినుచున్నను, వారికి తాము చేయ గల సాహాయ్యము కూడ చేయవలె నను స్పృహయె లేకుండ నుందురు. బంధుత్వము ఆత్మసంబంధమయిన దను జ్ఞానము అంకురింపగానె జీవితము నూతనశోభను గాంచి యనంత ముగ విస్తరిల్ల మొద లిడును. ఇట్టి విపులత జెందుటలోనె జీవితముయొక్క ఘనతను చూడ నగును. శాపయ్యగారు

తన రక్తబంధువులనె గాక పరిచితులను కూడ నెట్లు ప్రేమించి వారియెడ వర్తించెనో విచారింతము.

వయస్సులోను విద్యలోను ఆయనకంటె నెంతయొ చిన్నవారుకూడ ఆయనయొక్క గాఢానురాగమునకు పాత్రులైరి. బ్రహ్మానందము నను కుర్రవాడు బాపట్ల హైస్కూలులో అయిదవఫారము చదువు చుండెను. ఆ అబ్బాయి కొద్దిగా ఆయన పరిచయములోనికి వచ్చినతరువాత మృతి నొందుట తటస్థించెను. అప్పుడు అతనిని గురించి ఆయనే పాలపర్తి నరసింహముగారి కిట్లు ౧౦—౧—౧౯౦౮ తేదిన ఉత్తరము వ్రాసెను.—"ప్రియ మయిన బ్రహ్మానందము చనిపోయె నని విని నేను మిగుల చింతిల్లితిని. ఆతనియందు నా కిష్టము కలదని నీ వెరుగుదువు. ఆతడు వృద్ధిలోనికి రా దగిన పౌరు డగు నని నేను ఆశపడితిని. కాని ఆతనిని మన నుండి యింత త్వరితముగ తీసికొనిపోవుటకు ఈశ్వరుడు ఇచ్ఛగించెను. ఆతని యాత్మ శాంతి నొందును గాక !" ఈ వాక్యము లెంత యభిమానము తెలుపుచున్నవి! మన యపూర్వ పాఠశాలోపాధ్యాయులకు బాలు రసగా గడ్డిపరకలవలె గాన్పించినను వారు భక్తుల దృష్టిలోమాత్రము అమూల్య రత్నములె.

నేను రాజమహేంద్రవరమునకు మొదట వచ్చిన దిన

ములలో అచటి ప్రార్థనసమాజముయొక్క యుపాసనాసభలకు నాలుగైదు వారములు వెళ్ళిన తరువాత ఒక రోజున బాపయ్యగారి నిట్లు ప్రశ్నించితిని. "ఒరే బాపియ్యా, ఆయిద్దరూ ఎవర్రా! ఒక్క మోస్తరు బట్ట కట్టుకొని, ఒక్క మోస్తరు చొక్కా వేసుకొని, ఒక్క మోస్తరు టోపీ పెట్టుకొని ఇద్దరూ కలిసి సమాజానికి వచ్చి పోతూ వుంటారు!". నేను కొంత హాస్యముగా చెప్పిన యీమాటలకు ఆయన నవ్వి తరువాత గంభీరముగా నివ్విధమున నుడివెను.—"ఒరే, నీవు ఇన్నాళ్ళనుంచీ సమాజానికి వెళ్ళుతున్నావు. వారితో నీవు ఒక్క పర్యాయమైనా, మాట్లాడ లేదా? సమాజానికి వెళ్ళడం అందరితో కలిసి ప్రార్థన చేయడానికి గాని నీకు నీవు కళ్ళు మూసుకొని కూర్చోడానికి కాదు. అందుకే అయితే ఇంట్లోనే కూర్చోవచ్చు. సమాజానికి వచ్చేవా రందరితో పరిచయం చేసుకోవాలి. ఆ పరిచయంతో వారితో చేరి ప్రార్థన చేస్తూవుంటే, ఎంతో ఉత్సాహం, ఎంతో ఆనందం. వా రిద్దరూ పోస్టల్ డిపార్టుమెంటులో పని చేస్తున్నారు. ఒకరు డి. నారాయణరావుగారు, రెండవవారు వి. రామారావుగారు. ఇద్దరూ చాలా మంచివారు. బ్రాహ్మసమాజమంటె ఎంతో ఉత్సాహంగా, ఉంటారు. వారి పరిచయం చేసుకో." ఈ మాటలలో నున్న సత్యము నా మనస్సునకు

తట్టెను. అటుతరువాత వారియొక్క ఇంక నితరులను మెల్ల మెల్లగా పరిచయము చేసికొంటిని. ఇతరులను పరిచయము చేసికొనుట బాపయ్యగారు తమ జీవితమునందు నొక సాధనాంగముగ నభ్యసించిరని ఆయనమాటలె తెలుపుచున్నవి.

జీవితము లైక్యమగు నప్పుడు పరస్పరసానుభూతియు అన్యోన్యసాహాయ్యమును అతిశయిల్లును. బాపయ్యగారు ఎవరితో సహవాసము చేసిరో వారియందమితప్రేమను కనపరచుచు వారియొక్క యైహికాముష్మికసౌఖ్యములకొరకు పాటుపడిరి. తన స్నేహితుల కష్టములు ఆయనకు తన కష్టములె యయి కడు విచారము కలిగించెడివి. కావున మిత్రులకు నిజమయిన సానుభూతితో కష్టసమయములందు ఆయన తోడ్పడి వారి మనస్సులను ఈశ్వరుని వైపునకు మరల్చుటకు ప్రయత్నించెను. కె. నమశివాయంగారు రాజమహేంద్రవర బోధనాభ్యసనకళాశాలలో చదువుచుండి నప్పుడు ఆయనకు స్నేహితు లయిరి. తరువాత వారు రాజమహేంద్రవరము విడిచి తెక్కలిలో నుపాధ్యాయులుగ నుండిరి. వారు దగ్గర లేకున్నను, వారియందు మిక్కిలి ప్రేమను ఆయన చూపుచుండెను. ఆయన కలకత్తానుండి తిరిగి వచ్చుచు తెక్కలిలో ఆగి వారిని, వారి కుటుంబమును దర్శించి యెంతయో ఆనందించెను. వారు జందెమును తీసివేసిరనియు, అనుష్ఠానిక

బ్రాహ్మలుగ నుండుటకు సిద్ధపడి యున్నారనియు, తమ పుత్రుని నామకరణము పరిశుద్ధాస్తికపద్ధతుల ప్రకారము తనచే జరపింప నిచ్చగించు చున్నారనియు తెలిసికొని పరమేశ్వరుడు శక్తి నిచ్చి ఆచరణయందు మంచిదృష్టాంతము వారు కనపరచు నట్లనుగ్రహించును గాక యని ప్రార్థించెను. పిమ్మట మూడురోజులకు ఆయన ఆనామకరణోత్సవము జరపి బాలునికి 'సూర్యఆనందమోహన్'. అను పేరును పెట్టెను. కొలదికాలములోనె ఈశ్వరఘటనవలన పాప మాబిడ్డడు మృతి జెందుటచే, తల్లిదండ్రుల కమితదుఃఖము వాటిల్లెను. ఈ వార్త వినుటచే ఆయనకు చాల విచారము కలిగెను. తన జబ్బుతో తాను బాధపడుచున్నను, తాను వారిచెంతను లేక యెంతయొ దూరమున చెన్నపట్టణములో నుండి యున్నను, వారిని గూర్చి తలపోయుచుండగా, వారికి నుత్సాహకరముగ నుండ గలిగిన ఒక ఆలోచన తనకు తట్టినతోడనె యుత్తరముద్వారా నది వారికి తెలియపరచెను. వారి దృష్టిని పరమేశ్వరుని వైపునకు మరల్చుటకె ఆ పిల్లవాడు జన్మించె ననియు, ధర్మాచరణమునకు వారిని పురిగొల్పుట మాత్రమె ఆ శిశువు జీవితమువలన వారు పొందదగిన లాభము గాన అయ్యది చేకూరుటచే విచారముతో గాక తృప్తితో వారు జీవితము గడపుచు ధర్మముకొరకు నధికో

త్సాహముతో పాటుపడుట విధాయకమనియు ఆయన తెలిపిన ముఖ్యభావములు. ఆయనయుత్తరము తమకు మనోశాంతి నొసంగి అనేక సదాలోచనలను రవులుగొల్పె నని వా రాయనకు ప్రత్యుత్తరము వ్రాసిరి. బాపయ్యగారివంటి మిత్రులను పొందగలిగిన వారు అదృష్టవంతులు. నిజ మయిన మైత్రికొరకు ప్రపంచమున మానవహృదయము తపించుచుండును. నిర్మలప్రేమ ప్రతిహృదయమునుండి వెలువడును గాక!

రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారు పరిశుద్ధాస్తిక మతమునందు చిరకాలమునుండి విశ్వాసము కల వారైనను తదనుగుణముగ జీవించుటకు బాపయ్యగారి సహవాస మేర్పడిన తరువాతనె ప్రారంభించిరి. పిన్నవారైనను ఆయన పంతులుగారి కావిషయమున ప్రోత్సాహము కలిగించెను. ఆయన యనుష్ఠానపరుడు అయినతరువాత, పంతులుగారు తమ తండ్రిగారి శ్రాద్ధమును ౧౫-౨-౧౯౦౯ తేదిన ఆస్తికపద్ధతిని జరపి నాటనుండి వర్ణభేదమును విసర్జించి, విగ్రహారాధనసంబంధ మయిన కర్మలను మాని తామును అనుష్ఠానపరులుగా నుందుమని వ్యక్తీకరించిరి. ఆరోజున తెలిపినటుల జందెమును వారు వెంటనె తీసివేయుటకు సాధ్య మయినది కాదు. ఇతరులు కొంత యాక్షేపించుటకును కారణ

మాయెను. కాని బాపయ్యగారు పంతులుగారిని సమీపించి నిజమారసి జనులకది తెలియచెప్పి పంతులుగారు సాధ్యమయినంతత్వరలో ప్రకటించినలాగున ప్రవర్తించునట్లు చేయగలిగిరి. తన నిరుపమానమైన భక్త్యుత్సాహములు తానెవరితో కలసి జీవించుచుందునో వారికి ప్రశంసించులాగున ఆయన ప్రేమపూర్వక సంబంధములు పెట్టుకొనెను. ఆ కారణముచేత ఆయన పెద్దలకుసహితము గౌరవపాత్రుడును మార్గదర్శకుడును కాగలిగెను. తమలో కలిగిన మార్పును గూర్చి పంతులుగారిట్లు వ్రాసికొనిరి.

—"మతసంస్కారము లేక సంఘసంస్కారము గాని మరి యే యితర సంస్కారములుగాని జయప్రదముగా సాగదని చిరకాలానుభవమువలన నేను దృఢముగా దలచుచున్నాను. మీరు (అనుష్ఠానపరులయిన బ్రాహ్మలను నిందించువారు) పడుచున్న భ్రమలోనె నేనును తగులుకొని యుండి మతవిషయకములయిన నా విశ్వాసములను కొన్నిటిని గార్యములలోఁ జూపక యాత్మవంచకుఁడ నయి వితంతువివాహసంస్కారము చెడునని కడచిన యిరువదియైదు సంవత్సరములనుండి యీశ్వరవంచకుఁడ నయి ప్రవర్తించి నాడను..............*.నాకంత్యదినములు సమీపించుచున్నవి. దక్షిణహిందూస్థాన బ్రహ్మసమాజమునకుఁ బ్రధానాధ్యక్షుడనుగా నుండి యీశ్వరునియొక్క జగదేకపితృభావమును మానవులయొక్క పర

స్వరభ్రాతృభావమును ఘోషించుచు నాత్మవంచకుడను లోక
వంచకుడను భగవద్వంచకుడను నయి దేహము త్యజించుట
కిష్టములేని వాఁడ నయి యీ లోకసామాన్య సౌభ్రాత్ర
మున కీవృద్ధదశలో సాహసించినాడను". ఇది యెంత యద్భు
తపరివర్తనము అందునకు వలసిన శక్తియంతయు హృదయ
మున నణగియుండెను. ఇంచుక కదల్పబడి ప్రజ్వరిల్లెను.
బాపయ్యగారికి హృదయములను కదల్పగల సామర్థ్యము
గలదు.

ధర్మమార్గమున దృఢముగనడువ గలిగినవారు అరుదు
గా నుందురు. బిడ్డలు ముందు తప్పటడుగులు వేయుచు పడుచు
లేచుచు క్రమ క్రమముగా మంచి నడకను నేర్తురు. ధర్మమార్గ
మున నడువ బూనిన వారును మొదట సామాన్యముగ తప్ప
టడుగులు వేయుదురు; పడుచు లేచు చుందురు. బిడ్డలకువలె
వీరికిని చేయూత యుండుట యావశ్యకము. ఆ సంగతి గమ
నింపక అసామాన్యబుద్ధిమంతులు కొందరు ధర్మమార్గానుచ
రులకు నే సాహాయ్యము చేయవలెనని తలంపకపోగా వారి పతన
ములనే జూచి యెగతాళిచేయుదురు. నిజమయిన ఈశ్వరభక్తులు
మాత్రమె పతితులను ప్రేమించియుద్ధరింపగలరు; పావనులనుగ
జేయ గలరు. ధర్మపథమున నడు గిడి క్రిందపడు వారియెడ
నెట్టి యసహ్యమును జూపక హృదయపూర్వకమయిన సాను

భూతి కనపరచి వారిని నుత్సాహపూరితులనుగా జేసి ముందునకు నడుపగల సామర్థ్యము బాపయ్యగారికి పూర్తిగ గలదు. బాపయ్యగారి యాదర్శజీవనము ధర్మమునెడ నెంతయో నిర్లక్ష్యముగా నుండిన నన్ను కూడ చిన్నప్పటినుండియు నాకర్షింప గలిగెను. తగిన శిక్షణమునందు పెరుగకుండుటచే తన్కాలమున కలుగ వలసి నంత ప్రయోజనము మాత్రము నాకు కలుగ లేదు. ఆటలయందును, వినోదములందును అధికాసక్తుడనై యున్న నన్ను తనవైపునకు మరల్చుకొనుటలోనె ఆయనయందు విశేషశక్తి యున్నదని నమ్ముచున్నాను. నాయందు ఏ సద్భావములు జనించియుండినను, ఏపాటి సద్వర్తన మేర్పడి యుండినను, దాని కంతకు ఆయనయె కారకుడు. సాధుపురుషుల సాంగత్యమునకు తగని వాడనె యయినను, ఆయన నన్ను ప్రేమించి తన దరిని చేర్చుకొనెను. తన సలహాలు నిరుపయోగము లయి పోవుచున్నను, నాకు వానిని ఆయన తిరిగి తిరిగి చెప్పెడు వాడు. ఆయన సహానమువలనను, సాహాయ్యమువలనను, అవ్యాజమయిన ప్రేమవలనను, నేను కొంచెము ధర్మాభిరుచిని బడసి, ఆయన అడుగుజాడలనుబట్టి నడువ మొదలిడితిని. వర్ణభేదము విడిచితిని, విగ్రహారాధనను మానితిని. జందెమును త్యజించితిని. నా తల్లి శ్రాద్ధము ఆస్తికపద్ధతి జరిపితిని. కాని శోధనయందు పడి

తిని, తాళజాలక పోతిని. బుద్ధి చలించెను. ప్రాయశ్చిత్తము చేయించుకొని, జందెము తిరిగి వేసికొంటిని. సంఘమునందు మరల స్థానము పొందితిని. కాని నాకు సుఖమునకు బదులు దుఃఖమె మిక్కుటమాయెను. హృదయము ఆదర్శముమీఁదనె నిల్చి యుండెను. కొన్ని సంవత్సరములనుండి ప్రేమింపబడిన యాదర్శము, జన్మసాఫల్యహేతు వని విశ్వసింపబడిన యాదర్శము, నిదర్శనపూర్వకముగ ప్రత్యక్ష మయిన యాదర్శము, ఎట్లు హృదయమునుండి ఒక్కమారుగ తొలగి పోగలదు? దాని పట్టునుండి తప్పించుకొనజాలక తిరిగి తదనుగుణముగ జీవింప గడంగితిని. పిమ్మట ధర్మప్రచారమునకును బూని సుమారు ఇరువది సంవత్సరములనుండి యథాశక్తి ధర్మవ్యాపనమునకు పాటుపడుచుంటిని. నేటికిని నన్ను ప్రేరేపించుచున్న బాపయ్యగారి యపారప్రేమను స్మరించి ప్రణమిల్లుచున్నాను.

ప్రస్తుతము గుంటూరులో ధర్మసాధనీసంపాదకులుగను బ్రాహ్మధర్మప్రచారకులుగను పని చేయుచున్న పాలపర్తి నరసింహంగారు బాపయ్యగారి యనుచరులు. అనుష్ఠానపరులగుటకును, సుమారు పదునైదు సంవత్సరములనుండి అనేక కష్టములను సహించుచు ధర్మప్రచారము సలుపుటకును, నరసింహముగారు వలసిన శక్త్యుత్సాహములను బాపయ్యగారి

యుత్తమజీవితమును ఆదర్శముగా నుంచుకొనుట వలననె యని నిస్సంశయముగా జెప్పవచ్చును. బాపయ్యగారు జీవించి యున్నంతవరకు ఆయనను ప్రతిముఖ్యవిషయమునను సలహా అడిగిన తరువాతనె నరసింహముగారు కర్తవ్యమును నిర్ధారణ చేయుచుండిరి. సమయము చిక్కినప్పు డెల్లను, బాపయ్యగారు నరసింహముగారియందు ధర్మోత్సాహము పురిగొల్పెడు వారు. రాజమహేంద్రవరమునకు వచ్చుటకు పూర్వము నరసింహముగారు బాపయ్యగారిని సంప్రదించిరి. ౭-౧౨-౧౯౦౭ తేదిగల యుత్తరమునందు బాపయ్యగారు ఈ తీరున నరసింహముగారిని హెచ్చరించిరి.—"ఇక్కడ (రాజమహేంద్రవరములో) నుండుటకు నీకు గల కోరికను నేను పూర్తిగా అర్థము చేసికొనగలను. బ్రాహ్మధర్మమునకును, సంఘసంస్కరణమునకును సంబంధించిన యుద్యమమునందు సాయపడవలె నను తలంపుతోడనే నామాటుకు నేను ఈపట్టణమునకు బలవత్తరముగ నాకర్షింపబడి వచ్చితిని. దురదృష్టమునవలన నేను వ్యాధిచే నశక్తుడ నయితిని. పంతులుగారితో కలసి పనిచేయుట నిస్సందేహముగా చాల కష్టమె. కాని యుద్యమమునకై తోడ్పడ మనము ప్రయత్నింపకుండుటకు అది కారణము కానేరదు............ నిజము చెప్ప వలసివచ్చిన, పంతులుగారియందు తప్పిదము

లున్నను నేను వారిని గౌరవింతును. బాగుగ యోచింపుము. ప్రస్తుతము కొత్తరములో నున్న మన * హనుమంతముతో నాలోచింపుము! పిమ్మట నీవు ఏమి చేయదలచినది స్పష్టముగా తెలుపుచు పంతులుగారికి ఉత్తరము వ్రాయుము. నీవును హనుమంతము కూడను పంతులుగారు ప్రారంభించిన సత్కార్యములను సాగించుటకు ఎప్పుడో యొకప్పుడు ఇక్కడికి రావలె నని నే నెల్లప్పుడు కోరు చుందును, ప్రార్థించుచుందును.........రాజమహేంద్రవరములో తప్ప నిరికెచ్చటను ఆస్తికోద్యమముకొరకు కంత కృషి జరిగి యుండలేదు. పంతులుగారి సంస్థలన్నియు ఆస్తికపద్ధతుల ననుసరించి నడుపబడ వలసినవి. వానిని పవిత్రజీవులను తయారు చేయునట్టి యన్ని ఆశ్రమములుగా మనము చేయవలెను. బాగుగ యోచించి కార్యమును బూనుము." ఈ సలహా వాక్యములనుబట్టి బాపయ్యగారు తన యనుచరుల కెట్టి కార్యోత్సాహము కలిగించుచుండిరో గ్రహింప నగును.

బెజవాడవాస్తవ్యులు దామరాజు గంగాధరరావు గారు అడిగిన ప్రశ్నకు ప్రత్యుత్తరముగా ౧౧-౯-౧౯౦౫ తేదిన బాపయ్యగారు తమకు తెలిసినంతవరకు ఆంధ్రదేశమందప్పటికి ౧. నాళము కృష్ణారావుగారును, ౨. కొరు

* ఇది మా యింటిలోనివారు నన్ను పిలుచు పేరు.

మూరి కామరాజుగారును, 3. పిళ్ళారిశెట్టి సీతారామయ్య గారును, ౪. తాము మాత్రమె అనుష్ఠానికబ్రాహ్మల ముగ నుంటిమని వ్రాసియుండిరి. ఆ కొలదిమందిలో ప్రారంభమయిన అనుష్ఠానికజీవనము ఆంధ్రదేశమందు క్రమక్రమముగా విస్తరిల్లి నేడు సుస్థిరముగ పాదుకొనుటకు బాపయ్య గారు కనపరచిన నిష్కళంకమయిన దృష్టాంతమును, కలిగి యుండిన పవిత్రమయిన ప్రేమానురాగమును ప్రధానకారణము లని నుడువుటకు సంశయింప నక్కరలేదు. నాళము కృష్ణారావుగారును కారుమూరి కామరాజుగారును, ధర్మానుష్ఠానమున దృఢత్వమును తప్పినప్పుడు బాపయ్యగారు వారి కుత్సాహము పురిగొల్పుచు వచ్చిరి. జ్ఞానము పెంపొందించుకొనుటకును ధర్మప్రచారము సలుపుటకును పిళ్ళారిశెట్టి సీతారామయ్యగారిని ప్రోత్సహించుచు వచ్చిరి. ప్రచారకులుగ నుండ నిశ్చయించుకొని కలకత్తాలో బ్రహ్మజ్ఞానము నభ్యసించుటకు పోవు విషయమున కీర్తిశేషులయిన కవుకొండల సాంబశివరావుగారికి హెచ్చరిక నొసంగిరి. పోస్టల్ ఇన్స్పెక్టరు దామోజీపురపు నారాయణగారును, సింద్ అబ్జర్వర్ పత్రికా సంపాదకులు కోటంరాజు పున్నయ్యగారును, డాక్టరు వేదాంతం వెంకటకృష్ణయ్యగారును అనుష్ఠానికబ్రాహ్మసమాజకు లయి యథాశక్తి దేశసేవ సలుపుటకు కారకు

ల్గురి. బాపయ్యగారు పలుకులద్వారాకంటె నెక్కుడుగ పరిచయముద్వారా పరులతో నైక్య మగుచు తమ ధర్మజీవనము వా రందరియందు వ్యాపించునట్లు జేసిరి.

మత సాంఘిక విషయములు మాత్రమెగాక • దేశాభివృద్ధికరము లగు స్వదేశవస్తుప్రోత్సాహము, స్వరాజ్యోద్యమము, విద్యావ్యాపనము మొదలయిన యితర విషయములు కూడ బాపయ్యగారి హృదయమున ప్రథానస్థానము నాక్రమించుకొనుటచే, ఆయనకు అయ్యదేవర కాళేశ్వరరావుగారు, ముట్నూరి కృష్ణరావుగారు, డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, పింగళి లక్ష్మీనారాయణగారు, డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు, జయంతి గంగన్నగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, మునగాల జమీందారు శ్రీ రాజా నాయని వెంకట రంగారావు బహద్దరుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, అత్తిలి సూర్యనారాయణగారు, నాళము పట్టాభిరామారావుగారు, నాళము కృష్ణారావుగారు, ఆదిపూడి సోమనాథరావుగారు, కీర్తిశేషులయిన కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలగువారు పరమమిత్రులుగ నుండిరి. స్థూలముగ జూచిన బాపయ్యగారి జీవితము ఒక్క వ్యక్తికి సంబంధించి ౨౬ సంవత్సరములు మాత్రమె ఆయుఃప్రమా

ణము కలిగి అతి స్వల్పకాలములోనె యంతరించి నట్లు కన్పట్టును గాని 'సూక్ష్మముగ పరిశీలించిన అయ్యది అన్ని వైపులను భూమిలోనికి నూడలు దిగి విశేషప్రదేశము నావరించు అశ్వద్ధవృక్షమువలె అనేకుల హృదయములలో వేరూని నేటికిని విస్తృతాకారము దాల్చి యున్నట్లు పొడగట్టక మానదు.

---

# జీవనస్మృతి

## ౧౪ వ ప్రకరణము

### మిత్రవర్గము—స్త్రీలు

ఇంతవరకు బాపయ్యగారి మిత్రులని తెలుపబడిన వారు అందరును పురుషులె. బాలురు మొదలు వృద్ధులవరకు వివిధోద్యమములందు పాటుపడు చుండిన యా పురుష స్నేహితులు ఆయన ధర్మస్వభావము ప్రేమపూరిత మయి సాంక్రామికముగ హృదయమునుండి హృదయమునకు పరివ్యాప్తి జెందినటుల వ్యక్తపరచిరి. ఆయనకు స్త్రీలలోను మిత్రులు గలరు. ఆయన వారితో నెట్టి యుత్తమసఖ్యము నెరపి యే విధమున ప్రవర్తించి తత్సంబంధమయిన జీవనముద్వారా తన యాత్మ నెటుల వికసింప జేసికొనెనో, ధర్మము నెట్లు పెంపొందింప గలిగెనో ప్రత్యేకముగ విచారించుట యావశ్యకము గాన, ఆ విచారణ యిదివరలో నెత్తుకొనబడ లేదు. పురుషుడును స్త్రీయు పరస్పరసంబంధమునకు వచ్చునప్పుడు ప్రకటితమగు ధర్మమునకు ప్రత్యేకస్వరూప ముండును. బాపయ్యగారి విషయములో నది యేచందమున ప్రకాశించెనో

చూతము.

ఆయనకు ముఖ్యముగ మూడు విధములయిన ప్రేమ సంబంధములు బంధుకోటిలో ముగ్గురు నారీమణులతో నేర్పడి యున్నట్లు చదువరులు గమనించి యుందురు. వానిలో మొదటిది తన తల్లితోడను, రెండవది తన చెల్లెలితోడను, మూడవది తన భార్యతోడను, స్త్రీలయెడ కనపరుపబడు ప్రేమ వివిధముగ వ్యక్త మగుట సామాన్యముగ సర్వమానవుల యనుభవము. కాని కొందరది తమ విషయమున కేవలము మాతృప్రేమగా మారిపోయె నని చెప్పుదురు. వారి దృష్టిలో స్త్రీజాతిలోని వా రందరు తల్లులె. అట్టి స్థితికి వచ్చిన యీశ్వరభక్తులు గలరు. ఇటీవల కొందరపూర్వబుద్ధిమంతులు బయలుదేరు చున్నారు. వీరికి ప్రపంచములో నున్న ప్రతిస్త్రీయు ప్రణయసంబంధమున కన్పట్టును. మాత యని, సోదరి యని యేర్పడు సంబంధములు కూడ ప్రేమయొక్క యీ ప్రణయస్వరూపములో నమసి పోవునని వీరి యభిప్రాయము. సకల వనితలను మాతలవలె జూచు వారివలన సంఘమున కంతగా నష్టము లేదు గాని కలుగవలసిన లాభము మాత్రము లేకపోవును. వారు కుటుంబజీవనమున కేమాత్రము అవకాశ మీయరు. అవ్యాజ మయినట్టియు స్వార్థరహితమయినట్టియు నిర్మలప్రేమ భార్యాభర్తల నడుమను, మాతా

శిశువుల నడుమను, సోహోదరీసహోదరుల నడుమను సహజముగ పొడసూపి పెంపొందుటకు సాధనభూతముగ ఈశ్వరుడు కల్పించిన గృహస్థాశ్రమమునకు వారు ప్రతికూలు రయి శుష్కసన్న్యాసజీవనమును తాము గడపుచు నితరులకు ఆదర్శముగ జూపుదురు. ఈ జీవనము పూర్తిగ అస్వాభావిక మగుటచే వ్యాపింపజాలదు. అది గడపు వారిమూలమున నారీలోకమున కెట్టి తొందరయు లేదు. కాని స్త్రీల నందరిని కళత్రసంబంధమున గ్రహింప బూనిన రెండవ తెగవారు కనపరచు జీవనమును స్వభావమునకు విరుద్ధ మయినదై వర్ధిల్ల నేరక పోయినను, వారు సంఘమునందు అరాచకులు. పవిత్ర ప్రేమ దేవతకు ఆలయము లని చెప్ప నొప్పు గృహములను ధ్వంసము చేయుటయె వారి యత్నము. తన్మూలమున విశేషముగ కలిగెడు నష్టమును ప్రతిఘటించుటకు గొప్పకృషి యావశ్యకము. ప్రతిస్త్రీని తల్లివలెనే గాని లేక భార్యవలెనే గాని చూచుట రెండును అస్వాభావికములె. ప్రేమ ఏకమేవాద్వితీయ మగు సత్యముయొక్క ప్రకాశము. "ఏకం రూపమ్ బహుధా యః కరోతి." ఏకసత్యము నుండి వివిధవ్యక్తు లుత్పన్నము లవు చున్నవి. వ్యక్తులు విభిన్నము లయినవి గాన వానిలో పరస్పర మేర్పడు సంబంధములు విభిన్నముగా నుండును. ఆ వేరు వేరు సంబంధములందు

గానవచ్చు ప్రేమయు వేరు వేరుగా నుండును. రుచులు వేరు వేరు; కళలు వేరు వేరు; కాంతులు వేరు వేరు; అటులనె ప్రేమలును వేరు వేరు. ప్రత్యేకము పురుషులలో నుండునది సహిత మొక్క విధ మయిన ప్రేమ యని చెప్పుటకు వలనుపడదు. తండ్రి కొడుకు, అన్న తమ్ముడు, గురుడు శిష్యుడు, మిత్రుడు మిత్రుడు, యజమానుడు సేవకుడు, ఈ తీరున నెన్నియో విధముల ఒక పురుషుడును మరియొక పురుషుడును ప్రేమ సంబంధమందు గూడ్పబడుదురు. ప్రతి సంబంధమునందు కాన్పించు ప్రేమ యెప్పటికిని ఒక్కమోస్తరుగా నుండదు. ఆ విధముననె పురుషుడు స్త్రీలతో పొందెడు లేక పెట్టుకొనెడు సంబంధములందును ప్రేమ విభిన్నముగా నుండును. తల్లి యెడలను, చెల్లెలి యెడలను, భార్య యెడలను కనపరుపబడు ప్రేమలు ఒక్కమాదిరివి యని యెవ రనగలరు? ఒక ప్రేమకును మరి యొక ప్రేమకును నెంతయో వ్యత్యాసము కలదు. ఇటులనె యితరము లయిన ప్రేమసంబంధములును పురుషునకు స్త్రీలతో కలుగును. బాపయ్యగారు ప్రేమయొక్క యీ సహజ వైచిత్ర్యమునె తమ జీవితముద్వారా ప్రకటించిరి.

సాంఘిక పరిస్థితులను తన తల్లి తనకు దూర మగుట తటస్థించి నప్పుడు, ఆమె నెటులయిన తనతో జేర్పు మని ఆయన యీశ్వరుని సదా ప్రార్థించెను. తన చెల్లెలి యెడల

గాఢానురాగము కనపరచెను. ఆమె వియోగముచే ప్రాపంచిక జీవితముయొక్క యస్థిరతను సహిత మాయన గుర్తింపగలిగెను. భార్య చిన్నదే యయినను ఆమెను అమితముగ ప్రేమించెను. ఆమె విద్య విషయములోను అభివృద్ధివిషయములోను నెంతయో యాతురతను జూపెను. ఒక దిన మామె వద్ద ఆయన చాలసేపు గడపినప్పుడు, మాటలసందర్భములో, తన జబ్బుయొక్క స్వభావమును వివరించుచు తాను త్వరలోనె చనిపోవుట సంభవించినయెడల ఆమె తిరిగి వివాహము చేసికొనుట కిష్టము కలిగియుండె నేమొ తెలిసికొనగోరెను. "ఈశ్వరానుగ్రహమువల్ల మీకు ఆరోగ్యం కలిగి మీరె చిరకాలము జీవించియుండి ఎందువల్లనో అకస్మాత్తుగా నేను ఇప్పుడే చచ్చిపోతే మీరు మళ్ళా పెళ్ళి చేసుకుంటారా?" అని ఆయనభార్య మంగతాయమ్మగా రడిగిరి. ఆప్రశ్నకు జవాబుగా "నే నెన్నటికీ చేసుకోను." అని ఆయన చెప్పగా, "నేను మాత్రం చేసుకుంటానా?" అని ఆమె నుడివెను. ఆయన యేకపత్నీవ్రతదీక్ష కలవాడు. ఒకస్త్రీని భార్యగా గైకొనిన తరువాత, ఆమె జీవించి యున్నప్పుడును మృతిజెందిన తరువాతను కలకాలము ఆమెతో తప్ప నింకే స్త్రీతోడను భార్యాసంబంధమున మెలంగకుండుట యా దీక్షాపరుల ధర్మము. బాపయ్యగారు తన వివాహాదర్శమును

నోటిమాటలతో చెప్పుటయె గాక జీవితమునందు చక్కఁగా కనపరచెను. తదనుగుణముగ ఆయన తన భార్యను మిక్కుటముగ ప్రేమించి యుండుటచేత, ఆమెయు ఆయనయందు నధికానురాగము చూపగలిగెను. చిన్నతనమందుండుటచే, బుద్ధి దృఢముగ నుండక ఆమె పతివ్రతను కాపాడుకొన లేకపోవునేమో యను భయమువలన, ఆమె తిరిగి వివాహము చేసికొనఁ దలచిన చేసికొన వచ్చునని ఆయన తన సమ్మతిని తెలుపుచుండెను. ఉత్తమజీవనము గడపజాలక అధమజీవనములో పడిపోవుటకంటె పునర్వివాహము చేసికొనుట మధ్యరకపు జీవనముగా నుండునని ఆయన యటుల తెలుపుచుండెనే గాని ప్రతి స్త్రీయు ఒక భర్తను గోల్పోయిన తరువాత మరియొక భర్తను జేపట్టుట గొప్పధర్మముగా ఆయన యెంతమాత్రము భావించి యుండలేదు. పురుషులు బహువివాహములు చేసికొనుటయు ఆయన యుత్తమధర్మముగా నంగీకరింపడని ఆయన తనవిషయములో తనభార్యతో చెప్పిన మాటలవలన స్పష్టపడుచునె యున్నది. ఆయన తన భార్యకు పునర్వివాహస్వాతంత్ర్య మిచ్చియున్నను, ఆమె యథార్థప్రణయప్రేమను ఆయనవద్ద చవిచూచి యుండుటచే తిరిగి వివాహము చేసికొనక విశుద్ధవర్తనము కలిగి ఆయన చనిపోయినను ఆయనయందె తన హృదయమును నిలిపి నిరాడంబర

జీవనము గడపుచున్నది. ఆయన ప్రణయప్రేమయు అతిగభీర మయినదని ఆమెజీవితమె చాటుచున్నది. తాను తన మామ గారి యింటివద్దనుండి నట్లును, ఇతరులాడెడు మాటలు భరిం పజాలక తన భార్య సరిగా భోజనము చేయుటను కూడ మాని నట్లును, చేతనయిన ఆమె నోదార్చవలసిన దని ఆమె బంధువు లామెను తనవద్దకు పంపగా తా నామె నొంటరిగా గదిలోనికి తీసికొనిపోయి దయతో మాటాడి ఆమెకు సంతో షము కలిగించి నట్లును, ఒక నాటిరాత్రి ఆయన కలను గాంచెను. ఈ కల తన కేల వచ్చెనా తెల్లవారినది మొదలు అదే యోచనతో నుండెను. వేరే పనులమీద ఇల్లు విడిచి వెళ్ళి బయట ఆడిన మంతయు ఆయన గడపి సాయంకాలము ఇంటికి రాగా ఆరోజు తనకు వచ్చిన యుత్తరములలో నొకటి తన భార్యవద్దనుండి వచ్చినదియై నలుగురిలో తల యెత్తు కొనుటకే యామెకు చాల కష్టముగా నున్నదని రాత్రి కలలో తెలియవచ్చిన విషయమునె తెలుపు చుండెను. "May the dream be realized! May she be sent to me and may she be cheerful in my company."కలలో గాంచినది యిలలో జరగును గాక! ఆమె నా వద్దకు పంపబడి నాసాంగత్యమున సంతోషము బడయును గాక!—అని ఆయన దేవుని ప్రార్థించెను. ఆమె యుత్తరము వ్రాయుటయు, ఆ యుత్తరములోని సంగతులనె ఆయన కల గనుటయు నేక కాలమున జరుగుట వారిరువురమనస్సులు

పరస్పరాభిముఖములై యైక్యత జెందెననుటకు నిదర్శనముగా నున్నది.

"ఇక ఆయన యే యితరవనితలతో మెలగి యుండెనో వారిలో నొకరు శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు, పి. రామచంద్రరావుగారి భార్య. భార్యాభర్త లిరువురును వీరేశలింగము పంతులుగారు స్థాపించిన వితంతుశరణాలయములో పనిచేయుటకు రాజమహేంద్రవరమునకు వచ్చియుండిరి. ఆమెను తరచు కలసికొని శరణాలయ విషయములలో ఆయన యామెతో మాటాడవలసియుండెను. ఆయన కామెతో చాల పరిచయము కలిగెను. ఆమెనుగురించి తన కేర్పడిన యభిప్రాయము దినచర్యపుస్తకమున నీతీరున వ్రాసికొనెను.—

"శ్రీ పి. లక్ష్మీకాంతమ్మగారు నిజముగా గొంత సామర్థ్యముగల స్త్రీ. ఆమె యితరులకుభక్తినిపురిగొల్ప గలదు. ఆమె కీర్తన పాడుచుండగా విని యెవరు భక్తిశూన్యులుగ నుండ గలరు? ప్రతిహృదయమునందు భక్తిని చొప్పిల్లచేయు ఈశ్వరస్వరము ఆమెకంఠమునందు గలదు. పరమేశ్వరు డామెకు పరోపకారజీవనమును ప్రసాదించును గాక!" బాపయ్యగారు వ్రాసికొనిన యీ యనుభవము స్త్రీలయందు ప్రత్యక్షమగు ఈశ్వరమహిమను ఆయన చూడగలిగి యందునకు వారిని మెచ్చుకొనుటకు ప్రారంభించె నని సూచించుచున్నది.

ఆయన కలకత్తాకొక పర్యాయము వెళ్ళినప్పుడు, బ్రహ్మానంద కేశవచంద్రసేనుని తల్లిని సందర్శించెను. ఆమెను గురించి యీవిధమున వ్రాసికొనెను.—"వృద్ధురాలయి జబ్బుస్థితిలో నుండియున్నను, ఆమె భక్తితోడను ఉత్సాహముతోడను తేజరిల్లుచుండెను. నేను జీవితములో ననుసరించుచున్న ధర్మమును దృఢముగ నవలంబింపవలె ననియు, అది నా దేశీయులకు బోధింపవలె ననియు, ఆమె నాకు పూర్తిగా ధర్మోపదేశము చేసెను. ఆమె నన్నాశీర్వదించి ఫలహారము లొసంగెను. నే నామె ముందు సాష్టాంగపడి యితరుల కుపయోగపడు లాగున చిరకాల మామె జీవించునట్లు కటాక్షింపుమని యీశ్వరుని ప్రార్థించితిని." ఈ సందర్భము వలన, ధర్మప్రబోధము చేయగల వ్యక్తి స్త్రీ యయినను, ఆయనయొక్క సంపూర్ణ గౌరవమునకు పాత్రురాలై యుండె నని తెలియుచున్నది.

ఆయన కలకత్తాలో పండిత సీతానాథతత్త్వభూషణుల యతిథిగా నుండెను. వారి కుటుంబముతో అక్కడ నున్నంత కాలము స్వేచ్ఛగా మెలగుచుండెను. తత్త్వభూషణుల కుమార్తెలు ఆయనతో నెక్కువ సఖ్యము చేసిరి. వారాయనను బ్రాహ్మసమాజాదర్శములను గ్రహించినవా రనియు, * రాఖీ

* వంగదేశవిభజనానంతరము వంగదేశస్థులు ఐకమత్యసూచకముగా 'రాఖీ' సూత్రము ఒకరు మరియొకరి చేతికి ప్రతివత్సరము విభజనదినమున కట్టుకొనుచుపచ్చిరి. అదియె రాఖీదినము.

దినమున వారిలో చివరి అమ్మాయి పాకీపనిచేయు నొక యస్పృశ్యురాలయిన స్త్రీకి ప్రణమిల్లి రాఖీని కట్టి విశాల ప్రేమను కనపరచె ననియు, వినుటచే ఆయనకు వారందరి యం దెక్కుడు మక్కువ గలిగెను. ఆయన మ్యూజియమును జూలాజికల్ గార్డెన్సును, ఇతరస్థలములను వారితో కలసి వెళ్లి చూచెను. ఇంటివద్ద వారితో మాటాడుచుండెను. ౨౫-౧౦-౧౯౦౬ తేదిన జరిగిన సంభాషణమునుగురించి ఆయన యిట్లు వ్రాసికొనెను—"శ్రీలీలామాయి దత్తతో (తత్వభూషణుల ప్రథమపుత్రిక) చాలసేపు సంభాషించితిని. మన దేశముకొరకు పాటుపడుటకయి ఆమెను ప్రోత్సాహ పరచితిని. చివరభాగమున శ్రీ జ్యోతిమాయిదత్త కూడ రాగా, అది యవకాశము తీసికొని శాకాహారమునుగురించి యు దాని యవసరమునుగురించియు ముచ్చటించితిని. ఈ విషయములనుగురించి వారెక్కువగా తెలిసికొనునట్లును, సత్యమని తెలిసికొనిన దానిప్రకారము నడచుటకు తీర్మా నించుకొనునట్లును పరాత్పరుడు వారికి తోడ్పడును గాక!" ఈ ప్రసంగమువలన ఆయన సమయముచిక్కి నప్పుడెల్లను పురుషులకె గాక స్త్రీలకును దేశసేవయు ధర్మాచరణయు లక్ష్యములుగా చూపుచుండె నని తెలియుచున్నది. మాంస భక్షణము తగదని బాపయ్యగారు తలచెడు వారు. కలకత్తా

బ్రాహ్మసమాజికులు దాదాపు అందరు ధారాళముగ మాం సాహారము భుజించెదరు. అది చూచి శాఖాహారము యొక్క యావశ్యకతను వారికి కనపరుప యత్నించెను. ఆయన కలకత్తాను విడిచివచ్చుటకుముందు ౮-౧౧-౧౯౦౬ తేదిన ఆయన యిట్లు వ్రాసికొనెను—"ఇంటికి వచ్చినతరువాత సీతానాధబాబు కుమార్తెలు, శ్రీ లీలామాయినత్తోను, శ్రీజ్యోతిమాయినత్తోను మాటాడితిని. పవిత్రమును ఉత్తమ ము నయిన అనురాగముచే బంధింపబడి యత్యంతప్రేమా స్పదు లయిన యా సోదరీమణులను విడువవలసి వచ్చుచున్న దను తలంపువలన నిజముగా మనస్సునకు కష్టము కలుగు చున్నది. అట్టి వియోగములు జీవితములో అనివార్యములు. దయతో మమ్ములను దగ్గరగా చేర్చిన ప్రేమసాగరు డగు పరమేశ్వరుడె యేకగర్భమున జనించినవారివలె మమ్మెల్లరను సన్నిహితముగా బంధించునుగాక! మే మొకరి కొకడు నిజ మయిన సానుభూతిని హృదయపూర్వక ముగు ననుత్తమాను రాగమును జూపుచు సోదరసోదరీలవలె నుందుము గాక!" ఈ వాక్యములు పరయువతులతో గాఢమయిన సోదరప్రేమ యం దైక్యమగుట యెటు లుండునో సూచించుచున్నవి.

ఉన్నతవైద్యవిద్యను ఇంగ్లాండులో నభ్యసించి యం దుత్తీర్ణురాలయి మన దేశమునకు తిరిగివచ్చి వైద్యవృత్తిలో

కృషిచేయుచున్న శ్రీమతి కమలాకరుగారు ఆయనకు పరిచయ మయిన నారీమణులలో మరియొక ముఖ్యురాలు. ఆమెతో ఆయన చనువుతో చరించువాడు. ఆయన చికిత్స చేయించు కొనుచు చెన్నపురిలో నుండగా ఆమె ఆయనకు సేవ చేయు దినములలో నొకరోజు ౪-౨-౧౯౦౭ తేదిన ఆయన యిటుల వ్రాసికొనెను—"సోదరి కమలాకరుగారు తల్లికంటె కూడ నెక్కువగా నాకు కావలసిన వన్నియు చేసిపెట్టుచున్నారు. రోగపీడితు లగు సర్వమానవులయెడ ఆమె యిటువంటి యా దరణను సదా చూపునట్లు పరమేశ్వరు డనుగ్రహించును గాక! నాకు జూపబడు వాత్సల్యమునకు నే నర్హుడగునట్లు ఆయన కటాక్షించును గాక!" ఈమాటలు ఆయనయొక్క హృదయౌన్నత్యమును చాటుచున్నవి.

ఆయన మరియు ఉన్నవ లక్ష్మీనారాయణగారి భార్య శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు మొదలయిన నారీమణులతో కలసి స్నేహముతో చరించెను; వితంతుశరణాలయ నివాసి నులతో దగ్గరసంబంధమునకు వచ్చెను. అందరియందును ఆయనపవిత్రప్రేమనె చూపగలిగెను. ఆయన పురుషులతోడనె గాక నారీలోకముతోడను వివిధములయిన ప్రేమసంబంధముల పెట్టుకొని హృదయమును విపులమును పరిపక్వమును జేసి కొనెను; స్త్రీపురుషుల పరస్పరసఖ్యముద్వారానె జీవితము నిజ మయిన పరిపూర్ణత జెందగల దని చూపెను.

# జీవనస్మృతి

## ౧౫వ ప్రకరణము

### ఉద్యోగము

ప్రతివ్యక్తియు తనశక్తి ననుసరించి యేదో యొకవృత్తి నవలంబించిన గాని వ్యక్తిజీవనమును సంఘజీవనమును పెంపొందనేరవు. తన జన్మసాఫల్యమును తానేజాతియందు జన్మించునో ఆ జాతియొక్క యభివృద్ధిని తీవ్రముగ నభిలషించువారు సోమరితనమున కేమాత్రము అవకాశ మీయక తమ కర్హమయిన వృత్తిని జేపట్టి యందు శక్తు లన్నియు ధారపోయుదురు. బాపయ్యగారు ఉపాధ్యాయవృత్తికి తగియుందు మని నిశ్చయించుకొని యందు ప్రవేశించిరి. వృత్తిని పొట్టకూటి కని గాక పరమార్థ సాధనముగా నవలంబించువారు ఆవృత్తిద్వారా నెట్టి ధర్మవర్తన కనపరుప గలుగుదురో బాపయ్యగారి జీవితమువలన చక్కగా తెలియ గలదు.

దొరతనమువారి కొలువులో నుపాధ్యాయులుగా నుండుట కాయన మొదట ప్రయత్నించెను. ఆ ఉద్యోగ

వ్రాయబడిన ఆర్డరు ఆయనకు ౧౧—౧౧—౧౯౦౯ తేదిన
అందెను. నాడు ఆయన దినచర్యపుస్తకమున నిట్లు వ్రాసి
కొనెను. "తుట్టతుదకు నా యుద్యోగసంబంధ మయిన ఆర్డరు
వచ్చె నని నేటి సాయంకాలము అకస్మాత్తుగా వింటిని. ఇది
సంతోషదినము. ఇంత దనుక వలెనె యిక ముందును పరమే
శ్వరుడు తన సేవకుని నాశీర్వదించును గాక! ఆయన యిచ్ఛ
నెరవేరును గాక!" ఈ వ్రాసికొనిన దానిని బట్టి ఆ యుద్యో
గమున చేరినప్పుడు ఆయన తన పైవి యధికారుల సేవకుడ
నని గాక యీశ్వరసేవకుడ నని యెరిగియుండి యీశ్వరేచ్ఛ
తన జీవితమున నెరవేరును గాక యని కోరికొనినట్లు స్పష్టము.
ఎటువంటి యుత్తమాదర్శమో పరికింపుడు. అతిభక్తిశ్రద్ధలతో
నాటినుండి ఆయన తన యుద్యోగకార్యములను నిర్వర్తించెను.
ఒక నిమిష మయినను ఆయన వ్యర్థముగ పోనియ్య లే దను
టలో నతిశయోక్తి లేదు. నిద్రాహారసమయములు పోగా
తక్కిన యన్ని వేళలయందు ఆయన యేదో యుపయోగకర
మయిన పని చేయుచుండెను. కొన్ని గంటలింటివద్ద పని
చేసిన గాని, ఒక గంట కాలేజీలో లెక్చరిచ్చుటకు వీలు
లేదని ఆయన చెప్పెడువాడు. ఉద్యోగవిషయమున అంతగా
కృషి సలిపెను. ఎన్నియో యితర విధులు నిర్వహించుచు
స్వయముగా వంట చేసికొనుచు ఆయన కాలేజిపని నిమిత్త

మంత కష్టపడుట ఆశ్చర్యకరము. కాని వృధాకాలక్షేపము చేయకుండ పాటుపడుట ఆయనజీవితములో ముఖ్యముమీద నున్న యొక ప్రధాన లక్షణము. ప్రస్తుతము ఆంధ్రా యూని వర్సిటీ వైస్ చాన్సెల్లరుగా నున్న కట్టమంచి రామలింగా రెడ్డిగారితో ఆయన యొకరోజున మాటాడుచు విశ్వవ ముఖ్యమయిన పని కలిగియుండుటచే వారివద్దకు వెళ్ళుటకు వీలులేక పోయెనని చెప్పెను. "My dear man, do not care for personal relations so much. Do your duty first and then if you have time and energy, you may attend to friends and such affairs."- "ప్రియమిత్రుడా, స్నేహసంబంధముల నంతగా లక్ష్యపెట్ట కుము. నీ విధికృత్యము ముందుగా చేసికొనుము. తరువాత నీకు కాలము, ఓపిక ఉండిన, స్నేహితులనుగురించి అట్టి యితరవిషయములనుగురించి విచారించుకొనవచ్చును." అని రామలింగా రెడ్డిగారు నుడివిరి. ఈమాటలయం దెంతయో సత్యము కలదని బాపయ్యగారు వానిని తన దినచర్యపుస్తక మున వ్రాసిపెట్టుకొనిరి. అట్టి కార్యతత్పరతగల బాపయ్యగా రుద్యోగకార్యములం దేమిలోటు లేకుండ పాటుపడి రని వేరుగ వ్రాయ నక్కరలేదు. ఆయన విద్యార్థులను సులభ ముగ వశపరచుకొన గలిగియుండెను. బోధనాభ్యాసనకళా

శాలలో ఆయన ఎల్. టి చదువునప్పుడె ఆయనకున్నయా శక్తిని కనబడె ననియు, ఇతర ఉపాధ్యాయులదగ్గర అశాంతముగా అల్లరిచేయు పిల్లవాండ్రు ఆయన చదువు చెప్పుటకు రాగానె నిశ్శబ్దముగ నుండెడువా రనియు, ఆయన యొక్క ప్రశాంతత కృపావీక్షణములును మృదుమధుర వాక్కులును సమ్మోహనాస్త్రులవలె నెట్టి దుడుకువాండ్రనైనను లోబరచుకొన గలిగియుండె ననియు, ఆ రోజులలో ఆ కళాశాలలో విద్యార్థిగా నున్న డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు చెప్పుచున్నారు. కళాశాలలో పనిచేయుచున్నంతసేపు మాత్రమె గాక తక్కిన సమయములం దెప్పుడు పట్టిన అప్పుడు విద్యార్థులు తనవద్దకు వచ్చుటకు ఆయన యవకాశ మిచ్చెను. ఆయన భోజనముచేయునప్పుడు కూడ ఆయనచుట్టును విద్యార్థులు కూర్చుండి స్వేచ్ఛగా ఆయనతో మాటాడుచుండిరి. చదువువిషయములోనె గాక వారి వర్తనవిషయములోను ఆయన వారికి సలహా చెప్పుచుండెను. విద్యార్థు లాయన యందు చాల యిష్టము కలిగియుండిరి. బి. ఏ తరగతులకును ఆయన బోధించుచుండుటచే, ఆయనయం దభిమానము గల బాలుర సంఖ్య విశేషముగా నుండెడిది. ఈ విధముగ నంతయు చక్కగా నడచుచుండెను.

కాని ప్రతికూలపరిస్థితు లేర్పడ జొచ్చెను. అవి

యెట్లు ప్రారంభ మాయనో, వానినిగూర్చి బాపయ్యగా రెట్లు తలపోసిరో, ఆయనయె యీ తీరున ౧-౮-౧౯౦౬ తేదిన వ్రాసికొనెను—"నా యుద్యోగము ఖాయపరచుటకు సిఫారుసు చేయుడని అడుగుటకు నాతరఫున గణపతి అయ్యరు గారు హంటరు దొరగారివద్దకు వెళ్లిరి. సంఘసంస్కరణ విషయములో నేను జోక్యము పెట్టుకొనుచున్నందులకు నన్ను గురించి చాల యతృప్తితో హంటరు దొరగారు మాటాడిరట. డబ్బు పుచ్చుకొనుచున్న పనియందు మనుష్యుడు పాటుపడవలెను. ఆయన మొదట ఎమ్. ఏ ప్యాసు కావలెను. ఉద్యోగము ఖాయమగు నని, ఆయన అంతవరకు తలంపగూడదు. సంఘసంస్కరణమునుగురించి గాని వక్రపద్ధతులను సరిచేయుటనుగురించి గాని ఆయన అంతకు ముందుగా యోచింపనె గూడదు." అనియు నీదోరణిలోనె మరికొన్ని మాటలును హంటరుదొరగారు చెప్పినటుల వింటిని. కొందరు జనుల యభిప్రాయము లెంత వికృతముగా నుండును! తాను చేయగల పనులలో ఉద్యోగసంబంధమయిన పని యొకటి మాత్రమె యని మానవుడు తెలిసికొన లేకున్నాడు. న్యాయము తెలిసికొనుటకును, తదనుగుణముగ నడచుకొనుటకును అవశ్యమయిన యింగితమును పరమేశ్వరుడు నా కనుగ్రహించునుగాక!" హంటరుదొరగారితో ప్రారంభమయిన యీ

సంఘర్షణ ముదిరినది. ౨౫-౮-౧౯౦౬ తేదిన బాపయ్యగారిట్లు వ్రాసికొనిరి.—"ఆర్ట్సుకాలేజిలో నున్న నా యుద్యోగము విడిచి ట్రైనింగుకాలేజిలో నలుబదిరూపాయల జీతముగల పనిని ఒప్పుకొనవలసిన దని హంటరుదొరగారు నన్ను కోరిరి. అట్టి చపలచిత్తులైన యధికారులనుండి నన్ను పరమేశ్వరుడు దూరముగ నుంచును గాక! ఆత్మగౌరవమును, ఆత్మనిర్భరతను ఆయన నాకు నేర్పును గాక!" మరుసటిదినము ౨౯-౮-౧౯౦౬ తేదినఇట్లువ్రాసికొనిరి.—"ట్రైనింగు కాలేజీకిపోవుటకు నేను సమ్మతింప జాలనని హంటరుదొరగారితో చెప్పితిని. దొరగారు నాయెడ సానుభూతి కనపరచి సబ్ అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు ఉద్యోగమునకో లేక ఇంకొక చోట నేపనికో సిఫారుసు చేసెద నని చెప్పిరి. ఈశ్వరుడు నన్ను ఆశీర్వదించును గాక!" మూడవ అసిస్టెంటుగా ట్రైనింగుకాలేజిలో ఖాయపరుపబడినట్లు తనకు తెలిసి ౨౧-౯-౧౯౦౬ తేదిన ఇట్లు వ్రాసికొనెను.—"ఇది నిజముగా, నాకు గొప్ప న్యూనత. అరువది రూపాయలకు పని చేయుచుండగా, ట్రైనింగుకాలేజినుండి అంతకంటె నున్నతమయిన పని చేయుటకు ఏబదిరూపాయలకు ఆర్ట్సుకాలేజిలోనికి తీసికొని ఇప్పుడు తిరిగి ట్రైనింగుకాలేజికి నలుబది రూపాయలపనికి పంపుట నన్ను హీనముగ జూచుటయె. ఈ విషయములో

నన్ను ఈశ్వరుడు పరీక్షింపదలచినట్లు కాన్పించుచున్నది. ఆత్మగౌరవమునకు భంగము లేకుండ సగౌరవముగ మెలగుటకు నాకు శక్తిని ప్రసాదించును గాక!" వీరేశలింగము పంతులుగారికిని, వెంకటరత్నము నాయుడుగారికిని బాపయ్యగారు తన యీ మనోభావములను వ్యక్తపరచిరి. వారిరువురును ఆయన తలచునట్లు ఆ యుద్యోగము నిరాకరించుటయె విధి యని చెప్పిరి. ౨౯-౯-౦౬ తేదిని ఆయన ప్రిన్సిపాలుద్వారా డైరెక్టరుకు పెట్టిన అర్జీని హంటరుదొరగారికి పంపిరి. అది తనుద్వారా పంపుట కంగీకరింపమనియు బాపయ్యగారె స్వయముగా పంపుకోవలె ననియు తెలుపుచు అమర్యాదగా దొరగారు ఆయన కొక యుత్తరము వ్రాసిరి. అది చూచి "It is strange how people can smother their conscience." 'మనుష్యులు తమ మనస్సాక్షిని ఎట్లు చంపుకొనెదరో అది చిత్రము.' అని ఆయన భావించెను. కాని తమ యంతరాత్మను తమపీలునకు తగినట్లు త్రిప్పుకొనగలవారికి ఆయన మాటలె చిత్రముగా నుండును! ౩౦-౯-౧౯౦౬ తేదిన ఆయన తన అర్జీని డైరెక్టరుకు స్వయముగా పంపి ట్రైనింగుకాలేజిలోని యుద్యోగము తన కక్కర లేదని హంటరుదొరగారితో చెప్పెను. ఆరోజున ఆయన తన దినచర్యపుస్తకములో

వ్రాసికొనిన * యంశములు ఇదివరలో నొక సందర్భమున తెలుపబడినవి. ఆ మరుచటి దినము ఆయన యిట్లు వ్రాసికొనెను—"I met Mr. Hunter in the college and took leave of him. He said he would have done something for me if I had not sent in my petition to the Director. May God teach me to live an honest and self-respecting and dignified life, despite all consequences! Let Truth always guide me and let my ideals be always high." "కాలేజిలో హంటరు దొరగారిని కలసికొని వారి వద్ద సెలవు పుచ్చుకొంటిని. డైరెక్టరుకు నా అర్జీని నేను పంపకుండిన యెడల, నా కేమయిన సాయము చేసియుందు నని వారు చెప్పిరి. ఎన్ని విధములయిన కష్టములు వచ్చినను, న్యాయమయినట్టియు, ఆత్మగౌరవమునకు భంగము లేనట్టియు, ఉత్తమ మయినట్టియు జీవితమును గడపుటకు పరమేశ్వరుడు నన్ను ప్రబోధించును గాక! సత్యము నన్నెల్లప్పుడు నడపును గాక! నా యాదర్శములు సదా యున్నతములయి యుండును గాక!" ఈ వాక్యములవలన బాపయ్యగారు సంపూర్ణముగ ఈశ్వరాధీనవర్తను లయి సత్యముకొరకే జీవింప నెట్లు సిద్ధపడిరో తేటతెల్లమగుచున్నది.

---

* ౭౬ పుటను చూడుడు.

• పరమేశ్వరుడు ఆయనకు పూర్ణాయుర్దాయ మిచ్చి యున్న యెడల,• గవర్న మెంటుకాలేజిలో నుద్యోగము మానిన తరువాత ఆయన యేవృత్తియందు జేరి పాటుపడి యుండునో నిర్ధారణచేయుట కష్టము. అయినను ఆయన మనోగతినిబట్టి యది కొంత యూహించుకొన వచ్చును. అట్టి యూహ చదువరులకె విడిచి, ఆ సంబంధమయన భావములు కొన్ని సందర్భములలో వ్యక్త మయి దినచర్యపుస్తకములో ఆయన వ్రాసికొనినలాగున తేదీలవరుసను ఇచట పొందుపరుపబడును.

౧౦—౨—౧౯౦౭ :—"తలవని తలంపుగా నేను గోవిందనుగారిని కలసికొనుట తటస్థించెను. మెడ్విలి స్కాలరు, జి. సుబ్బారావుగారివద్దనుండి వచ్చిన యుత్తరమును వారు నాకు చూపి మెడ్విలికి వెళ్ళుటకు నా కిష్టము కలదా యని ప్రశ్నించిరి. అదియొక యీశ్వరాహ్వానముగ నాకు దోచెను. నా యారోగ్యము చక్కబడినయెడల వెళ్ళవచ్చునని బదులు చెప్పితిని." ధర్మప్రచారకులుగ నుండదలచు వారికి వేతన మొసంగి రెండు సంవత్సరములు బ్రహ్మవిద్య గరపుటకు అమెరికాలో మెడ్విలిపట్టణమున నొక యూనిటేరియను క్రైస్తవుల సంస్థ గలదు. చెన్నపురిలో బాపయ్యగారు గోవిందనుగారిని కలసికొని నప్పుడు వచ్చిన ప్రస్తావన యీ

సంస్థవిషయములోనె.

౧౧—౨—౧౯౦౭:—"సి. రామలింగా రెడ్డిగారితో ఉదయము గడపితిని....నేను బరోడాకు వచ్చి తమకు ప్రయివేటు సెక్రటరీగా నుందునా యని రామలింగా రెడ్డి గారు అడిగిరి. ఎల్లప్పటికి గాని కొంతకాలమువరకు గాని యచట నుండి తమకును గైక్వారుగారికిని సాయము చేయ వలసిన దని వారు నన్ను అడిగిరి. ఓ యీశ్వరా ! ఈప్రాపంచికసామన్యవిషయములను గానికులాసాగా గడచెడు జీవితమును గాని నే నాసింప కుండునట్లు చేయుము. రాజ మహేంద్రవరములోని మా యుద్యమముకొరకు నన్ను పాటు పడ నిమ్ము."

౧౧-౨-౧౯౦౭:— « వీ రేశలింగము పంతులుగారి వద్దనుండి వచ్చిన యుత్తరమును ఇంటికి వచ్చి చూచుకుం టిని. అందు తెలుపబడిన శుభభవితవ్యమునకు పరమేశ్వ రుని కొనియాడుచున్నాను. పిఠాపురము మాకు చాల తోడ్పడ నున్నది. ఆర్. వి. ఆర్ గారు (రఘుపతి వెంకట రత్నము నాయుడుగారు) మాకొరకు కృషి సలుపుచున్నారు. వారు పంతులుగారి కిట్లు వ్రాయుచున్నారు. «నే నిది పిఠా పురమునుండి వ్రాయుచున్నాను. ఆస్తికోన్నతపాఠశాలను గురించి నేను మన రాజాగారితో మాటాడినాను." ఈశ్వ

రుని యిచ్ఛయు అనుగ్రహమును ఉన్నయెడల డబ్బువిషయములో మీకు ఆదుర్దనుండ నక్కరలేదని చెప్పుటకు రాజాగారు నా కనుజ్ఞ నిచ్చిరి......" ఇందునకు పరమేశ్వరునకు ధన్యవాదములు. నిజముగా నా సంతోషము అమితముగా నున్నది. ఈశ్వరుడు మ మ్మాశీర్వదించి తక్కినదియు నెరవేర్చును గాక! నా యారోగ్యముకొఱకు పాటుపడుటకును, ఈ ప్రపంచమున ఆయనసేవ చేయుటకును, ఆయన నాకు సరియయిన త్రోవను చూపునుగాక!" బాపయ్యగారు వ్రాసిన యీ మాటలు ప్రస్తుతము రాజమహేంద్రవరములో నెలకొనియున్న శ్రీ వీరేశలింగాస్తికోన్నతపాఠశాలను మొదట స్థాపించుటకై జరిగిన యాలోచనలకు సంబంధించి యున్నవి.

౨౩-౮-౧౯౦౭ తేదిన బాపయ్యగారు రాజమహేంద్రవర జాతీయపాఠశాలయందు అభిమానము కనపరచుచు దినచర్యపుస్తకములో వ్రాసికొనిన విషయములు,*ఇంతకుముందు నొకచో తెలుపబడినవి, చదువరులు జ్ఞప్తియం దుంచుకొని యుందురు.

బాపయ్యగారి జీవితము ఈశ్వరున కర్పితమాయెను. ఈశ్వరు డేసమయమున కెందులకు ప్రేరేపించిన, అది చేయుటకు ఆయన సిద్ధపడి యుండెను. తన సమస్తమును ఈశ్వరుని హస్తగతము చేసెను.—

*౧౧౫ వ పుటను చూడుడు.

# జీవనస్మృతి

## ౧౬ వ ప్రకరణము

### జీవితఫలములు

నిజమయిన స్వాభివృద్ధియొక్క ఫలములే, పరోపకార కార్యములు. ఇతరులతో సంబంధము లేక తనకు తాను జీవించు స్వార్థపరాయణుని అభివృద్ధి కేవలము తత్కాలికము; నిష్ఫలము. యథార్థమగు ఔన్నత్యము జెందిన మానవుడు పరులతో నైక్యత జెంది పరోపకారజీవనము గడపును. బాపయ్యగారి యున్నతమగు ప్రేమ జీవనమునుండి పరులకు లభించిన ఫలము లెవ్వియో విచారింతము.

బాపయ్యగారు ప్రార్థనశీలురు గదా? ప్రతిదినము నిత్యప్రార్థన చేసికొనుటయె గాక విశేష సమయములందు ప్రత్యేకప్రార్థనలు కూడ సలిపి ఆయన తన జీవితము వృద్ధి నొందించుకొనెను. సంవత్సరాది దినమున "ఈ యేడు పాటు పడుటకు పరమేశ్వరుడు నాకు శక్తిని ప్రసాదించును గాక!" యనియు, కాలేజి తెరువబడిన రోజున "నాయుద్యో గ కార్యములను తృప్తికరముగ సదుద్దేశముతో నిర్వర్తించు

టకు పరమేశ్వరుడు నాకు తోడ్పడును గాక!" యనియు ముఖ్యమయిన యుత్తరములు వ్రాసినపిదప "దేవా! నీయిచ్ఛ యయినయెడల నా ప్రయత్నములను ఫలింప జేయుము." అనియు, ఇటులనె యితరముఖ్య తరుణములయందును ప్రార్థనలు చేసికొనుట కాయన యలవడి యుండెను. తన విషయమున ప్రార్థనల ప్రయోజన మెరిగియుండెను; తనకొరకు ప్రార్థించినటులనె, యితరులకొరకును ప్రార్థించెను. ఆయన యెవరి యభివృద్ధి నభిలషించెనో, వారికొరకు ప్రార్థనలు చేసెను. రాజమహేంద్రవరములో అనుష్ఠానజీవనము గడుప నారంభించిన మిత్రులు వెనుకంజ వేయుచు సమాజోపాసనలకె వచ్చుట మానినప్పుడు, " వారికి కలుగుచున్న పరిశోధనలయందు సర్వశుభప్రదాత వారిని కాపాడి వారు కష్టములను సరకుసేయక ధర్మ మనసరించునట్లు చేయును గాక! సమాజమును త్రోసి పుచ్చుటవలన వారి మనస్సులందు నుత్సాహాగ్ని వెలుగునట్లు చేయు సాధనమునె కోల్పోవుదురు కాన వారు సమాజమును విడువ కుండునట్లు చేయును గాక!" యని ఆయన ప్రార్థించియుండెను. త్రికరణశుద్ధితో ఆయన చేసిన యీ ప్రార్థన చాలవరకు ఫలించెను. పాలపర్తి నరసింహముగారు బ్రాహ్మధర్మ మనుసరించి అనుష్ఠానజీవనము మొదలిడి రని వినినతోడనె "చాల కాలమునుండి అతడు

పొంద నన్వేషించుచుండిన మనోశాంతియు తృప్తియు పరమేశ్వరు డాతనికి కటాక్షించును గాక! ఈశ్వరుని దయవలన పరిశోధనలం దాతడు సంరక్షింపబడును గాక!" యని ఆయన దేవుని వేడుకొనెను. కవికొండల సాంబశివరావుగారు బ్రాహ్మధర్మ దీక్ష గైకొని రని తెలిసి ఆయన యీశ్వరునకు స్తోత్రవందనము లర్పించెను. ధర్మమార్గమున నడువ బూనిన వారికి తన ప్రార్థనల ద్వారా ఆయన చేయూత నొసంగ యత్నించెను. ఆత్మలు పరస్పర సంబంధము కలిగి యున్నప్పుడు, ఒక యాత్మయొక్క యిచ్ఛయు ప్రార్థనయు మరియొక యాత్మమీద నేల పనిచేయకుండును? పెదవులతో చేయబడు ప్రార్థనలు హృదయమును పురిగొల్ప జాలవు. హృదయమునుండి వెలువడు ప్రార్థనలు హృదయమును కదల్చి వేయును. బాపయ్యగా రెవరివిషయమున ప్రార్థించెనో, వారితో నొకటి యయి వారిని గురించి తీవ్రముగ చింతనము చేయువారు. వారినిగూర్చి కలలను గూడ కనువారు. నేను ధర్మజీవనమున వెనుకంజ వేసితి నను సమాచారము వినక ముందె ఆయన యది * కలగనెను. ఆ సంగతిని తరువాత

* ౧౩౧ వ పుటయందు, ఆయనకు వచ్చిన యిటువంటి మరియొక స్వప్నమునుగూర్చి వ్రాయబడెను. అవి యెట్లు సాధ్యము లయ్యెనో మనోతత్వ పరిశోధకులు నిర్ణయింపవలసిన విషయము.

విని ఆయన యత్యంత వేదనము నొంది సంపూర్ణవిశ్వాస మతితో నన్నుద్ధరింపు మని యీశ్వరుని ప్రార్థించిన ప్రార్థ నలు ఆశ్చర్యకరములు. "దీని యర్థ మేమయి యుండును? తిరిగి మార్గమునకు రానంతగా అతడు తొలగి పోయెనా? సర్వ కారుణికుడైన పరమేశ్వరుడు ఆతనికి ధర్మమేదియొ చూపి దాని ననుసరించుటకు శక్తిని ప్రసాదించును గాక! కలత జెందిన యాతని యాత్మకు శాంతి కలుగు గాక!" యనియు "ఆతడు క్రమేణ దృఢత్వము చూప గలుగుచున్నాడు. పర మేశ్వరు డాతనికి ధైర్యస్థైర్యము ననుగ్రహించును గాక!" యనియు, ఆయన ప్రార్థనలు చేసియుండెను. నాకు తెలియ, కుండ సలుపబడిన యీ ప్రార్థనకె నన్ను నేను కాపాడుకొన లేని యవస్థలో గాచియుండు నని తలచెదను. ఆయన తాను ప్రేమించిన వారెల్లరికి శుభము చేకూరుటకు దైవప్రార్థనలు చేసెడువాడు. మునగాల జమీందారు శ్రీ రాజా నాయని వెంకట రంగారావు బహద్దరుగారు ఆయనను చూచుటకు వచ్చి యొకరోజు ఆయునతో గడపిరి. వారికి నుచిత సత్కా రములు గావించి "దేవుడు వారికి చిరకాల మిట్టి సచ్చింతను ఉన్నతాదర్శములను ప్రసాదించును గాక!" యని ప్రార్థిం చెను. తన యాప్తుల విషయమున ఆయన యీశ్వరుని సమ

త్నమున వెలువరించిన యభీప్సితములు వ్యర్థముగ పోలే దని నుడువుటకు శంకింప నక్కరలేదు. ఆయన యెవరికొరకు ప్రార్థించెనో వారు కేవలము శక్తివిహీనులును క్రియాశూన్యులును నయినవారనియు, ఆయనప్రార్థనల మూలముననె వారి యందు క్రొత్తగ శక్తిసామర్థ్యములు పొడసూపి క్రియాశీల ముద్భవిల్లె ననియు చెప్పుట సరి గాదు; కాని ఆయన ప్రార్థనలు వారి శక్తుల నినుమడింప జేసి వారిని కార్యదక్షులనుగ నొనర్చినవి. నమ్మ దగియున్నది. మరియు వ్యాధిపీడితుల కొరకును, దుఃఖభాజనులకొరకును, అనాథలకొరకును, అసహాయులకొరకును ఆయన ప్రార్థనలు గావించెను. అవియు సఫలీకృతము లయ్యెనని విశ్వసించుటకు దృష్టాంతములు గలవు. బాహ్యమునకు గాన్పింపని ప్రార్థన పూర్వకమగు నిట్టి మానసిక సేవ ఆయన జీవితఫలములలో నగ్రగణ్యమయినది.

ఒకరోజు చెన్నపురిలో ఆయనయు, ఆయన పినతండ్రియయిన కృష్ణయ్యగారి బావమరిది, కొమరవోలు హనుమంతరావు గారును ఇద్దరు కలసి, ట్రాముబండిమీద నెచటికో పోవుచుండిరి. ట్రాము బండ్లను నడపువారు ఆ దినములలో చాల మోసము చేయుచు కంపెనివారికిని, ఏలయినప్పుడు ప్రయాణికులకును, ద్రవ్యనష్టమును కలిగించు చుండిరి. పోవల

సిన దూరమునకు రెండు అణాలు పుచ్చుకొనవలసియుండిన, ప్రయాణము చేయువారివద్ద ఏడు కానులు మాత్రమె పుచ్చుకొని ఆరు కానుల టికెట్టును వారిచేతిలో పెట్టుచుండెడు వారట. ప్రయాణికులకు కూడ కొంచెము లాభము కలుగుచుండుటచే, వారు ట్రాంబండ్లు నడుపువారి యన్యాయమును చూచియు చూడనట్లూరకుండుచు వచ్చిరి. ఈ విధమయిన దగా అపరిమితముగా జరుగుచుండెను. బాపయ్యగారు ఆ నాడు మామూలుగా నియ్యవలసిన డబ్బును ట్రాముబండిలో టికెట్ల నమ్మువాని చేతిలో పెట్టగా, వాడు ఒకటియో రెండో కానులు తిరిగి యిచ్చి అంతకంటె తక్కువ సొమ్ము టికెట్టును ఆయన చేతిలో పెట్టెను. 'ఇదేమిటి?' అని ఆయన అడిగెను. 'ఊరుకోవయ్యా. నీ కెందుకూ?' అని బదులు చెప్పి వాడు వెళ్ళి పోవుచుండెను. ఆయన కేకలు వేసి వానిని పిలిచి వాని పేరును నెంబరును తెలిసికొని కంపెనివారికి రిపోర్టు చేసెదనని చెప్పెను. అది యంతయు పెద్ద గోలక్రింద తయారయ్యెను. బండిలోనున్న వారందరు ఆశ్చర్యపడు చుండిరి. ప్రక్కన కూర్చుండిన హనుమంతరావుగారు ఆయన లేనిపోని తొందర కొని తెచ్చుకొను చున్నాడని తలపోయుచుండెను. ఆ సందర్భమున తాను చేయవలసిన పనియంతయు చేసెను. ఇటులనె అన్యాయమును అక్రమమును ఆయన చూచినప్పు డెల్ల ఏదో

ప్రతీకారము చేయక యూరకుండు వాడు కాడు. బాపట్ల గ్రామమందు తిరణాల రోజులలో జూదపు బల్లలు పెట్టి జనుల వద్ద డబ్బు లాగుచున్న మోసగాండ్రను ఆయన యొక పర్యాయము చూచుట తటస్థించెను. తన మిత్రులతో డ్వాటుతో ఆబల్లలను తీయించి వారిమీఁద రిపోర్టు చేసెను. చిన్న విషయములలో కూడ అధర్మము తొలగించుటకు ప్రయత్నమావశ్యకము. ప్రయత్నము లేని మాటలు నిరుపయోగములు. బాపయ్యగారి వర్తనము ధర్మవిషయమున సదా దృష్టాంతముగా నుండెడిది. ఆయన యనుదినవర్తనమె ప్రార్థన తరువాత వేరొకని దగిన ముఖ్యఫలము.

సింగళి లక్ష్మీనారాయణగారు బాపయ్యగారినిగురించి తెలిపిన యీ క్రింది యంశములు గమనింపదగినవి.—"నాకు ఆయనతో పన్నెండు సంవత్సరములు మైత్రిగలదు. నాకుగల కఠినవాక్కును మార్చవలె నని మిక్కిలి ఓపికతో నేను తనతో చెప్పు వాక్యములను మార్చి తన భావప్రకటనలో నెట్లుండెనో చెప్పుచుండెను. వాఁడు దుర్మార్గు డని నేను చెప్పినచో వెంటనే 'వాఁడు మంచివాడు గాడని చెప్పరాదా' యని ప్రశ్నించును. అది అందవికారముగా నున్నదని నేను చెప్పినప్పుడు తాను దిద్ది "దానియందము నాకు తెలియుట లేదని చెప్పు" మనియెను. ఇట్లు సంవత్సరముల

కొలది యత్నించెను. కాని నా స్వభావమును మార్పలేక పోయెను. కంటి చూపునందు, నోటి మాటయందు, అవయవముల కదలికయందు, ప్రేమ ఒలుకుచుండవలె నని ఆయన పట్టుదల. నే నిప్పటికి ఆయన క్రియాసూత్రముల నభ్యసించుచుంటిని గాని ఆయన సుశీలత, ఆయన వ్యక్తిత్వమందు నెడతెగక చూడనగు ప్రేమవాక్యములు, ముద్దుపలుకులు, మురిపెంపుచిరునగవు, నా కలవడ లేదు. అవి కోరిన మాత్రమున కలుగవు. ఈశ్వరకటాక్షముచేతనే సంప్రాప్తమగు నని తోచినది......హృదయవిద్యను (heart-culture) మన యాంధ్రులలో మొట్టమొదటగా బోధించి జీవించి చూపిన వారు బాపయ్యగారు. జ్ఞానధీరుడు, ప్రజాసేవా తత్పరుడు, మోహపంకిలమున చిక్కుకొనని అపురూప మగు విశుద్ధాత్ముడు." లక్ష్మీనారాయణగారు వ్రాసిన యీవచనములు బాపయ్యగారి చెలిమి చేసిన వారెల్లరు తమ యనుభవమునుబట్టి కూడ పరమసత్యము లని చెప్పగలరు. బాపయ్యగారి చూపులు, మాటలు, కదలికలు ధర్మప్రబోధకములయి యితరుల హృదయపరివర్తనమునకు తోడ్పడె నని వారి స్నేహితులందరు సాక్ష్య మియ్యగలరు. ధర్మము మధువు వంటి దని పెద్దలు చెప్పుదురు. మకరందముకొరకు తేనెటీగలు మూగునట్లు ధర్మముకొరకు జనులు చేరుదురు. బాపయ్య

గారు పలువుర నాకర్షింపగలుగుటకు ఆయన మాటలు ధర్మపూరితము లయి మధురముగ నుండుటయె కారణము. ఉపన్యాసవేదికలపై నెక్కి గంభీరోపన్యాసము లొసంగగలిగిన వారు అనుచరులను కలిగియుండ కుండుటను తరచు చూచుచుందుము. అందులకు హేతువు వారియందలి ధర్మాభావమె. ధర్మప్రచారమునకు శుష్కదీర్ఘోపన్యాసము లక్కఱ లేదు; ప్రేమతో కూడిన యొక్క పలుకు చాలును. బాపయ్య గారి మధురసంభాషణములు ఆయనదరి చేరిన ప్రతిపురుషుని స్త్రీయును నిరంతరము పొందుచుండిన ఫలము లని చెప్పవచ్చును.

బాపయ్యగారు సభాభవనములందు ఉపన్యాసములు కూడ నిచ్చియుండిరి; ఉపన్యాసమందిరములందు ధర్మోపదేశములను జేసిరి. అవియు నత్యంతోపయుక్తములుగ నుండెను. ఆ ప్రసంగములు ఆయన జీవితాదర్శములనె వెలిబుచ్చుచు ధర్మోత్సాహమును పురిగొల్పి యుండెను. బాపట్ల, బందరు, గుంటూరు, నర్సారావుపేట, రాజమహేంద్రవరము, కాకినాడ, విశాఖపట్టణము, చెన్నపురి మొదలగు పట్టణములలో, సాంఘికపారిశుద్ధ్యము, సద్వర్తనము, స్వీయసంస్కరణము, విద్యార్థుల విధులు, స్వదేశవస్తుప్రోత్సాహము, సర్వతోముఖ సంస్కరణము, ఐకమత్యము, బ్రాహ్మధర్మము, భక్తి, నీతి

మొదలగు విషయములనుగురించి ఆయనయొసంగిన యుపన్యా సములు విని వారు వానిని నేటివరకు స్మరించునంతగా వారి హృదయములందు నాటుకొనెను. యువకులు కోమల హృదయు లగుటచే ఆయన బోధించిన సత్యములు సులభము గ గ్రహించి యుత్సాహపరవశు లగుచుండిరి. బాపట్ల యువ జనులు కనపరచిన యుత్సాహము తారా_ణముగ నడువ వచ్చును. బాపయ్యగారు చెన్నపురికి పోవుచు వచ్చుచు నచట నాగునప్పుడు తరచుగ ఉపన్యాసముల నొసంగి విద్యార్థులయందు సంచలనము కలిగించు చుండిరి. ఒకతూరి ౨౬-౧-౧౯౦౭ తేదీన కలిగిన కదలికను గురించి ఆయన యిట్లు దినచర్యపు స్తకమున వ్రాసికొనెను-"పురమందిరమున తెలుగులో ఈశ్వ రోపాసన జరిపి "బ్రాహ్మధర్మము-దానియాదర్శములు" అను విషయమునుగురించి ధర్మప్రసంగము గావించితిని. నాటి సా యంకాలము పౌరజనసభ కధ్యక్షత వహించి బ్రాహ్మసమా జాదర్శములనుగూర్చి తెలుగులో విపులముగ ముచ్చటించితి ని. చాలవరకు విస్పష్టముగ ఆ యాదర్శములను వ్యక్తీకరించు టకు ఈశ్వరుడు నాకు దయతో శక్తిని ప్రసాదించెను. జనుల యందు కలవరము బయలుదేరెను. ప్రధానోపాధ్యాయులు ను, ప్రథమసహాయోపాధ్యాయులును ఆగ్రహము జెందిరి. వారికి సచ్చింతయు, సహనమును ఈశ్వరు డనుగ్రహించును

గారు!" ఈ వృత్తాంతమువలన పెద్దలు ముఖ్యముగా వచటి బోర్డుహైస్కూలులోని యుపాధ్యాయులు ఆయన తాకిడికి తాళజాలక కోపావేశు లయినటుల తెలియుచున్నది. చిన్న తరగతిమొదలు పెద్ద తరగతివరకు అన్నిటిలోను బ్రాహ్మసమాజముయొక్క వాసన గలిగిన బాలు రుండుటను ప్రధానోపాధ్యాయులు కనుగొనిరి. బ్రాహ్మసమాజముతో సంబంధమున్నవారు నిలువుడని ఆయన ప్రతితరగతికి వెళ్ళి యొక పర్యాయము కోరియుండెను. ప్రతితరగతిలోను ఒకరిద్దరికి తక్కువ లేకుండ నిలువబడిరి. బ్రాహ్మసమాజోద్యమమును నిరోధింప వలసినదని యూరిలోని పెద్దలు ప్రధానోపాధ్యాయులను పురిగొల్పిరి. ఆయన బ్రాహ్మసమాజమునం దభిమానముగల విద్యార్థుల నవమానించుచు కొన్ని యిబ్బందులకు లోనుచేసిరి. మరియు డాక్టరు ఆనిబిసెంటు దొరసానిగారు రచించిన దివ్యజ్ఞానపుస్తకములను బాలురచే నిర్బంధముగ కొనిపించి చదివింప మొదలిడిరి. ఈ సమాచారము బాపయ్యగారు వినినతోడనె 'కార్లీలియను' పత్రికకు ప్రధానోపాధ్యాయుల నిరంకుశ చర్యలను ఖండించుచు నొక వ్యాసము వ్రాసి అది ప్రచురింపబడిన సంచిక నొక దానిని స్కూళ్ళ యినస్పెక్టరుగారికి పంపిరి. అప్పటినుండి బాపట్ల పాఠశాలలో అవి యన్నియు క్రమముగా తగ్గిపోయెను. బాపయ్యగారి

వలలో తగుల్కొనకుండ చేయుటకు పెద్దలై యిక తమ బిడ్డలను ఆయననుండి దూరముచేయ ప్రారంభించిరి. ఆయన తమ్ముడు అప్పారావు సహితము మైసూరుప్రాంతములకు పంపబడెను. ఆయన యుపన్యాసములు యువకులకు అతిమధురములై యుండెనని చెప్పుటలో నతిశయోక్తి యేమాత్రము లేదు. అవి ఆయన జీవితముయొక్క మహాఫలములు.

ఆయన వ్రాఁతరూపమునసనె గాక లిఖితరూపమున గూడ తన భావముల ప్రకటించి ధర్మవ్యాపనమునకు తోడ్పడెను. ఇండియన్ సోషల్‌రిఫార్మర్, వాయిస్ ఆఫ్ ట్రూత్, కార్లీలియన్ పత్రికలయందు ఆయన వ్యాసములు నాంగ్లమున వ్రాసి ప్రచురింపించెను. ఆయన వ్యాసములు మృదువగు సులభశైలి కలిగి భావములను చక్కగ వెల్లడింప గలిగియున్నవి. నవీనసంస్కరణభావములు ప్రచురించుటకు మాత్రమె గాక పరుల అయోగ్యకార్యములను ఖండించుటకు గూడ ఆయన వ్యాసముల రచించెను. రాజమహేంద్రవరములో విద్యాధికులు కొందరు చేరి భోగముమేళము పెట్టించి వినోదించుట నెరింగి వారివర్తనమును విమర్శించుచు ఆయన వాయిస్ ఆఫ్ ట్రూత్ పత్రికలో "A Scandalous local incident." (నింద్యమగు నొక స్థానికకృత్యము) అను శీర్షికతో వ్యాసము వ్రాసి ప్రచురించెను. అందు మానసష్టకరములగు

కొన్ని వాక్యములు గలవని ఆయనమిత్రులు భయపడిరి. ఆ యన యీవిషయమునుగురించి దినచర్యపుస్తకమునం దిట్లు వ్రాసికొనెను—"విద్యావంతులు అవినీతిని పెంపొందించు నప్పుడు హృదయము సహజముగ నాగ్రహావేశము జెందును. అట్టి యుద్రేకస్థితియందు భోగముమేళము విషయమయిన యీ గర్హ్యకార్యమునుగురించి నే నొక వ్యాసము వ్రాసితిని. అందు మానసష్టకరము లగు వాక్యము లుండుటచే మిత్రులు చాల ఆదుర్దపడుచున్నారు." ఈమాటలవలన ఆయన యధర్మమును సహింపలేని స్వభావము కలవాడని స్పష్టపడుచున్నది. సాత్వికస్వభావ మనగా అధర్మమును సహితము సహించుకొని దానితో రాజీ చేసికొనుట యెంతమాత్రము గాదు. పత్రికలకు వ్రాయబడిన వ్యాసములును ఆయన జీవితముయొక్క ఫలములు.

ఆయన తనకు చేతనయిన రీతిని పరులకు సాయపడియుండెను. బంధువులకును మిత్రులకును ఆయన తన శక్తికొలది సాహాయ్యము చేసెను. అంతియగాదు; తా నెఱుగని బీదసాదలయెడలను రోగులయెడలను ఆయన యమితసానుభూతి కలిగి వారి దీనస్థితి తొలగించుటకు పాటుపడెను. కష్టపడు బీదల దైన్యమును చూచినప్పుడు, ఆయన హృదయమెట్లు కరిగి సాయపడుటకు వేగిరపడునో, ఎట్టి భావముల

కాకరమగునో, ఆయన యొక్క సందర్భమున దినచర్యాపుస్తక మున వ్రాసికొనిన యీ క్రింది వాక్యములు సూచింపగలవు.—
"రెండెడ్ల బండి ఒక ఆడుమనిషి మీదుగా దొర్లిపోయెను. జనసమూహము ఆమెచుట్టును చేరెను. జ్ఞానశూన్యు లగుటచే వా రేమి చేయుట కెరుగక తెల్లపోయి చూచుచు నిలువ బడిరి. ఉపాసనానంతరము ప్రార్థనసమాజమందిరమునుండి మరలి వచ్చునప్పుడు, ఆ సమూహమును చూచి సమాచా రము తెలిసికొని తత్క్షణమె ఆసుపత్రికి ఆమెను తీసికొని పోతిని. ఈశ్వరుడు డాక్టర్లని ఆశీర్వదించును గాక! తిండిలేక ఆమె దినమంతయు మాడుచున్నదట. ఆహారము దొరకక ప్రతిదినము ఈశ్వరుని బిడ్డ లెందరు మృతి జెందుచున్నారు! ఓ దేవా! నీవు ధనము ప్రసాదించిన నీబిడ్డలకు, తమ ధనము స్వార్థపరత్వముతో తమనిమిత్తమె యెట్టిబాధ్యతయు లేకుండ వెచ్చించుటకొరకు గాక దరిద్రులగు తమ సోదరీసోదరుల నిమిత్తము వినియోగించుటకు తమపరముగ నప్పగింపబడిన పవిత్రమయిన సొత్తు అని బోధచేయుము." ఇందు ధనికుల కును దరిద్రులకును నుండవలసిన సంబంధమెట్టిదియొ నిరూ పింపబడినది. బాపయ్యగారు స్వయముగ నార్జించుట కారం భించిన మొదటి దినములలోనె కుష్ఠురోగముచే బాధపడు చున్న పిల్లవానిని తొట్టిస్నానముల చికిత్సవలన ఆరోగ్య

వంతుని చేయుటకు ఆయన మిత్రు లొకరు పూనుకొనినప్పుడు ఆ పిల్లవానికగు భోజనపుఖర్చు లన్నియు భరించుట కేర్పాటు చేసికొనెను. వీరేశలింగము పంతులుగారు నడపుచుండిన వితంతుశరణాలయసంబంధముగ కొంతపని కలిగియున్నప్పుడు ఆయన అందలి వితంతువులు సుఖముగ జీవించుటకు తగిన యేర్పాటులను చేయుటలో మిక్కిలి శ్రద్ధ వహించెను. ఒక పర్యాయము శరణాలయమునకు వెళ్ళినప్పుడు, ఒక వితంతువు పండుకొనుటకు పక్కయు, కప్పుకొనుటకు దుప్పటియు లేక చలిలో కటికనేలమీద పరుండు చున్నదని శరణాలయము యొక్క సూపరింటెండెంటుగారిద్వారా తెలిసికొని ఆయన చాల దుఃఖపడి ఆమెకొరకు ఒక బూర్నీసును దుప్పటిని పంపెద నని ఆమెతో చెప్పెను. తరువాత మాటల సందర్భములో పంతులుగారు ఆమెను గురించి యేదో యడుగగా, ఆమెకు దుప్పటియు, బూర్నీసు చాల యవసరముగ కావలసి యున్నవనియు, తా నవి పంపెదనని చెప్పి వచ్చితిననియు ఆయన పంతులుగారితో నుడివెను. ఇంటికి వెళ్ళి బంట్రోతు చేత అవి యామెకు పంపించెను. పిమ్మట పంతులుగారు ఆగ్రహించి యవి కావలె నని యాయన నడిగినందు లకు ఆమెను చీవాట్లు పెట్టిరని సూపరింటెండెంటుగారివలన వినగా, ఆయన యెట్టి తలంపులను తలంచి యుండెనో, దీనుల

పక్షము వహించుటలో నెంతదీక్ష పూనునో దినచర్యపుస్తకములో ౬-౧౨-౧౯౦౫ తేదిన వ్రాసికొనిన యీ ప్రార్థన తెలుపగలదు.—"ఓ పరమేశ్వరా! బలమయిన ప్రతికక్షిని, అసమాన నిరోధము సహిత మెదుర్కొని సత్యముకొరకును ధర్మముకొరకును మానవశ్రేయముకొరకును ప్రతిఘటించుటకు సచ్చింతను దృఢచిత్తమును నీ నిధేయసేవకుడ నగు నాకు అమితవాత్సల్యముతో ననుగ్రహింపుము. నీ యనుగ్రహములు బడయుటకు నర్హుడ నగునట్లు పరిశుద్ధునిగను నిష్కపటునిగను ధర్మాత్మునిగను చేయుము. హే ప్రభో! మానసిక శారీరక వేదనలనుండి పాప మా శ్రీ......ను అపాయకరమునుండి కాపాడుము. నీయందు దృఢవిశ్వాసము గలిగి ధైర్యముతో సర్వశోధనల నెదుర్కొనగల శక్తి నీ దాసునకు కటాక్షింపుము." దీనివలన బాపయ్యగారు ఆవశ్యకమయినచో తాను గౌరవించిన వీరేశలింగము పంతులుగారితో కూడ పోరుసలుపుటకు సంసిద్ధుడై యని బోధపడుచున్నది. దీనజనపోషణ మాయన జీవితమువలని మరియొక ఫలము.

పంతులుగారు స్థాపించిన విక్టోరియా బాలికాపాఠశాలకును, రాజమహేంద్రవర హిందూసంఘసంస్కరణసమాజమునకును, రాజమహేంద్రవర ప్రార్థనసమాజమునకును కార్యదర్శిగనుండియా సంస్థలపక్షమున బాపయ్యగా రమితోత్సాహముతో

వంతుని చేయుటకు ఆయన మిత్రు లొకరు పూనుకొనినప్పుడు ఆ పిల్లవానికగు భోజనపుఖర్చు లన్నియు భరించుట కేర్పాటు చేసికొనెను. వీరేశలింగము పంతులుగారు నడపుచుండిన వితంతుశరణాలయసంబంధముగ కొంతపని కలిగియున్నప్పుడు ఆయన అందలి వితంతువులు సుఖముగ జీవించుటకు తగిన యేర్పాటులను చేయుటలో మిక్కిలి శ్రద్ధ వహించెను. ఒక పర్యాయము శరణాలయమునకు వెళ్ళినప్పుడు, ఒక వితంతువు పండుకొనుటకు పక్కయు, కప్పుకొనుటకు దుప్పటియు లేక చలిలో కటికనేలమీద పరుండు చున్నదని శరణాలయము యొక్క సూపరింటెండెంటుగారిద్వారా తెలిసికొని ఆయన చాల దుఃఖపడి ఆమెకొరకు ఒక బూర్నీసును దుప్పటిని పంపెద నని ఆమెతో చెప్పెను. తరువాత మాటల సందర్భములో పంతులుగారు ఆమెను గురించి యేదో యడుగగా, ఆమెకు దుప్పటియు, బూర్నీసు చాల యవసరముగ కావలసి యున్నవనియు, తా నవి పంపెదనని చెప్పి వచ్చితిననియు ఆయన పంతులుగారితో నుడివెను. ఇంటికి వెళ్ళి బంట్రోతు చేత అవి యామెకు పంపించెను. పిమ్మట పంతులుగారు ఆగ్రహించి యవి కావలె నని యాయన నడిగినందు లకు ఆమెను చీవాట్లు పెట్టిరని సూపరింటెండెంటుగారివలన వినగా, ఆయన యెట్టి తలంపులను తలంచి యుండెనో, దీనుల

పక్షము వహించుటలో నెంతదీక్ష పూనెనో దినచర్య(పు)స్త కముల్లో ౬-౧-౨-౧౯౦౫ తేదిన వ్రాసికొనిన యీ ప్రార్థన తెలుపగలదు.—"ఓ పరమేశ్వరా! బలమయిన ప్రతికక్షిని, అసమాన నిరోధము సహితె మెదుర్కొని సత్యముకొరకును ధర్మముకొరకును మానవశ్రేయముకొరకును ప్రతిఘటింపగల సచ్చింతయు దృఢచిత్తమును నీ విధేయ సేవకుడ నగు నాకు అమితవాత్సల్యముతో ననుగ్రహింపుము. నీ యాశీర్వాదముల బడయుటకు నర్హుడ నగునట్లు పరిశుద్ధునిగను నిష్కపటునిగను ధర్మాత్మునిగను చేయుము. హే ప్రభో! మానసిక శారీరక వేదనలనుండి పాప మూ శ్రీ......ను అపాయకరమునుండి కాపాడుము. నీయందు దృఢవిశ్వాసము గలిగి ధైర్యముతో సర్వశోధనల నెదుర్కొనగల శక్తి నీ వామెకు ననుగ్రహింపు ము." దీనివలన బాపయ్యగారు ఆవశ్యకమయినచో తాను గౌరవించిన వీరేశలింగము పంతులుగారితో కూడ పోరుసలు పుటకు సంసిద్ధుడై యుని బోధపడుచున్నది. దీనజనపోషణ మాయన జీవితమువలని మరియొక ఫలము.

పంతులుగారు స్థాపించిన విక్టోరియా బాలికాపాఠశాల కును, రాజమహేంద్రవర హిందూసంఘసంస్కరణసమాజము నకును, రాజమహేంద్రవర ప్రార్థనసమాజమునకును కార్యదర్శిగ నుండియాసంస్థలపక్షమున బాపయ్యగారమితోత్సాహముతో

కొంతకాలముకృషిసలిపిరి. విక్టోరియా బాలికాపాఠశాలయొక్క సంవత్సరోత్సవము ఏ. ఎల్. మేడీ దొరసానిగారి యాజమాన్యముక్రింద ౨౮-౨-౧౯౦౬ తేదిన జరగినప్పుడు ఆయన చదివిన కార్యనివేదనము స్త్రీవిద్యావిషయమున తోడిదేశీయులలో నెట్టి ప్రోత్సాహము ఆయన కలిగించుటకు పూనుకొనెనో వ్యక్తపరచుచున్నది. కీర్తిశేషులయిన అరవపల్లి సుబ్బారావుగారు మృతిజెందినప్పటినుండియు నిద్రావస్థలో నున్న రాజమహేంద్రవర సంఘసంస్కరణసమాజము చురుకుగా పనిచేయుటకు కారకుడయి దానిపక్షమున వీరేశలింగము పంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, టంగుటూరి శ్రీరాములుగారు, చిలుకూరి వీరభద్రరావుగారు మొదలగు పురప్రముఖులచే నుపన్యాసముల నిప్పించియు, స్త్రీలకొరకు ప్రత్యేక ప్రసంగముల నేర్పరచియు, కరపత్రముల ప్రచురించియు, సంస్కరణమునకు తోడ్పడు విందులను గావించియు, ఆయన తన కార్యోత్సాహము కనపరచెను. టంగుటూరి ప్రకాశముగారు బారిష్టరు పరీక్షకు చదువ ఇంగ్లండు పోవుటకు ముందు వారి సన్మానార్థము సంస్కరణసమాజపక్షమున నొక బహిరంగసభ గావించి వారిని శ్లాఘించుచు ఆయన మాటాడి కార్యశీలము యొక్క యావశ్యకతను పురజనులు గుర్తించునట్లు చేసెను. బాలురకు గాని, బాలికలకు గాని

బాల్యమున వివాహము జరుగు నాచారమును ఆయన పూర్తిగ నిరసించుచుండెను. తన బంధువులలో నట్టి వివాహములు జరుగ నున్నప్పుడు, ఆయన అవి జరుగకుండ జేయుటకు యావచ్ఛక్తితో ప్రయత్నించియుండెను. సంస్కర్తలని పిలచుకొనుచు బాల్యవివాహములు గావించు వారిని ఆయన అతి తీవ్రముగ ఖండించెను. ప్రొఫెసర్ ఎస్. రంగాచారి ఎమ్. ఏ. గారు తమ యేడేండ్ల పుత్రికను పదునైదుఏండ్ల బాలున కిచ్చి వివాహము చేయించినప్పుడు ప్రొఫెసర్ గారిని విమర్శించుచు ఆయన 'ఇండియన్ సోషల్ రిఫార్మర్' పత్రికకు వ్రాసిన వ్యాసమునందు అట్టి కుహనాసంస్కర్తలమూలమున సంస్కరణోద్యమమునకు మహానష్టము కలుగుచున్న దని నిరూపింపబడెను. సంస్కరణకార్యములపక్షమున యోధునివలె పోరు సలుపుటకు ఆయన నిలచె నని యీ పేర్కొన బడినవన్నియు తెలుపుచున్నవి గదా? రాజమహేంద్రవర ప్రార్థనసమాజమునకు ఆయన ప్రాణము పోసెనని చెప్పవచ్చును. మద్రాసు ప్రార్థనపుస్తకమునుండి వారమువారము ప్రార్థనలు చదువుట సమాజికులలో ధర్మజీవనమును రవులు గొల్పుటకు తోడ్పడ నేరదని జయంతి గంగన్నగారు మొదలగు మిత్రులు తెలుపుట వలనను స్వయముగ గమనించుట వలనను సొంతప్రార్థనలు చేయుటకు ఆయనయె మొదట పూనుకొనెను. ధర్మమునందు

తాను పెరుగుచున్న కొలది నూతననూతన ప్రార్థనలను ఆయన చేయుచు తోడి సభ్యులలో భక్త్యుత్సాహముల పురిగొల్పి యుండెను. భక్తి అనుష్ఠానమునందు పరిపూర్ణత జెందునని యుపదేశములమూలమునను వర్తనము వలనను వ్యక్తపరచెను. ఇక రాజకీయోద్యమమందును పాల్గొనుటకు ఆయన యుద్యుక్తుడగుచుండెను. స్వదేశవస్తువుల ప్రోత్సాహమునకు ఆయన పాటుపడెను. దేశీయవ్యాయామములు వాడుకలోనికి వచ్చుటకు కొంత ప్రయత్నము చేసెను. "౧౯౦౬ సంవత్సర ప్రాంతముల బాపట్లలో నడపబడుచుండిన తాలింఖానాకు పెదబాపయ్యగారు తరుచు వచ్చుచు కసరతుచేయు వారిని ప్రోత్సాహ పరచిరి. ఇంకొక చోటినుండి క్రొత్తవారిని తెచ్చి జీతమిచ్చి వారిద్వారా తాలింఖానాను నడపించుటకంటె ఉన్న వారిలో కొంత కసరతు నేర్చియున్న నన్ను అందున కుపయోగించుకొనిన బాగుండు నని వారు సలహా నిచ్చిరి." అని బాపట్లవాస్తవ్యులు మంత్రి కృష్ణయ్యగారు చెప్పుచున్నారు. దేశహితకరములగు సర్వకార్యములందు పాటుపడుచు మానవసేవయందు నిమగ్నుడగుచుండెను. ఒక సందర్భమున వీరేశలింగముపంతులుగారికి జాబు వ్రాయుచు తన్ను గురించి "For any blessed cause, I would even offer my life unto Him who gave it"—

ఏ ధర్మకార్యము కొరకయినను నా జీవనప్రదాతకు నా జీవితమును సహితము కానుకగ సమర్పించెదను—అని యాయన తెలుపుకొని యుండెను. ఒక మాటలో స్వార్థరహితమై సేవారూపము దాల్చిన ఆయన ధన్యజీవితమె దేశమునకు దొరకిన గొప్ప ఫలము.

---

# జీవనస్మృతి

## ౧౭ వ ప్రకరణము

### మరణము

"Never spend a thought on death. Work every faculty, strain every nerve, use every opportunity. Live as strenuously as though you were to live for ever. Act thy alloted part with all thy heart, and then when in fit time the call comes, resign God's work into God's hands, and enter into thy rest with the old assurance "well done"— మరణమునుగూర్చి యెన్నడును యోచింపకుము. సర్వశక్తులతోడను పాటుపడుము. జీవితమును ధారపోయుము. అన్ని యవకాశములను వినియోగింపుము. శాశ్వతముగ జీవించువానివలె సంపూర్ణకృషితో జీవింపుము. పూర్ణహృదయముతో నీ విధికృత్యమును నిర్వర్తింపుము. అర్హకాలమున ఈశ్వరునినుండి యాహ్వానము వచ్చునప్పుడు, ఆయన విధించిన పనిని ఆయన కప్పగించి 'బాగుగ నిర్వర్తింపబడెను' అను నభయవచనము బడసి నీ విశ్రాంతియందు ప్రవే

శింపుము—అని ప్రతాపచంద్రముజుందారుగా రొసంగిన నదుపి దేశము వారు రచించిన 'Heart beats' గ్రంథము నుండి యెత్తి దినచర్యపుస్తకమునందు ౧-౧౦-౧౯౦౭ తేదిన బాపయ్యగారు వ్రాసికొనిరి. మృత్యువు ఆయనను ధర్మరంగమున ప్రవేశపెట్టెను. మృత్యువాయనను పలుమారెదుర్కొనుచు మహాధర్మశూరుని జేసెను. అంతియ గాని మృత్యువు ఆయన నెప్పుడును నిరుత్సాహపరుప లేదు. దాదాపుగ ధర్మయుద్ధము సలుపుచున్న కాలమంతయు ఆయన శరీరారోగ్యము కలిగియుండక మృత్యుసమక్షముననె జీవించెను. కాని జీవిత మంతమునకు వచ్చుచున్నకొలది ఆయనకు ధర్మోత్సాహము మాత్రము హెచ్చెను. తన జీవితమున ప్రత్యక్షమయిన సత్యమె ముజుందారుగారి గ్రంథమున కనుగొని అది యొక సూత్రవాక్యముగా లిఖించుకొనెను. మృత్యువాసన్నమయినకొలది ఆయనయాత్మ యవిరళతేజముతో ప్రకాశింపజొచ్చెను. ఆయన దినచర్య పుస్తకములో కట్టగడపట ౨౬-౧౧-౧౯౦౭ తేదిన యీ వాక్యములు వ్రాసికొనెను.—

"కడచిన జూన్ మాసమునుండి గుండెనొప్పితోడను దగ్గుతోడను మిక్కిలి బాధపడుచున్నాను. ఈ రోజున నవవిధాన సమాజ ప్రచారకులు, భాయి బ్రజగోపాల నియోగిగారు, ఇక్కడికి ప్రచారసందర్భమున వచ్చి నన్ను చూచి యాశీర్వ

దించిరి. ఈశ్వరునకు సంపూర్ణముగ ఆత్మసమర్పణము చేసి కొను మని వారు నాకు సలహా చెప్పిరి. 'నీ విరామకాలమును ఈశ్వరధ్యానమున గడపుము. బాధను తొలగించుమ మని గాని వ్యాధిని నయము చేయు మని గాని ప్రార్థింపక యీశ్వరేచ్ఛ నెరవేరు గాక యనియె ప్రార్థింపుము. ప్రపంచమునకును శరీరమునకును సంబంధించిన యోచనలనుండి ఆధ్యాత్మికవిషయములకు ని న్నీ ప్రార్థన మరలించును; నీవు మనోశాంతిని బడయ గలవు.' ఇవి నిజముగా అనుసరింపదగిన మహావాక్యములు" ఈ తీరున ఆయన మరణమున కాయత్తు డగుచుండెను. ఇక రెండు మాసములకు చనిపోవనున్న సమయమున ౧౦-౧-౧౯౦౮ తేదిన ఆయన కాకినాడనుండి పాలపర్తి నరసింహముగారికి వ్రాసిన యుత్తరములో ఈక్రింది వాక్యములు గలవు. "As for me, I am just as bad as before. The relief from caugh is purely temporary, as you could easily guess. I am a confirmed invalid and there is no near prospect of my getting better and being useful to my country. God's will be done. I completely resign myself to his care. May His blessings rest with you all!" వెనుకటివలెనె తిరిగి జబ్బు స్థితిలో నున్నాను. నీకు తెలియవచ్చుచున్న లాగున ఈ నడుమ దగ్గు

తాత్కాలికముగా మాత్రము నెమ్మదించినది. నేను పూర్తిగ నశక్తుడ నైతిని. త్వరలో నాకు ఆరోగ్యము కలిగి నా దేశముకొరకు నేను పాటుపడుట వట్టిది. ఈశ్వరేచ్ఛ నెరవేరునుగాక! నా రక్షణభార మంతయు పరమేశ్వరునకు సంపూర్ణముగ విడుచు చున్నాను. ఆయన మి మ్మెల్లరను ఆశీర్వదించును గాక!— ఈ మాటలవలన, బాపయ్యగారు తమ యిచ్ఛను వదలుకొని యీశ్వరేచ్ఛ యెట్టిదిగా నున్నను దానిని శిరసావహించుటకు తమ మనసును పదిలపరచు కొని రని స్పష్టముగా తెలియుచున్నది.

వైద్యమునిమిత్తము, బాపట్లనుండి బెజవాడకును, బెజవాడనుండి రాజమహేంద్రవరమునకును, రాజమహేంద్రవరమునుండి కాకినాడకును, కాకినాడనుండి పిఠాపురమునకును, పిఠాపురమునుండి చెన్నపట్టణమునకును ఆయన తనయంత్యకాలమునందు ప్రయాణములు చేయవలసి వచ్చెను. తనకు జబ్బు ప్రారంభ మయినప్పుడు మొదట కొంతకాలము తప్ప ఆయన కూనీవైద్యమునె యెల్లప్పుడును చివరి దినములవరకు అనుసరించుచుండెను. దానిమూలమున ఆయనకు మంచి యారోగ్యముకూడ కలిగెను. కాని తగిన పోషణ లేకపోవుటచేతను, వివిధ కార్యములం దెక్కువగ కృషి సలుపుటవలనను, ఆయన దేహస్థితి తిరిగి చెడెను. ఆంగ్లాయుర్వేదవైద్యులను, తదితరవైద్య

లను ఆయన సంప్రదించుచు వచ్చినను, కాని వైద్యము దాదాపు మరణపర్యంతము విడువ లేదు. కాని జబ్బు అంత కంతకు పెరిగి ముంచుకొని వచ్చుచుండెను. ఆ సమయమున మామూలు వైద్యములు చేయించుకొను మని బంధువులును మిత్రులును కోరియుండుటచే, వారి కోరికల ప్రకారము, గుణము కాన్పించిన కాన్పింప వచ్చునను నాశతో బావాజీ మందును, తెనుగు మందును, ఇంగ్లీషుమందును, ఆ డాక్టరు మందును, ఈ డాక్టరు మందును అన్ని రకములయిన మందులను కడపటి రోజులలో సేవించుచు దేనిమూలమున గుణము కానక యొక యూరినుండి మరియొక యూరికి వెళ్లెను. తుదకు చెన్నపట్టణమునకు పోయి జనరల్‌హాస్పిటలులో ప్రవేశించెను. ఆయనను చూచుటకు క్రిస్టియన్ కాలేజి ప్రొఫెసర్లును, ఇంకను అచట గొప్పవారును రా దొడంగిరి. ప్రొఫెసరు మాఫెట్‌గారి సతీమణి తల్లికంటె నెక్కువగా నుపచారములు చేయ బూనెను. హాస్పిటల్ అధికారులకు ఆయన సామాన్యపురుషుడు కాడని పొడగట్టెను. ఆయనకు వారు సహిత మెట్టి లోపము కలుగకుండ చక్కని యేర్పాటులను గావించిరి. అవసానసమయము దగ్గరకు వచ్చెను. తంతివార్తలు బంధువులకును మిత్రులకును పంపబడెను. కడసారి చూపునకై యొకరి తరువాత నొకరు వచ్చుటకు

ప్రారంభించిరి. భార్యను కూడ తీసికొనివచ్చి చూపించిరి. ఆమెను జాగ్రత్తగ కాపాడు డని ఆమె బాలమ్మతో ఆయన చెప్పెను. ఒక రోజున పెద్ద డాక్టరు పరీక్ష చేసి నాటి సాయంకాలము నాలుగు గంటలలోపుగా ఆయన మృతి జెందునని తెలిపెను. స్నేహితులు గుంపులు గుంపులుగా రాదొడంగిరి. ఆయన తీవ్రముగ బాధపడుచుండెను; కాని తన బాధ నంతయు మరచిపోవుచు తన్ను చూడవచ్చిన వారెల్లరకు ప్రేమ పూర్వకమగు చూపువలన గాని, కరస్పర్శవలన గాని, వందనమువలన గాని, మాటవలన గాని, సన్మానించెను. వారు నిర్వర్తింపవలసిన విధులను గూడ జ్ఞప్తికి దెచ్చెను. అప్పుడు చెన్నపురి బ్రాహ్మసమాజమునకు కార్యదర్శిగా నుండి మిగుల పాటుపడుచుండిన వి. పెదంబరాజు బి. ఏ గారితో "ఇక్కడి బ్రాహ్మసమాజమునకు మీరు స్థంభమువలె నున్నారు. దేశములో బ్రాహ్మధర్మము మీ సేవకై నిరీక్షించుచున్నది. మీ కర్తవ్యమును పాలింపుడు.' అని చెప్పెను. పెదంబరాజు గారు గవర్నమెంటు ఉద్యోగము మాని సుమారు పదునాలుగు సంవత్సరములు శ్రీ పిఠాపురము మహారాజాగారి అనాధశరణాలయమునందు పాటుపడుటకును, ఆ పనినుండి విశ్రాంతి గైకొనిన తరువాత నేటివరకు తమ యావచ్ఛక్తితో మానవసేవ చేయుచుండుటకును, ఈ మాటలు చాల

వరకు తోడ్పడె నని తలంప వచ్చును గదా? ఆ రోజులలో సాంఘిక రాజకీయ విషయములం దెక్కువ యభిరుచిని కన పరచు చుండిన బాపట్ల వాస్తవ్యులగు వెలగపూడి సుబ్బా రావు బి. ఏ; బి. ఎల్ గారితో "నీ యభిరుచికి తగ్గినట్లు నీవు దేశసేవ చేయుము'' అని నుడివెను. సంఘసంస్కారకార్యము లందును, రాజకీయోద్యమమందును ముందంజ వేయుచు నుత్సాహము కనపరచుచున్న సుబ్బారావుగారి జీవితమున ఆయన కోరిక ఫలించె నని చెప్పవచ్చును. ఆ విధముగ నెవ రికి తగినట్లు వారికి ఆయన యంత్యోపదేశము చేసెను. మృత్యుశయ్యమీఁద కూడ ఆయన తన జీవితాదర్శములనె స్మరించుచు తనవద్దకు వచ్చిన వారిలో నెవరిద్వారా వానిలో నేది వ్యాపనము చెంద గలదో వారి కది తెలిపి తన్నిమిత్తము పాటుపడు డని హెచ్చరిక నొసంగెను. చనిపోవుటకు ముందు జనులు సామాన్యముగా ఇల్లు, వాకిలి, పొలము, దొడ్డి, నగలు, నాణెములు మొదలగు ఆస్తుల విషయమై యాదుర్ద జెందుచు తమకు నమ్మకమయిన వారి పరముగా వాని నప్పగింతురు. తా నే యాదర్శములను గ్రహించి జీవితమున కాపాడియుం డెనో, వానిని పోషింపు డని ఆయన తన మిత్రులను ముఖ్య ముగ కోరి యుండెను. ప్రాణము విడుచు నిమిషమువరకు దేవునిగూర్చిన చింతయె, దేశమును గురించిన యోచనయె.

పెద్ద డాక్టరుగారు ఆయన చనిపోవు నని నిర్ణయించిన గడువు దాటిపోవు చుండెను. ఆయన పూర్తిగ స్పృహతో నుండెను. మృతి నొందుట నిశ్చయమని నిర్ధారణ యగుటచే మరణ బాధ తెలియకుండ జేయుటకు చిన్న డాక్టరు మత్తు మందు నిచ్చుటకు వచ్చిరి. ఆయన యది పుచ్చుకొనుటకు నిరాకరించెను. ఆసుపత్రి ఆయనను చూడ వచ్చిన బంధుమిత్రులతో కిటకిట లాడుచుండెను. మా ఘెటు దొరసాని ఆయన చెంత నిలచి సేవ చేయుచుండెను. పండిత డి. గోపాలాచార్యులు, డాక్టరు సి. బి. రామారావు మున్నగు స్నేహితులు ఆయన పరుండిన గదిలోను గదిప్రక్కను నిలువబడి కన్నీరు కార్చుచుండిరి. రుగ్మతభయంకరముగగాన్పించెను. ఆయనశరీరము నీటితో నిండిపోయెను. ఊపిరితిత్తులుచెడినవి. అన్ని యంగములు నీరసించినవి. గుండె యేక్షణముననాగునో యను నట్లుండెను. కాని నిశ్చయింపబడిన మరణసమయము దాటెను. "ఇక ఆసుపత్రిడాక్టరులు నాకు చేయగలది యేదియు లే దనుచున్నారు. నేను తప్పక మరణింతు నని వారు రూఢిపరచిన గడియలు గడచినవి. As long as there is life, there is hope— ప్రాణ మున్నంతవరకు, ఆశ యుండును— గోపాలాచార్యులు గారూ! మీరు నాకు చికిత్స చేసెదరా? రామారావుగారూ! మీ రేమైయిన ప్రయత్నించెదరా?" అని యడిగెను. కాని

యెవరికిని ఆశలేదు. అందరు మారుమాటాడక నిలచిరి. "గోపాలాచార్యులుగారూ! బ్రతికి యుండగానె మందు మాకూ వేయక రోగిని విడుచుటయేనా మీ వైద్యపద్ధతి కూడా ?" అని మరల ప్రశ్నించెను. "చివరవరకు నేను చేయగలిగిన దంతా చేస్తానురా, నాయనా! నీ వధైర్యపడకు" అని ఆచార్యులుగారు జవాబు చెప్పిరి. కాని ఆసుపత్రిలో నుండగా, ఇతరవైద్యము చేయించుకొనుటకు వీలులేదు. తనను అక్కడనుండి వెంటనె యింకొక చోటికి తీసికొనిపోయి వైద్యము చేయువలసిన దని ఆయన ఆచార్యులగారిని కోరిరి. ఆయనను కదలించిన, గుండె తటాలున ఆగవచ్చును. ఆచార్యులగారును, అందరును ఆయనను అక్కడనుండి కదల్ప గూడదని యనుకొనుచుండిరి. తనని క క్షణ మయినను ఆసుపత్రిలో నుంచవద్దని పట్టుపట్టెను. మరియొకచోట సరియైన యేర్పాటు లుండవని, ఉపచారము బాగుగ జరుగదని, మా ఫెటు దొరసానిగారు చెయ్యిపట్టుకొని గడ్డము పట్టుకొని బ్రతిమాలి ఆయనకు నచ్చచెప్ప చూచెను. కాని ఆయన పట్టు వదల లేదు. సాయంకాలమయినది. ఆ చీకటి వేళను ఒక డోలీలో పరుండబెట్టి సాధ్య మయినంత వరకు కదలకుండ మిత్రులాయనను బ్రాహ్మసమాజమందిరమునకు తీసికొని పోయిరి. అచటికి మా ఫెటు దొరసాని గారు పరుపులును, దిండ్లును పంపిరి. అక్కడికి కూడ ఆమె

వచ్చుచుండెను. అన్ని యేర్పాటులు చక్కగా చేయబడెను. గోపాలాచార్యులుగారు మం దిచ్చుచుండిరి. డాక్టరు రామా రావుగారు సలహా చెప్పుచుండిరి. మిత్రు లందరును కళాశాల విద్యార్థులును వంతులవరుసను ఆయనకు సేవ చేసిరి. పిళ్ళారి శెట్టి సీతారామయ్యగారును, నేనును ఆ యంత్యదినములలో ఆయనను కనిపెట్టుకొని యుండి పథ్యపానములు చూచితిమి. అవసానము సమీపించిన దని ఆయనకును తెలియును. తన కొరకితరులు వెచ్చించిన సొమ్మును తీర్చుటకు సేవింగ్సు బాంకి నుండి సొమ్ము తీయించుట కేర్పాటు చేసెను. ఆయన తనవద్ద సొంత పైక ముంచుకొని పరు లిచ్చు ధనము పుచ్చు కొనుట తప్పుగా నెంచెడు వాడు. వీరేశలింగము పంతులు గారు మొదలయిన పెద్దలు ఆయనను చూడ వచ్చినప్పుడు వా రందరివద్ద కరములు జోడించి సెలవు పుచ్చుకొనెను. మహామరణవేదనలో మునిగిపోయెను. అమితబాధ పడెను. అది చూచుటకె దగ్గరనున్న వారి గుండెలు తరుగుకొని పోయెను. ఆయన స్పృహ గోల్పోవ లేదు; దైవచింతనము మాన లేదు. ౧౯౦౭ సంవత్సరము మార్చి ౯ వ తేదిన పగలు సుమారు ఒంటి గంటకు నన్నును సీతారామయ్య గారిని చేర బిలిచి పక్కకు త్రిప్పు మని కోరె అటుల మేము త్రిప్పగా హరినామస్మరణ చేసికొనుచు తిరిగి మే మక్కడ

నిలచి యుండగానె కొలది నిమిషములలో ప్రాణము విడిచెను. మే మటులనె నిలచి పోతిమి. కన్నులనుండి నీరు బొటబొట కారెను. ఆ కన్నీటి ధారలతోనె మృతదేహమునకు మొదటి స్నాన మాయెను. మిత్రుల పిలిపించితిమి. టంగుటూరి ప్రకాశముగారు మొదలగు ప్రముఖులు కూడ పలువురు వచ్చిరి. బ్రాహ్మమందిర మొక తీర్థస్థలమాయెను. ఆయనమిత్రులందరకు ఆయన బ్రాహ్మసమాజముకొరకు జీవించి మరణించెనని ఆయన బ్రాహ్మమందిరమున ప్రాణము విడుచుటవలన తట్టుచుండెను. ఆయన దివ్యమైన యాత్మకు నిలయమై యుండిన పవిత్రకళేబరమునకు స్నానము చేయించి పూలతో నలంకారము చేసితిమి. దాని సమక్షమున మిత్రులు నిలువ, వి. పెదంబరాజుగారు ఈశ్వరోపాసనము సలిపిరి. అనంతరము ఎల్లరము స్వయముగ దానిని దహనభూమికి మోసికొని పోయి తుదిప్రార్థనతోను కన్నీటి ధారలతోను అగ్నిపరము చేసితిమి.

బ్రాహ్మ ధర్మమునందు విశ్వాసము గలిగి చని పోవుచున్నాననియు, తదనుగుణ మగు పద్ధతుల ప్రకారము తన యంత్యకర్మలు జరుగవలె ననియు, మరణమునకు పూర్వము మిత్రులకును ఆసుపత్రిలోని యధికారులకును స్పష్టముగ వ్రాతమూలమున నెరుకపరచి చిట్టచివరవరకు తన విశ్వాసము

నకు భంగము కలుగకుండుటకై బాపయ్యగారు జాగ్రత్త పడిరి. ఆయన మరణపర్యంతము ధర్మమునందు విశ్వాసము గోల్పోలేదు; పట్టుదల విడువలేదు; ఎన్ని కష్టములనైన సహించి ధర్మపతాకము చేత బూనియె యుండెను. ఆయన ధన్యచరితుడు.

ఆయన మరణవార్త వినగానే ఇండియన్ మెసెంజరు, ఇండియన్ సోషల్ రిఫార్మరు, వాయిస్ ఆఫ్ టూౢత్, కృష్ణాపత్రిక మొదలయిన పత్రికలు ఆయన గుణసంపదను శ్లాఘించుచు సంపాదకీయములు ప్రకటించినవి. ఆయన నివసించియుండిన పట్టణములలో స్మరణసభలు గావింపబడెను. మరియు శాశ్వతస్మరణమునకు తోడ్పడు కొన్ని యేర్పాటులును జరిగినవి. వీరేశలింగము పంతులుగారు రాజమహేంద్రవరములో ఆనందోద్యానవనమున బాపయ్యగారి అస్తికలను భూస్థాపనము చేసి వానిపై సమాధి కట్టించిరి. ఆసమాధియొక్క చలవరాతిపై వారు చెక్కించిన మాటలు చిత్రపటమునందు చూడనగును. రాజమహేంద్రవర పురమందిరమునందు వారి ప్రోద్బలమువలననె ఆయనయొక్క పెయింటింగు నిలుపబడెను. ఆయనభార్య అలివేలుమంగతాయమ్మగారు ఆయన వర్థంతిదినమున ప్రతిసంవత్సరము కొంతమంది బీదలకు అన్నదానము చేయుటకు కాకినాడ అన్నదానసమాజముద్వా

రాపర్పాటు చేసిరి. ఆయన తమ్ముడు డాక్టరు వెంకటప్పారావు గారు తాము బాపట్లలో నెలకొల్పి నడపుచున్న హాస్పిటలులో ఆయనపేరిట బీదల కుచితముగా వైద్యసేవ చేయుచున్నారు. ఆయన మిత్రులు ఆదిపూడి సోమనాధరావుగారు తాము రచించిన గ్రంథరాజము, భక్తమణిభూషణమునందు ఆయనను స్తవము చేయుచు ఈ క్రింది పద్యమును రచించిరి.

సీ. "భక్తి భీష్ముం డని । ప్రఖ్యాతి వడసిన
  'శివనాధ శాస్త్రి'తో । జెలిమి నెఱపి
కార్యశూరుండును । గరుణానువర్తి యౌ
  'వీరేశలింగార్యు' । దారిఁ ద్రొక్కి
పాంచాలమండలి । భక్తాగ్రమణులలో
  'గురుదత్త విద్యార్థి' । గుణము గలిగి
యెన్ని కీడులు మూడి । తన్ను బాధించిన
  నిన్నుఁ జిత్తమునందు । నిలిపి యోర్చి

గీ. పిన్న యయ్యును భక్తిలోఁ । బెద్ద యగుచు
దేశ రాజాన్వయాగార । దీపమైన
'పెద్దబాపయ్య'కిల నెవ్వ । రుద్ది యయ్య?
సకల కల్యాణగుణ ధన్య! । సర్వమాన్య."

ఆయన యనుచరుడు పాలపర్తి నరసింహాముగారు తాము తెనుగున వ్రాసిన 'బ్రాహ్మమతము' అను గ్రంథము

ఆయన కంకితము చేసి ఆ సందర్భముగ పుస్తకప్రారంభమున ఈ క్రింది పద్యమును వ్రాసిరి.

సీ. "శ్రుతివిమలవేదాంత । ప్రకృతిశాస్త్రంబులఁ
బఠియించి పట్టంబుఁ । బడసె నెవఁడు
ప్రజలలోఁ బరిశుద్ధి । ప్రబలంబు గాఁగఁ బ్ర
సంగంబు లూరూర । సలిపె నెవఁడు
స్వాచరణంబుచే । బ్రాహ్మసమాజాభ్యు
దయ కారణుం డయి । తనరె నెవఁడు
దేశరాజాన్వయ । దీపకుం డై పెద
బాపయ్య యను పేరఁ । బరగె నెవఁడు

గీ. అస్మదీయ హితుఁడె గాక । యఖిల లోక
హితుఁడు నయి గుణోపేతుఁడై । యొసగె నెవఁడు
అట్టి వినుత చారిత్రున । కలఘు మతికి
నంకిత మొనర్తు మత్కృతి । నధికభక్తి."

బాపయ్యగారి చిరకాలస్నేహితులును, ఆంధ్రదేశ పత్రికలలో నగ్రస్థానము వహించిన కృష్ణాపత్రికా సంపాదకులును, అయిన ముట్నూరి కృష్ణరావుగారు తమ పత్రికారాజమున ౧౫-3-౧౯౧౭ తేదిన ప్రచురించిన సంపాదకీయమీ క్రిందను పొందుపరుపబడినది.

"బాపట్ల నివాసస్థులగు దేశిరాజు బాపయ్య బి. ఎ.

యల్. టి గారు నాలుగు సంవత్సరములనుండి క్రూరవ్యాధిచే పీడింపబడి తుదకు చెన్నపట్టణములో ౮వ తారీకు మధ్యాహ్నము ౧ గంటకు కాలముచేసి రని తెలియజేయుట కెంతయు దుఃఖించుచున్నాము. వీరు కొన్నిమాసములు రాజమండ్రీకాలేజిలో ఆంగ్లేయ తత్వశాస్త్రమును బోధించు చుండిరి కాని వీరి కక్కడ అగౌరవము కలుగుటచే ఆ యుద్యోగమునకు రాజీనామా యిచ్చిరి. ఈ వ్యాధిచేత వారి జీవితము దేశమున కెక్కువ ఉపకారి కాకపోయినది. కాని ఈ వ్యాధిచే పీడింపబడుచున్నను, చనిపోవునప్పటికి ౩౦ సంవత్సరములకంటె యెక్కువ వయస్సు లేకపోయినను, వీరి సుగుణపరిమళము దేశ మంతటను వ్యాపించి, వీరి మరణము అసంఖ్యాకులగు మిత్రబృందములను శోకవహ్నియందు పడద్రోచెను. వీరి సత్ప్రివర్తన యిట్టిదని పదములతో వర్ణించుటకు మాకు కలమాడకున్నది. ఒక్కపదము మాత్రము వీరి సత్ప్రివర్తన యిట్టిదని సూచింప గలుగును. అది "సుందరం." కుసుమములయొక్క సౌందర్యమును జూచితిమి. కేదారములయొక్క సౌందర్యమును గంటిమి. నరనారీమణులయొక్క సౌందర్యమును జూచి విస్మయించితిమి. కావ్యరచనల సౌందర్యమును జూచి ఆనందము నొందితిమి. కాని మానవప్రకృతియొక్క సౌందర్యము నెక్కడను జూచియుండలేదు. మేధాశక్తియందు విశేష తేజోవంతులు గలరు. అవక్రమపరాక్రమ

మందు ప్రచండమగు ధైర్యవంతులు గలరు. సాహసౌదార్య ములయందు మహాత్ములగు సజ్జనులు గలరు. భక్తివైరా గ్యములందు నిరుపమాన మగు సాధువులు గలరు. కాని ప్ర కృతిసౌందర్యము బాపయ్యగారి సత్ప్రవర్తనయందే జూడ గలిగి యుంటిమని చెప్పుటలో యెంతమాత్రమును అతిశయో క్తి లేదు. చంద్రునివంటి చల్లని కాంతి గలిగి, మనోహరమై కోమలమై, శాంతిదాయక మగు సుశీలమునకు వీరి జీవితమే ప్రథమనిదర్శనము. వీరి ముఖమండల మెప్పుడును చిరునగ వుతో ప్రకాశించుచుండెడిది. వీరి హృదయకమల మెప్పుడు ను ప్రేమసుగంధమును వెదజల్లు చుండెడిది. వీరి ధీబలము, సంకల్పశక్తి, వీరి ప్రేమాతిశయము, ఒక గుచ్ఛముయొక్క పుష్ప ములవలెను, ఒక గీతముయొక్క స్వరములవలెను, ఏకాత్మతను బొంది యున్నవి. వీరి హృదయము నవోత్పలకోమలంబై యుండినను, అసత్యమునకును, అధర్మమునకును, దురాచార మునకును, వీరి మనస్సు మహామహీధరాశ్మసంఘాతకర్క శంబై దనర్చెడిది. మానసోపాసనయందు నిష్ఠాగరిష్ఠుడై యజ్ఞోపవీతమును త్యజించి మానసరామునినే ఆరాధించు చుండెడి వాడు. సర్వస్వాతంత్ర్యమును సాధించుటకయి వర్ణ భేదములను త్యజించెను. దేశభక్తిని నిర్మలముగ నుంచుటకు విదేశవస్త్రములను విసర్జించెను. వీరు కొన్ని దినముల క్రిందట

మాతో నిట్లు నుడివిరి. "నాకు పూర్వము జీవించవలె నని యెక్కువ ఆశ లేదు. కాని దేశమునందు స్వరాజ్యోద్యమము ఉదయించి నప్పటినుండియు, ఈ ఉద్యమ మెట్లు సఫల మగునో చూచుటకు ఈశ్వరుడు నాకు మరికొన్ని సంవత్సరము జీవిత మొసంగు గాక" యని చెప్పిరి. ఆహా! వీరికి స్వరాజ్యముపై యెట్టి యాసక్తి! వీరు తరుణవయస్సునందే మెరుపుతీగవలె అంతర్ధాన మైరి. సజ్జనుల జీవితము కాలపరిమాణముచేత నిర్ణయించ కూడ దని ఆర్యోక్తి కలదు. ఓ భ్రాతృవరా! నీ ముఖారవిందము మరణజవనికచే మాకు మరుగైనను నీ జీవితము మా హృదయములయందు దివ్యజ్యోతి వలె శాశ్వతముగా ప్రకాశించు గాక !! "

న్నారు. దాని కేదో యర్థకూడ నిచ్చుచున్నట్లున్నారు. వారందఱు
దూ చీట్లపేక మన నాటకశాలలోనే యాడుకొనవచ్చునుగదా" యని.
) నాకీ యూహ తోఁచినది. ఇంగ్లీషులో నందము, సుఖము కలిగించు
ష్ట మని, యది మీకుఁ గలిగించుటకు మీ సంఘమును పేరు నుండవలెనని వ్రా
వాయించితిని. మీలోఁ గొంద ఱది పేకసంఘ మనుకొన్నారు.
పురాణములలో నొక కథ యున్నది. నార్సిసస్ అనునొక యందగాఁడు
లోఁ దన నీడ చూచి యింకెవరో యనుకొన్నాఁడట. ఫిబ్రవరి పది
ఁడు నాటకశాసనము తెలుపఁబడును. ఆనాఁడే మీ రందులోఁ
ంతురు. అక్కడ నెంతో విశాలముగా నుండును.
కెన్ని సాధకులకుఁగూడ స్థలము లేదు. ఆ దొడ్డిలో
ను కొన్ని వేయింతము. ప్రతిదినము సాయంకాలమున దొరగారు కూడ
మ్మనకు వచ్చుచుందురు." సభ్యులలోఁ జాలమంది ప్రశంసాకరాస్ఫాలన
జేసిరి. తమకు ధర్మ తగ్గననుకొనిరి. రంగనాథుఁగా రెంత మంచివా
గ్రీకుభాషా విషయములు, బహుభాషా విషయము లాయన కెన్ని తెలియు
చాలఁ జదివినవాఁడు - ఇప్పు డాదొరగా రాయనను గౌరవించుట
మెప్పుడో చేయవలసిన దనిరి. రంగనాథుఁడు చేయవలసిన పనియంతయు
మే చేసి యిప్పు డీయుపన్యాస మిచ్చెను. ఆ చేయవలసిన పని యేమనగా
మొక్క యధ్యక్షుఁడు, కార్యదర్శి, కార్యనిర్వాహకసభ్యులు- వీ రంద
నదివరకే మాటాడుట. అధ్యక్షుఁ డాయూరిలోని పెద్ద యుద్యోగి, జిల్లా
ఋ. కార్యదర్శి యుద్యోగము లేనివాఁడు. అన్నోదకములకుఁ గలిగి
ని నెత్తిన వేసికొని యాడెడివాఁడు. అతనికిని, రంగనాథమునకును
లి నెయ్యము. అతఁడు రంగనాథమున కేదో చుట్టము కూడను. కార్య
హకసభ్యు లైదుగురిలో ముగ్గురు తహసీలుదారు, మేజస్ట్రేటు, పోలీసు
ప్కరు. సామాన్యముగా నధికారులకు నధికారులయందు, ధనవంతుల
ను గౌరవము. బ్రిటిషువారు మన దేశములో రాజ్యము చేయుచున్నన్ని
సంఘము ద్వైధా విభక్తమైయుండెను. ఉద్యోగస్థు లందఱు నొక గుంపు
సామాన్యులతో మాటాడెరు. వారి మనస్సునకు సంస్కార మనునది యుం
కాదు. ఉద్యోగము చేయుట, డబ్బు సంపాదించుట, పదులు వచ్చినచో
కొని యుండుట. వారితోఁ గలసి తిరిగినచోఁ దమ మరియాద పోవు నను
ు. ఇట్లుండుటకుఁ గారణము చెప్పుదురు. సామాన్యులతోఁ గలసి తిరిగినచో
మొగమాటము లెక్కువయగును. వారి యుద్యోగధర్మములు నిర్వహించు
ిలుండడని. ఎక్కువ జీతము తెచ్చు నుద్యోగస్థుఁ డన్నచో గౌరవము.

జమీందారన్న [illegible]
సభ్యతకు, కార్యనిర్వాహకు లందఱు పూర్వమే రంగనాథము వేసిన పథకమున కంగీకరించిరి. వారి యంగీకార మున్నదని తక్కినవారి కంతకు ముందే తెలియును. ఒక రిద్దఱు వలదన్నను ప్రయోజనము లేదు. అందులో నొకఁడు చాకు వంటివాఁడు కలఁడు. అతఁడు వారందఱిలోఁ జాల మంచివాఁడు. అతని హృదయము మంచిది. కాని యతఁడు మాటాడుచున్నచో నెక్కిరించినట్లే యుండును. అంతియే కాదు. అతఁ డెప్పుడును నెక్కిరించుచునే యుండును. అతఁడు నింగ్లీషు బాగుగనే చదివినాఁడు. అతఁ డింకొక సభ్యునితో నిట్లనెను. “ఓకేయి! రంగనాథము చెప్పిన కథ బాగుగా నున్నదిరా. అనార్సిసను కథ యెంత యుచితముగా నున్నది! రంగనాథము కవి కాదటరా, యందులో డ్రామటిక్ ఐరనీ పెట్టినాఁడు. అనఁగా భవిష్యత్తులో జరుగఁబోవునది చెప్పినాఁడు. ఆ మాటలలోని యర్థము నాటకములో నితర పాత్రధారులకుఁ దెలియదు. నాటకము చూచేవారికిఁ దెలియును. అనార్సిసను తన యంతటి యందగాఁడు లేఁడని యహంకారము చేత నెవరి సౌందర్యమును మెచ్చుకొనెడివాఁడు కాదు. ఏ స్త్రీయొక్క సౌందర్యమును వానికి నచ్చలేదు. చివరకుఁ దన నీడ తానే చూచికొని మోహించి నదిలోఁ బడి చనిపోయినాఁడు. మన క్లబ్బుని కాఁబోవుచున్నదో యీకథతో రంగనాథము విస్పష్టముగాఁ జెప్పినాఁడనెను. ఆ రెండవ వాఁడు నవ్వెను. ఎందుకు నవ్వెనో తెలియదు. ఎందుకుఁ దెలియదు? వాఁడు లోకములో నున్న యొక మనుష్యుఁడు కనుక నవ్వెను. అనఁగా లోకములోని మనుష్యులు తమ యాపద చూచికొనరు. విచారణ లేనివారు. అవతలివాని యొప్పమైన, కృతకమైన వివేకమును మెచ్చుకొందురు. అది తిరువాతఁ దన నెత్తి మీఁదికి వచ్చినను సరే. ఇది మానవ స్వభావము. కనుక వాఁడు నవ్వెను.

రేపు నాటక మనఁగా నర్జునరావు వచ్చెను. రంగనాథము పూర్వమువలె దక్కిన పాత్రధారుల నందఱను దీసికొని రావలదని చెప్పెను. ఆనాఁడు నాటక మున్నది యని కూడ వ్రాయలేదు. ఊరకయే రమ్మని వ్రాసెను. అర్జునరావు వచ్చి యానాటకశాలను జూచి యచ్చెరువుపడెను. అక్కడనుండి యిద్దరు కోటకు వెళ్లిరి. అర్జునరావు దొరగారితో వారి నాటక కళాభిమానమును గూర్చి మిక్కిలి పొగడెను. తాను నెలనాళ్లలోఁ దన కుటుంబమును దెచ్చుననెను. దొరగారి కిదంతయు నాశ్చర్యముగా నుండెను. ఆశ్చర్యమో, సంతోషమో యెవరికి దెలియును? ఈసారి యవధాని లేకుండగనే రంగనాథము రాజదర్శనము చేసెను. రంగనాథము దొరగారితో నిట్లనెను. “రేపు ప్రొద్దున నెనిమిది గంటలకు నాటక భవనములో సరస్వతీ పూజ తమరే చేయవలయును. కోటనుండి సన్నాయి